# విషయానుక్రమణిక

## నవంబరు 1967





# రంగులు

శ్రీ పరిగి రాధాకృష్ణ

ఎన్ని రంగులు!
ప్రకృతిలో జీవితంలో సమాజంలో
మనిషి మనసులో భావనలో ప్రవర్తనలో
ఎన్నెన్ని రంగులు
నవరసాలకీ జీవితానుభూతులకీ
చిహ్నాలై భాసించే ఈ రంగులు
మనసులను మథన పెడతాయి.
మనుషులను మభ్య పెడతాయి.
మనుగడకు మెరుగులు దిద్దినట్టు కనిపిస్తూనే
బ్రతుకులను తికమక పెడుతుంటాయి.
ఉన్నరంగులు ఉన్నతికన్నా
ఉన్మాదాన్నే ఎక్కువగా సూచిస్తాయి!

కంటినిబట్టి రంగు మారదుకానీ
రంగునుబట్టి రసానుభూతి మారుతుంది.
రసానుభూతినిబట్టే బ్రతుకు విలువ పెరుగుతుంది.
గాజుప్రిసమ్‌లాంటి దీ జీవితం.
సరియైన కోణంలోంచి చూస్తేనే
అన్నిరంగులూ కనిపిస్తాయి.
అన్నిమార్పులూ వ్యక్తమవుతాయి.
చూసే తీరు సరిగాలేక
రంగులు కనిపించలేదని వాపోతే
అది ప్రిసమ్ తప్పెలా అవుతుంది?

తెలుపులో వెలవెలబోయే గుణముంది
నలుపులోనూ నిజమైన అందం దాగుంది.
నలుపైనా కోయిల కూతకు కమ్మదనం కొరవడదు.
రంగులు మార్చిన మాత్రాన
ఊసరవెల్లి అంటే అందరూ ఇష్టపడతారా?

స్వరూపం స్వభావాన్ని నిర్ణయించదు
స్వభావాన్నిబట్టి స్వరూపానికి విలువొస్తుంది.
రూపంకాదు ప్రకాశించేది
రూపం వెనకకల గుణం.
ఆహార్యానికీ ఆకర్షణకీ సంబంధం వున్నా
ఆకారానికీ అంతరంగానికీ సంబంధంలేదు !
ఆకర్షణ తాత్కాలికమయింది
అంతశ్శక్తి సార్వకాలికమయింది !

ఆకులన్నీ ఒకేరంగులో వున్నా
పూలు రకరకాల రంగుల్లో ఎందుకు పూస్తాయి
పండ్లు నానారుచులతో ఎందుకు కాస్తాయి?
రక్తవర్ణం మనిషి మనిషికీ మారదు.
జీవశక్తి ప్రాణికోటికంతా ఒకటే.
ఒకే చైతన్యం ప్రవహిస్తుంది నానారూపాల్లో
ఒకే మూలసూత్రం సృష్టిలో భిన్నాకారాల్లో
భిన్నత్వంలో ఏకత్వమంటే యిదే !
ఏ రంగు విలువ దానికున్నట్టు
ఏ మనిషి ప్రత్యేకత ఆ మనిషికుంది.
ఈ వైవిధ్యమే జీవితానికి వరం.
ఇదే జీవన చైతన్యానికి మూలం.
సృజనాత్మకశక్తికీ ఇదే కారణం.

వాసనలేని పువ్వుల్లా వుంటారు కొందరు
కాలాన్ని కళ్ళు మూసుకుని గడిపేస్తుంటారు.
కాగితపు పువ్వుల్లా ఆకర్షిస్తుంటారు కొందరు.
కొందరు రసార్ద్రదృష్టి తొణికిస్తుంటారు.
ప్రతి నిమిషాన్నీ జీవంతో నింపుతుంటారు.
కొందరు వస్తుతత్వాన్ని మించి వెళ్ళరు.
కొందరు పశుప్రవృత్తినుంచీ మళ్ళరు
కొందరే మనస్తత్వాన్ని తరచి చూస్తారు.
అందులో ఏ ఒక్కరో సత్యాన్ని పట్టుకోగలుగుతారు !
స్థూలంగా చూస్తే మనుషుల్లో రెండే రకాలు
కొందరు జీవితంనుంచీ ఎప్పుడూ ఏదో కోరుతూనే వుంటారు.
కొందరు జీవితానికే ఎప్పుడూ ఏదో యిస్తూనేవుంటారు !

# రంగులు

తెరమీద కనిపించే రంగులు నిజమైనవికావు.
రంగు పూసుకున్న నటుడు కార్చేవి నిజమైన కన్నీళ్ళు కావు.
కాషాయాంబరధారణతో ఎవడూ సన్యాసి కాడు.
ఎంత షోకు చేసుకున్నా వేశ్య అసలురంగు బయటపడుతుంది.
రంగుటద్దాల్లోంచి కనిపించేది నిజమైన లోకం కాదు.
నైట్‌లో నగరంలో రంగుల్ని చూసి మోసపోకు.
నాగరికత నగ్నత్వాన్ని చూసి దిమ్మెరపోకు.
నియాన్‌లైట్ల కాంతిలో నీడల్ని గమనించు.
రంగురంగుల కాంతుల నడుమ
రంగులేనితనానికోస మన్వేషించు
మసి చూరిన మనస్తత్వాల జోలికి పోకు
కసి పేరిన కల్మషాన్ని దగ్గర చేరనీకు!

ఏ రంగు లానందాన్నిస్తాయో
అవే రంగులు మోసగిస్తాయి.
ఏ బ్రతుకు సుఖమయమని భావిస్తామో
అదే బ్రతుకు నీడలో వేదన వుంది.
ఎక్కడో మెరిసే చుక్కల్నిగూర్చి
ఏవేవో ఊహాగానాలు చేసినట్లు
ఏమిటో తెలీని బ్రతుకులో ఎన్నెన్నో ఊహించుకుని
అనుకున్నది జరక్కపోతే ఆవేదన పాలవటం
అన్నది నిజమైతే మన ప్రజ్ఞగా చెప్పుకోవటం
జీవితరంగంలో జరిగే నాటకాలు చూస్తూనే
నిజానిజాల్ని కప్పే రంగుల్ని గమనించలేకపోవటం
ఇదీ బ్రతుకు పరమపదసోపానపటం!
చేసిన స్వల్పాన్ని చెప్పుకోవటంలో రంగు పూయటం
చేసిన తప్పును కప్పిపుచ్చడానికి రంగు పూయటం
నిత్యావసరాలుగా మారినప్పుడు
సత్యాన్వేషణాపథం కంటకావృతం!

గడియగడియకీ జీవితం
రంగులు మార్చుకుంటుంది.
మారే రంగులు కృత్రిమంగా మెరిస్తే
కృతకమైన ఆనందం కలుగుతుంది.
సహజత్వాన్ని పోషిస్తే
నిజమైన రసానుభూతికి దోహద మవుతుంది

ప్రకృతిని జయించాలని కంకణం కట్టుకున్న మనిషి
దాన్ని చూసి నేర్చుకోవాలనుకోడు!
మనిషికీ ప్రకృతికీ స్ఫూలంగా
భేద మొక్కటే ననిపిస్తుంది.
మనిషి మార్చినంత సులువుగా తొందరగా
ప్రకృతి రంగు మార్చదు!

పెరుగుదల ద్వంద్వాలకు సంబంధించింది.
మంచికీ చెడ్డకీ కూడ ఆ అవకాశముంది.
మనుగడలో మంచి పెరిగితేనే
పరిణామం ప్రగతిశీలంగా వుంటుంది.
మంచివేపు వెళుతున్నాననుకుంటూ
మానవుడు చెడువేపు పయనించే ప్రమాదముంది.
శాంతి నెలకొల్పుతున్నానని భ్రమించి
అశాంతికి బీజంవేసే అవకాశముంది!
న్యాయం ధర్మం సత్యం
మనిషి మనిషికీ మారవు.
వాటి స్వరూపం ఎప్పుడూ ఒకటే.
మనిషి దృష్టి మారుతూవుంటుంది కాబట్టి
అవీ మారినట్టు కనిపిస్తుంటాయి.

పసిపిల్లాడి మనసులో పాపానికి తావులేదు.
పసితనపు అనుభూతిని నిలుపుకోవటం
పెరిగే మనిషికి పరీక్షవంటిది.
అందరూ ఆ దివ్యానుభూతిని నిలుపుకోలేరు.
అంతరాలు సృష్టించే అసూయకు దాసు లవుతారు.
అరాజకానికి తలుపులు తీస్తారు.
అరవై నిండినా కొందరు అపరిణతంగా వుండిపోతారు
అంతకు సగం వయసులోనే కొందరు
పండు టాలోచనలు వెలార్చుతారు.
ఆలోచనలో పరిణతి
అనుభూతికి మెరుగుపెడుతుంది.
పరిణతిలేని మనిషి పాపాన్నర్థం చేసుకోలేడు
పరిస్థితులకు జడిసేవా డెప్పుడూ బ్రతుకును పండించుకోలేడు.

# ర ం గు లు

మితిమీరి నడిచేవాడు బ్రతుకు శాపాన్నుంచి తప్పించుకోలేడు.
దృక్పథాన్నిబట్టి నిర్ణయా లుంటాయి.
నిర్ణయాల నీడలోనే ఫలితాలు పొంచుంటాయి.
పాక్షికమైనదృష్టి పరిణామా న్నర్థం చేసుకోదు.
పచ్చదనాన్ని ఆహ్వానించదు.
సమాజంలో సంక్షేమాన్ని కాంక్షించదు.

రంగులు మార్చకపోతే
హంగులు సమకూరవని
మనిషి గట్టిగా విశ్వసించినపుడు
మనుగడలో కుదుపులు తప్పవు.
సమాజంలో అలజడి తప్పదు.
చీకట్లో రంగులన్నీ కలిసిపోతాయి.
దుఃఖంలో ఆశలన్నీ అడుగంటుతాయి.
వెలుతురులో అన్నిరంగులూ స్పష్టంగా మెరుస్తాయి.
సౌఖ్యక్షణాల్లో అన్నికోర్కెలూ స్పష్టంగా తెలుస్తాయి.
రంగులేని కష్టాల్లోంచి రంగులేని కన్నీళ్లొస్తాయి.
కన్నీళ్లు కనిపిస్తాయి బాధను పలికిస్తాయి.
కష్టాలకు బాహ్యరూపాలుగా మెరుస్తాయి.

చీకటికీ వెలుతురుకూ రంగేమిటి?
చావుపుట్టుకల నిజస్వరూప మేమిటి?
కనిపించే రంగులు కొన్నైతే
కనిపించని రంగులు కోటి.
ఈ కనిపించని రంగుల క్రోవలోనివే
చావుపుట్టుకల స్వభావాలు.
చీకటి వెలుతురుల నిజరూపాలు.
శూన్యంలోంచి మనిషి ఆకారం దాల్చినట్టు
రంగులేనితనంలోంచి రంగులు పుట్టుకొస్తున్నాయి.
రూపరహితమైన ఆత్మలోంచి
అన్నిరూపాలూ ఉద్భవిస్తున్నాయి.
ఇన్నిరంగుల్ని సృష్టించినవాడికి రంగులేదు.
ఇంత జీవశక్తికి కారణభూతుడైనవాడికి రంగుభేద ముంటుందా?
మనిషికీ మనిషికీ మధ్యనే రంగుభేదం
మనిషివల్లనే మనిషికి ఖేదం!

మెఱపును చూడాలనుకుంటే
మబ్బు లుండడం అత్యవసరం.
విద్యుద్దీపకాంతుల్లో పరవశించాలంటే
చీకటి అవసరాన్ని గుర్తించాలి.
చీకట్లోనే మిణుగురు పురుగులు
చూడముచ్చటగా వుండేది;
నైరాశ్యం నిండిన వేళలోనే
ఆశకోసం మనిషి వెతుక్కునేది.
కాలానికి చిహ్నమైన గడియారపు పెండులం
ఒకే చివరలో నిలవడం అసంభవం.
రెండు చివర్ల నడుమ అది ఊగుతూ వుండాల్సిందే!
పుట్టుకలో నవ్వు ఆనందం ఎంత సహజమో
చావులో దుఃఖమూ దైన్యమూ అంతే సహజం!
నలుపు తెలుపుల నడుమ నానారంగుల తోరణముంది.
చావు పుట్టుకల నడుమ విభిన్నానుభూతుల గొలుసుంది!



# తెలుగు - తమిళము - (ద్రావిడ భాష)

## శ్రీ నిడుదవోలు వెంకటరావు

నేడు తమిళ, కన్నడ, మళయాళ భాషలు, తెలుగుతో కూడ ద్రావిడ భాషలని వ్యవహరింపబడుచున్నవి. సామాన్యముగా నీ భాషలు నాల్గింటికి ద్రావిడ భాష అని వాడుకయున్నను, వానిలో 'ద్రవిడ' శబ్దము తమిళమునకే, తొలినుండి పర్యాయపదమైనట్లు కాన వచ్చుచున్నది.

తెలుగున శివకవియుగముతోపాటు మనకు— ద్రవిడ భాషా సంబంధము దృఢపడినది. శివకవులలో తృతీయుడు పాలకురికి సోమనాథుడు. మొదట— నీ సంబంధము, భాషాసాహిత్యపరములుగా వ్యక్తపఱచి యున్నాడు. ఇందు 'తమిళము' అను మాటయే కాన రాదు. ద్రావిడ శబ్దము భాషాపరముగా మొదట సోమ నాథుని వృషాధిప శతకమున గానవచ్చుచున్నది.

పరమనె యన్ను యాండవనె
పన్నుదయానె యనాద నాదనే
పెఱియనె పేని వుండవనె
పేరుదయాయనె పేరు జెప్పనే
తఱిముఱియా యెనే యనుచు
'ద్రావిడభాష' నుతింతు నిన్ను మ
ద్వర కరుణా విధేయ
బసవా! బసవా! బసవా! వృషాధిపా.

59 వ పద్యము.

సోమనాథుని పండితారాధ్య చరిత్రమున— ద్రవిడ శబ్దము ప్రయుక్తమగుటయేగాక, ఆ భాషలో కొన్ని పంక్తులును నుదాహరింపబడినవి.

(1) 'తప్పదఱెల్లనను ద్రావిడ భూమి
జెప్పనొప్పు తిరునాళ్ల బ్రోవయనగ.'

దీక్షా 1—145. పుట.

ఇచట ద్రావిడభూమి యనగా తమిళనాడు.

(2) 'ఇలనొప్పు ద్రవిడ మహీస్థలి యందు'

మహిమ—2—124.

ఇచ్చట ద్రవిడ మహీస్థలి యనగా తమిళనాడు. ఇచ్చట—'ద్రవిడ' అను హ్రస్వరూపమున్నది.

(3) గౌళరాగములు
మాళవగౌళ రామక్రియ శాయ
గౌళ 'ద్రావిడ'గౌళ కర్ణాటగౌళ

పర్వత - 2—454.

గుజరి

'గుజ్జరి సౌరాష్ట్ర గుజ్జరి ద్రవిడ గుజ్జరి.'

2—454.

ఈ ప్రకరణముననే, ద్రవిడభాషలో పంక్తు లున్నవి.

'అరుదొంద నట్ల యయ్యరవ దేశంబు
వరుసయు ద్రావిడభాష సొంగముగ.'

ద్రా వి డ భా ష

'అరులు గిరితి యెన్నె యరనేపిరానె
చిరిగిరినిలయనె చివనే యాణ్డవనె
అంగమాఱుందానె యాయిరుందవనె
మంగయర్ పొంగనె మల్లికార్జునవె
యాను నక్కడియెనే నకిలనాయకనె
ఱూనమిల్లాదానె ఱిమయినిల్లియనె
అఱువత్తుమువ్వర క్కాత్మనాయక...
మఱి వాలు మఱియాద మల్లికార్జున...
అలాలగండనె యాదియ్యటవనె
చూలియే మల్లికార్జునవె యన్నవనె
యెల్లయిల్లాదానె యెఱుగ్గముళ్లవనె
చొల్లవల్లాదానె మల్లికార్జునవె
ఆఱుమిమ్మడుం తిఱునీఱుముళ్లవనె
ఏతేఱుమీచనె యెల్లమల్లయనె

వేదియరుతుదిక్కుమాదియే చివనె
చోదియే మల్లికార్జుననె యన్నవనె.'[1]
2-388-404.

పై యుదాహరణలనుబట్టి — తమిళభాషకు దేశమునకు ద్రావిడ, ద్రవిడ అను పేళ్లుకాక — అరవ- అని మఱియొక పేరున్నట్లు స్పష్టము.

సోమనాథుడు 'ద్రవిడ' శబ్దమే హెచ్చుగా నుపయోగించినను - తన కాలమున, 'అరవ' అని మఱియొక పర్యాయ పదము విచ్చియున్నాడు. దీనికి కారణము లేకపోలేదు.

ద్రవిడ శబ్దము సంస్కృత శబ్దము. ఇది ద్రవిడ భాషాతత్త్వమునకు విరుద్ధమైనను చిరకాలము నుండి భారత వర్షమునందంతటనూ ప్రచారములో నున్నది. ఇక 'అరవ' శబ్దము, దేశి శబ్దము. ప్రజా సామాన్యమున వాడుకలో నున్నది. కొబట్టియే రెండింటిని సోమనాథుడు చూపించియున్నాడు.

సోమనాథుడు 'అఱవదేశము' అని పేర్కొన్నను తరువాతి తెలుగు కవులు—ద్రావిడులను, తమిళులని వాడక 'అఱవలు' అనియే వాడిరి.

(1) 'ముఱికినాటి వార లఱవలు' కేతన—ఆంధ్ర భాషా భూషణము.

(2) 'అరెలు—కన్నడీ లఱవలు తెలుగులు—
తన బిరుదందియ్యే దగిలి కొలువ'
.. గోవరాజు సింహాసన 1—42 ద్వాత్రింశిక

(3) 'క్రమముగ 'శ్రీమత్సకలగుణ సంపన్న'
యని యున్న జదివెడు నఱవవారు'
బిల్వేశ్వరీయము 1 చి.

ఈ అఱవశబ్ద మీ క్రింది నానుడిలో నున్నది.
'అఱవఱ ధ్యానము కన్నడకస్తూరి తెలుగుతేట'.

(4) కంచి యఱవత లసమాస్త్ర ఖడ్గలతలు'
కాశీ 5 ఆ.

అని శ్రీనాథుడు--'అఱవత' అను స్త్రీ వాచకమును వాడియున్నాడు.

అఱవలని వాడుకయున్నను అఱవ శబ్దము కన్న—ద్రవిడ శబ్దమే తెలుగునాట విశేషప్రచారములో నున్నది. తెలుగు కావ్యములలో - ద్రావిడ మధ్యభూమి- ద్రావిడాగమ సార్వభౌముడు- ద్రవిడవేదము — అనునవి కన్పట్టుచున్నవి. ఇక తెలుగు బ్రాహ్మణులలో 'ద్రావిడులు' అను శాఖీయులు గలరు; వీరైదు తెగలుగా వ్యవహృతులు.

1. పేరూరి ద్రావిడులు
2. దిమిలె ద్రావిడులు
3. ఆరామ ద్రావిడులు
4. పూదూరి ద్రావిడులు
5 పడమ ద్రావిడులు[2]

## దక్షిణాంధ్ర వాఙ్మయము

### ద్రావిడభాష

పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్ర వెనుక ద్రావిడభాష నుదాహరించిన తెలుగు కావ్యములు — దక్షిణాంధ్ర వాఙ్మయమునదేయని చెప్పవచ్చును. నాయకరాజులు తమిళదేశమునకు పాలకులైనప్పుడు తమ దేశభాషయగు తెలుగును రాజభాషగా చేసినను, తమిళ ప్రజానీకము మాటలాడు తమిళ భాషలోకూడ వ్యవహరించెడివారు. ముఖ్యముగా, రాజకీయముగా - తమిళము తప్పదు. నాయకరాజులు శాసనములను తమిళములోనే వెలయించిరి. కాని విజయ రాఘవ నాయకుడు మాత్రము—నాగపట్నము రేవువద్ద వర్తక వ్యాపారములకొఱకు — ఒలాందావారి కిచ్చిన నమ్మక శాసనము - తమిళమునవేకాక తెలుగులోకూడా వేయించియున్నాడు.[3] తక్కిన వ్యవహారములలో—తమిళము వాడుకలోనున్న ట్లీ క్రింది గ్రంథోదాహరణము లనుబట్టి తెలియగలదు.

---

1. ముద్రిత ప్రతిలో సరిగా లేని పాఠములను కీర్తిశేషులు వెంకటరాజారెడ్డిగారి సాహాయ్యమున పరిష్కరించినాను.

2. పంచ ద్రావిడుల యుత్పత్తి—ఆ. రామ చంద్రయ్య, కలెక్టరు, నెల్లూరు - 1890.

3. ఈ శాసనములు - వెండి తేకుపై చెక్కబడి— నేటికిని 'జావా'యందు 'బటేవియా' చిత్రపసు ప్రదర్శనశాలలో భద్రపఱుపబడి యున్నవి. వివరములకు- 'దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము' అను గ్రంథము చూడుడు. పుటలు 546—548.

## మన్నారుదాస విలాసము

**అన్నగళమాట :**

'శామిపరాక్కు కెళక్కెమన్నారు కోవిల్లె యిరుం దుంపంగునిత్తిరుణాళుక్కు తెంగాయవాంగ, కెంగోలు పారుపత్యగారనుం అంజ్జినవె నిర్వాహత్తు నంబి మారుం తలత్తారుం జియ్యాళుం యేకాంగియళుం వైరావియళుం కొత్తియళుం శ్రీపాదంతాంగియళుం తిరువాభరణక్కణక్కప్పిళ్లెయళుం రాగభోగత్తారుం గూడి ఆనెమేలె శ్రీముఖ వెళిందరుళప్పణ్ణి క్కొండు వందు శముగత్తిలె అరిక్కెపణ్ణచ్చొల్లి ఆశారవాళిల్లె కాత్తిరుక్కురార్‌గళ్ శిత్తం.' (పుట 3)

**కటికవార్ల మాట :**

'హోహోయి నంబిమారుం తలత్తారుం జియ్యాళుం కొత్తియళుం కణక్కప్పిళ్లయళుం రాగభోగత్తారుం యెల్లారుం సముగత్తుక్కు వారుంగో' (పుట. 4)

**కోవిల కరణికులు : లెక్కలు వినిపించుట.**

మూణెముక్కాలె మూణుమాముక్కాణి, మూణెముక్కాలె, మూణుమాముక్కాణి, అరె రెండు మాక్కాణి అరె రెండు మాక్కాణి శామిపరాకు, లక్షత్తంబెదునాయరం బొన్నుక్కు తిరువిళయాట్టు గ్రామంగళానడక్కురధు అధిశెగ్రామంగళాయెం శ్శెంధు, ఉత్కడయల్ యెళువత్తనాలు, మడప్పురం పనిరెండు, కచ్చనత్తిలె మూణుమహాణం నడక్కుధు యిదిక్కుమన్నంగాలులె మూణులక్షక్కలనెల్లుం, ముప్పదునాయరం పొన్నెన్నుం గుత్తహిపత్తె యెళధి క్కొండాన్. (1)

**మరొక కరణం చెప్పేది :**

స్వామి పరాక్కు, అందప్పడిక్కినెల్లుం అళవామల్ పొన్నుం శెలిత్తామల్ మణియగారన్ కోవిలప్పత్తరం నడప్పి వియ్యామల్ అల్లాంబాత్తుకొళ్ళరోమెన్ను నెల్లల్లాం పరంబాశాచ్చాన్, కోవిళుక్కు శిరిప్పు కట్టళయు, ఆరమనెయిలె దినమెన్నుకు అంబెదు పొన్నుక్కుడుక్కురా ప్పోలెయాచ్చిధు (2)

**వేఱొక కరణం చెప్పేది :**

శామిపరాక్కు, యిదుతవిద, పుష్పవనత్తిలె లక్షత్తునం బెదు నాయిరం యిలెప్పె మరం, అంబెదు నాయిరక్కలక్కొట్టెకాణుం అధల్లాం కరత్తొరయిలె కెందుపొరధు, క్రయక్కారం గయిలె కడన్ గట్టా తిరువెళక్కు యెణ్ణికొళ్ళాప్పోలెయాచ్చి, ఉత్తర పారుపత్యగారన్, అంగుం యింగుం వోడిక్కుందు తిరియిరిధి వొళియ వొణ్ణుం పరామరిశిక్కురుధిల్లె.

**మరొకండు :**

శామి అడియెణ్వెణ్ణప్పంకెట్టరుళ, నంబిమారు యెల్లాంకొళంబుప్పాలుం, తిరువిశాంసాపద్రడధివాళియ, వొరువరాహిలుం వొణ్ణుం అరిక్కెయిడ్రవాళిల్లె యిదుత్తవిర, ఆరమనెయిల్ కరక్కట్టు కాల్కట్టుక్కు, ముప్పాయిరం పొన్ను, మొదల్ కడన్, ముప్పాయిరముం కుడుత్తిరుక్కురదు, అదువుం అరువుప్పణ్ణి అందప్పణముం తండయిల్లె స్వామి శిత్తం. (4)

**మణియగాండు చెప్పేమాట :**

సామి అరమనెయారిట్ట శొండెక్కెల్లాం, అడియె నిరుక్కిరేనే, కణక్క వెళింగి యెమ్మెలే శొమంద్దదెల్లాం కుడిక్కిరేన్.

## విజయరాఘవ నాయకుని నాటకములు

### రఘునాథాభ్యుదయము :

చిదంబరనాథమొదలారి : సముఖత్తిల నింగశేన్ అడిచ్చి పడ్డిర్ ఎల్లాం కర్తక్కల్ చిత్తమరియుం సుమ్మామియిరుంగో.

### విప్రనారాయణ చరిత్ర :

పూజారి : ఓహోహో! యిదెన్నడా! యిదెన్నడా! పంచపాత్రంగళిలే వొరుపొన్ను కిణ్ణి కాణోం, మోసం వందుదే, అడకూరతాళ్వారే.

కూర— అడియేన్.

పూ - అడ ఎంబెరుమానార్.

ఎం—అడియేన్.

పూ—అడ పరాంకుశా.

పరా—అడియేన్.

పూ - సన్నిధియిల్ వొరుపొన్ను కిణం యేన్ కాణోం యిదెన్న పిళ్లాయి?

శరా—ఇదెన్నయ్యా! నమ్మ్కేళ్ క్కులిర్. నాంగళెల్లాం దేవరర్ ధీరఫే అన్నో వందోం.

పూ—అనాక ఇందై క్కు పంచపాత్రంగళ్ కుడ్డి వణ్ణినవరార్.

పిళ్లాయి—ఉమ్మెత్తవిర వాంగళేన్న తిరుక్కావ్పు వూట్టు వాంగినోమో కిణ్ణంగళై త్తొట్టమో నమ్మె కేళ్ప్పావేన్ యిండ్రైక్కు పుమ్మడయ వరిశైయండ్రో.

## సాహిత్య సంప్రదాయములు

తెలుగున, సాహిత్య సంప్రదాయములు ప్రాయికముగా సంస్కృతము ననుసరించినవే. అయినను నొకటి రెండు తమిళము ననుసరించినవి.

### చతుర్విధ కవితలు

ఆశు, మధుర, చిత్ర, విస్తర కవితలు—అను నీ నాలుగు విధములును, నన్నయనాటినుండి యున్నవి. కాని తెలుగు లాక్షిణికులలో పూర్వులెవ్వరును దీని పేర్కొనలేదు.[4] కవులు తమ కావ్యములలో పేర్కొన్నారు.

ఆశుమధురచిత్ర విస్తరకవితా విశారదులు. అన్నయ—షోడశ కుమార చరిత్ర,

ఆశు మధుర చిత్ర విస్తర కవితలు: — పరమయోగి విలాసము, తిమ్మరాజు.

ఆశు మధుర చిత్ర విస్తరములు—పింగళి సూరన-కళాపూర్ణోదయము.

ఆశువు, మధురము, చిత్రము, విస్తరము—గణపవరపు వెంకటకవి.

చిత్ర విస్తర మధు రాశు లీలకవిత — తారాశశాంకము —వెంకటపతి.

ఈ విభాగము, సంస్కృతాలంకారగ్రంథములలో గాని, ఇతర ఛందోలక్షణగ్రంథములలోగాని లేదు. తమిళమున క్రీ. శ. 11 వ శతాబ్దినాటి 'పిట్టియల్' అను లక్షణ గ్రంథము గలదు. అందు 'యాప్పిరంగళ్ కారికై' అనునది దాని వృత్తి గలదు. ఆ గ్రంథమున, 'ఆసు, మదుర, చిత్తర విస్తర' అని యీ విభాగము కలదు. పైవానిలో 'మదుర' అను పది 'మధుర' శబ్దమునకు తమిళరూపము. కాని 8 వ శతాబ్దికి పూర్వమే, తమిళదేశమున వెలసిన, వైష్ణవాళ్వారులలో, మధురకవిఆళ్వారు గలడు. అతనికి 'మధురకవి' అని సంస్కృత నామమే నిలిచియున్నది. దీనినిబట్టి యీ సంప్రదాయము తమిళమున ప్రాచీనమని చెప్పవచ్చును. తెలుగున, మధురకవితలు ఉదాహరణములు[5], రగడలు, పదములు మొదలగు రచనలు—అని నిర్వచనము, ఇవి యన్నియు దేశికవితలే. కావున నీ సంప్రదాయము దేశిసంప్రదాయమని చెప్పవచ్చును.

## మతము—సాహిత్యము

తమిళమునకు తెలుగునకు భాషాసాహిత్య సన్నిహితత్వము గలిగించినవి శైవ వైష్ణవ మతములు. వీనిలో శైవము ప్రాచీనమై తెలుగున తమిళ కథావస్తువులను గ్రహించుటకు నవకాశము గలుగజేసినది. వైష్ణవము భాష విషయమున నూతన పదజాల మేర్పడుటకు కారణమైనది.

### శై వ ము

కన్నడాంధ్రదేశముల వీరశైవమత వ్యాప్తికి హేతువైన పాల్కురికి సోమనాథుడు—తమిళదేశమున బహుప్రాచీనకాలమునుండి వెలసిన తమిళ దైవభక్తుల చరిత్రలను -ఆంధ్రలోకమునకు పరిచయ మొనర్చినవాడు. తమిళదేశ శైవభక్తులకు 'నాయన్మారులు' అని ఆ భాషలో పేరు. తెలుగున వారు -'నాయనార్లు' అని వ్యవహరింపబడుదురు. వారు అరువది ముగ్గురు. వీరందఱును క్రీ. శ. 11 వ శతాబ్దికి ముందువారు. తమిళమున వీరి చరిత్రలున్న గ్రంథమునకు 'పెరియ పురాణము' అని పేరు. అదియే తెలుగున 'అరవత్తుమువ్వురు నాయనార్లచరిత్ర'గా పెంపొందినది.

తొలిసారిగా, తెలుగువారికి తమిళభాషా పరిచయము గలిగించినవాడు సోమనాథుడని యీనాటికి

4. క్రీ. శ. 17 వ శతాబ్దిలో పొత్తపి వెంకటరమణకవి తన లక్షణదీపికలో వీనిని పేర్కొన్నాడు.

5. ఈ ఉదాహరణశాఖను నేను గుర్తించి, ఈ వాఙ్మయ చరిత్రయంతయు వ్రాసితిని.

నిరూపించితిని. అతడు వీరశైవమత ప్రచారముకొఱకు నీ 'యరవత్తుమువ్వురు' చరిత్రలను తన గ్రంథము లలో నిమిడించియున్నాడు. బసవపురాణములో, పండితారాధ్య చరిత్రలో. వీరి యుదంతము గలదు. ఈ అరువత్తుమువ్వురును సహస్రగణమాలికలో చేర్పబడినారు.[6] కాని యీ అరువదిముగ్గురులో నీ క్రింది వారినిగూర్చియే కథలు విశేషముగా వ్యాప్తిలోనికి వచ్చినవి.

1. సిరియాలుని కథ (చిఱుత్తొండనంబి).
2. కన్నప్ప—(నేత్రేశ నాయనారు).
3. నంబెన్న కథ (సుందరమూర్తి నాయనారు)
4. కుమ్మరి గుండయ్య (తిరునీలకంఠ నాయనారు).

పై వానిలో చిఱుతొండనంబి కథను శ్రీనాథ మహాకవి తనహరవిలాస కావ్యమున— మొదటి రెండాశ్వాసములలో విస్తరించి వ్రాసియున్నాడు. వీరశైవ సంప్రదాయికములగు కథలను మతసాంకేతికత నుండి తప్పించి కేవల సాహిత్యవీథిలో మొదట ప్రవేశపెట్టిన మనీషి శ్రీనాథుడు. ఆ వెనుకనే, వీరశైవ కథలు తెలుగు కావ్యసాహిత్యములలో ప్రచారమునకు వచ్చినవి.

సోమనాథుడు పై కథలను సంగ్రహముగా తన గ్రంథములలో తెలిపియున్నాడు. కాని శ్రీనాథుడును, తక్కినవారును ఆ కథలను పెంపుచేసినప్పుడు తమిళదేశమున వ్యాప్తములోనున్న కథాంశములను చాలవఱకు గ్రహించిరి. దీనివలన తమిళమునకు తెలుగునకుగల సంబంధము చాలవఱకు దృఢపడినది.

పై కథలలో కొన్ని కావ్యసాహిత్యమున ప్రఖ్యాతములైనవి. వానినిట నుదాహరించుచున్నాను.

1. చిఱుతొండనంబి కథ (సిరియాళచరిత్ర): ప్రబంధ, ద్విపద, యక్షగాన, వచన శాఖలలోనున్నది. సిరియాళ చరిత్రమను ప్రబంధము మూడాశ్వాసముల కృతి. గరికపాటి తమ్మయకవి. అముద్రితము. క్రీ. శ. 1670.

2. కన్నప్పకథ (నేత్రేశనాయనారు):— కంచి రాజు సూరయ. ప్రబంధము లభ్యము కాలేదు. ధూర్జటి శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యము, 3 ఆశ్వాసము.

3. నంబెన్న కథ (సుందరమూర్తి నాయనారు):— అజ్జరపు పేరయ లింగకవి, ఒడయనంబి విలాసము.

4. కుమ్మరి గుండయ్యకథ (తిరునీలకంఠ నాయనారు):—అమలాపురపు సన్యాసి; కుమ్మరిగుండయ్యచరిత్ర; 3 ఆశ్వాసములు; అముద్రితము (క్రీ. శ. 1850).

ఈ కావ్యముల కథావస్తువు లన్నియు, తమిళ సాహిత్యమునకు సంబంధించినవే.

పద్యము:— ఈ అరువత్తు మువ్వురు నాయనారుల చరిత్రలకు పద్యరూపమున తొలుత రచించిన కవి అత్తలూరి పాపకవి. ఈతడు క్రీ. శ. 1790 ప్రాంతమువాడు. ఈతడు రచించిన స్కాందోప పురాణము లేక హరభక్తవిలాసము అను మహాకావ్యమువ నివి గలవు. ఇది అముద్రితము.[7]

వచనము:—ప్రసిద్ధవచన రచయిత - ఓ. వై. దొరసామయ్యగారు— క్రీ. శ. 1900 లో 'భక్తలీలామృతము' అను పేర నీ అరవత్తుమువ్వురు చరిత్రలను చక్కని వచనశైలిలో సంతరించిరి.

అద్యతనకాలమున— శివభక్త విలాసము (గ్రంథకర్త—పొంగులూరి సూర్యనారాయణశర్మగారు) వచనమున వెలసినది. ఇది పై కృతివంటిదే. క్రీ. శ. 1962.

పై దానినిబట్టి — తెలుగున తమిళ సాహిత్యము వీరశైవమతము మూలముగనే ప్రవేశించినదనుట స్పష్టము.

---

6. ఈ సహస్రగణమాలిక—పండితారాధ్య చరిత్రమున పండితుడు పఠియించినట్లున్నది. (మహిమ ప్రకరణము). కన్నడకవి చరితమున నిది పండితారాధ్యుని కృతిగానే వ్రాయబడియున్నది. (చూ. ప్రథమ సంపుటము—120 పుట). ఇది కన్నడమున గూడ నున్నది. ఇది పాల్కురికి సోమనాథుని స్వోపజ్ఞము. చూ. పాల్కురికి సోమనాథుని లఘుకృతులు—పీఠిక -15. శివశ్రీ బండారు తమ్మయ్యగారు. 1962.

7. ప్రఖ్యాత విద్వత్కవులు పుత్తలపట్టు శ్రీరాములురెడ్డిగారు పెరియపురాణమును సంపూర్ణముగా పద్యకావ్యముగా నమవదించిరి. ఇది యముద్రితము.

## భా ష

ఈనాడు తెలుగు — ద్రావిడభాషలలో నొకటియని భాషాతత్త్వశాస్త్రవేత్తలు నిర్ణయించి యున్నారు. వీరశైవ సాహిత్యమూలమున తమిళభాషా పదములు, శివకవుల రచనలలో పొందుపడినవి. వానిలో గొన్నింటి నుదాహరించుచున్నాను.

| | | | |
|---|---|---|---|
| బడరుడు | తమిళ | వడారన్ | వ్యాపారము |
| వాయి | ,, | నాయి(కుక్క) | నన్నెచోడని కుమారసంభవము |
| మలరు | | మలర్(పువ్వు) | |

శివకవులలో హెచ్చు తమిళ పదము లుపయోగించినవాడు సోమనాథుడు. అలరు, అవియు, ఇండె, ఈ, ఇర్నాలుగు, ఉలివు, ఓజు, కరువు, కేనిచిఱు, చూడు, చొట్లు, తెరవు, తిరుపాట, తిరువీధి, తిరుముట్టమ్, మొసరు, నంగ, పని, పిడి, మడది, మెయి, మఱువడు, సేల్లువందు. సోమనాథుడు తమిళభాషను చూపునపుడు – సంస్కృతమువలెనే అనుకరణ విధానమునే అవలంబించియున్నాడు. మఱియు నెచ్చటను – తెనుగు, తమిళ పదములతో మిశ్ర సమాసము చేయలేదు. దీనినిబట్టి సోమనాథుడు రెండింటిని ప్రత్యేక భాషలుగానే పరిగణించెనని స్పష్టపడుచున్నది.

## వై ష్ణ వ ము

విశిష్టాద్వైత మత సిద్ధాంతము రామానుజులవారు క్రీ. శ. (1017–1117) తమిళము నందే వ్యాపింపజేసిరి. వారును తమిళభాష మూలముననే మత ప్రచారము చేసిరి. తమిళమున వైష్ణవ వేదమునకు ద్రవిడవేదమని పేరు. కాని తెలుగు దేశమున క్రీ. శ. 12, 13, 14 శతాబ్దులలో శైవమే ప్రధానముగా నుండుటచేతను, రాజు లామతమునే పోషించుటచేతను సాహిత్యమున శైవమత ప్రభావమే యుండుటచేతను, వైష్ణవ మతవ్యాప్తికి పరిస్థితులు తోడ్పడలేదు. తమిళ శైవ సాహిత్యమంత విరివిగా తమిళ వైష్ణవ సాహిత్యము - తెలుగుపై ప్రసరింప లేదు. [illegible] 15 శతాబ్దినుండి, [illegible]ష్ణవ సంప్రదాయ గ్రంథములు ఆళ్వారుల చరిత్రలు కావ్యసీథి నలంకరించినవి. వానిలో ప్రథమము శ్రీకృష్ణదేవరాయలవారి ఆముక్తమాల్యద తరువాత వచ్చినది. పన్నిద్దరాళ్వారులు అనబరగిన వారిలో శ్రీ ఒక్క ఆముక్తమాల్యద మాత్రమే. తక్కిన ఆళ్వారులలో బహుజనాదరణ గడించినది, తొండరడిప్పొడి ఆళ్వారు చరిత్రలే. ఈ కాలముననే తాళ్లపాక చిన్నన్న పరమయోగి విలాసము – ద్విపద – (ఇది ఆళ్వారుల చరిత్రయే), సిద్ధిరాజు తిమ్మరాజు పరమయోగి విలాసము అవతరించినవి చదలవాడమల్లన విప్రనారాయణ చరిత్ర, సారంగు తమ్మయ వైజయంతీవిలాసము నీ కథనే తెలుపును.

కాని ఇవి యన్నియు ద్రావిడమూలము ననుసరించి వచియేయని చెప్పవలనుపడదు ఏల యనగా నీ కాలమునాటికి మూలద్రావిడ గ్రంథములు సంస్కృత భాషలోనికి అనువదింపబడినవి. తెలుగు కవులు సంస్కృత మూలమునే యనుసరించి యుండవచ్చును. ఏమైనను కథావస్తువులు తమిళవైష్ణవ సంప్రదాయమునకు సంబంధించినవి యగుట స్పష్టము.

ద్రావిడవేదము క్రీ. శ. 1300 నాటికే కృష్ణమాచార్యుడు వచనకావ్యముగా తెలుగులో రచించియున్నాడు.[9]

దీనినే – 'దివ్యప్రబంధమని' యందురు. 'నాలాయిరమ్' అని తమిళ నామధేయము. దీనిని సంస్కృతములోను, తెలుగులోను శ్లోక పద్యములతో శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు అనువదించిరి.

భాషలో – తిరు – అను పదముతోనున్న వన్నియు తమిళభాషామూలమున వచ్చినవియే యని చెప్పవచ్చును. తెలుగు కవులు వీని నుపయోగించియున్నారు

తిరువారాధనము, తిరువరంగము, తిర్వధ్యయనము, తిరుక్కాప, తిరుకావి, తిరుపతి, తిరుమణి, తిరుమంజనము, తిరువాయి, మొదలగునవి.

వైష్ణవమతము సాహిత్యమున వ్యాపించిన కాలమునుండియు ననగా కృష్ణదేవరాయల కాలము నుండియు, ఈ 'తిరు' సంబంధపదములు ప్రచారము

---

8. చూ. విప్రనారాయణ చరిత్ర పీఠిక— ప్రస్తుత గ్రంథకర్త. ఆంధ్రసాహిత్య పరిషత్తు ప్రచురణ – 1940.

9. వచన వాఙ్మయ ప్రథమాచార్యుడు కృష్ణమాచార్యుడు. (భారతి, జూన్ 1945).

లోనికి వచ్చినవిగాని, యంతకుముందుకాలము నందిట్టివి లేవు. పాల్కురికి సోమనారాధ్యుడు బసవపురాణమున నొక్క పర్యాయము మాత్రమే ఙూ తిరు సంబంధపదము ప్రయోగించి యున్నాడు.

'అంచుఁ దిర్నీరు మంత్రించి'

బస. 6.172 పంక్తి

## భాష — వ్యాకరణము

తెలుగున తత్సమ తద్భవ విభాగమైన వెనుక మిగిలిన అచ్చ తెనుగు పదములలో పెక్కింటికి తమిళభాషతో సాదృశ్యము లున్నవి.10 పదజాలమేకాక భాషయొక్క ప్రత్యేక వ్యక్తిత్వమును నిరూపించు, సంఖ్యా వాచకములు, సర్వనామములు, విభక్తులు, సంధి కార్యములు, వీనియందు సమాన లక్షణము లుండుట చేత, భాషాశాస్త్రజ్ఞులు—తెలుగునకు మూలమగు అచ్చతెలుగునకు తమిళభాషతో సాహిత్యమున్నదని స్పష్టపఱచిరి. ఇంతేకాక, తమిళదేశమును, తెలుగు దేశమును ఒక దానితోనొకటి దక్షిణమున నంటి యున్నవి. తమిళులకు తిరుపతిక్షేత్రము ఉత్తరపు సరిహద్దు. తెలుగువారికి నేడు తమిళదేశముననున్న కంచి దక్షిణపు సరిహద్దు—కాబట్టి యీ భాషా సంబంధ మనివార్యమైనది.

తమిళభాషలో తత్సమపదవిభాగము లేనందున తమిళభాషా సాదృశ్యములు, తెలుగున అవ్యుత్పన్నము లని తెలుగు వైయాకరణులు తెలుపుచున్నను, అచ్చ తెనుగు దేశిపదముల వ్యుత్పత్తులను గ్రహించుటకు తోడ్పడును. పదముల వ్యుత్పత్తులకేగాక, తెలుగు ప్రత్యయముల స్వరూప నిరూపణమునకు, సంధికార్యముల నిర్ణయమునకు తమిళభాషాతత్త్వమెంతయు ప్రయోజనకారి యగుచున్నది. ఈ దృష్టితో పరిశీలించినచో నీ రెండు భాషలకును నత్యంత సన్నిహిత సంబంధమున్నదని మాత్రమే చెప్పనగును గాని జన్య జనక సంబంధమున్నదని నిర్ధరించుట కవకాశము లేదు.

## ఛందస్సు

తెలుగు భాషలో నియతములైన యతిప్రాసలు రెండును తమిళమున నున్నవి. అంతియేగాక, తెలుగు పద్యరచన నియమములుకూడ తమిళమునందున్నవి. వాని వివరము.

### తెలుగు

1. మాత్ర — గురువులు
2. గణములు
3. పాదములు
4. వృత్తములు
5. యతులు
6. ప్రాసలు

### తమిళము

1. ఎళుత్తు గుర్వలఘ్వక్షరములు గూర్చినవి
2. అశై మాత్రా సంయోగములు
3. శీర్ — గణములు
4. తళై — గణబంధము
5. అడి — ఆడుగు లేక పాదము
6. తొడై — అంత్యప్రాసాదికముల కూర్పు
7. మోనై — యతి
8. ఎదుగై — ప్రాసము

తమిళమున 8 విభాగములున్నను అవి తెలుగుతో సరిపోవును. 3 వది శీర్ అనునది ఒక లఘువు ఒక గురువు మూడుమాత్రల గణమే. కాని అవి రెండే యక్షరములు. ఇది తెలుగున సూర్యగణముతో సరిపోవును. కాని తక్కిన గణములు తమిళమున 'శీర్' కు మాత్రలు చేర్చుటచే నేర్పడును. పిరిన్దువరు- |ంIII; పాతాళ ఙ౦|. తెలుగున-లఘువుచే ప్రారంభించునవి వేఱు-గురువుచే ప్రారంభించునవి వేఱు. ఒకటి జాతి లేక మాత్రా ఛ్ఛందస్సుల కుపయుక్తమగును. వేఱొకటి-సంస్కృత ఛ్ఛందస్సుల కుపయుక్తమగును. అరవమున సమవృత్తములవంటివి వున్నను యరవమున అవి దేశి వృత్తములే. సంస్కృత వృత్తములందు లేవు. 'తెలుగునందు దేశివృత్తములకు, 'శీర్'వంటి సూర్య ఇంద్ర, చంద్రగణములును, సంస్కృత వృత్తములకు, అక్షర నియమితమైన మూడక్షరముల గణములును

---

10. తెలుగు - తమిళమునకుగల సాజాత్య పదములను 5000 మదరాసు విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధన శాఖవారు సేకరించిరి. వానిలో 2000 పదములను-Comparative Dravidian Vocabulary' అనుపేర గ్రంథరూపమున ప్రకటించిరి. 1961.

వాడుదురు. 'శిర్' వంటివి నలవామక గణములనువని తెలుగున యున్నవని-విన్నకోట పెద్దన పేర్కొని యున్నాడు. కాబట్టి మాత్రా, గణ, పాద, వృత్త ములు రెండింటియందు నమాన లక్షణములే గలిగి యున్నవని చెప్పవచ్చును.

తెలుగున యతిప్రాసలవలె, తమిళమునను గలవు.

యతులు —

అన్నం పోయ్‌కన్ని యురుల్ న్నైయ నన్నుదలుం
ఒరువ మివిళువ్వై యొబ్బుం వడై యూన
ఎళ్ల ఇళంగళి యే ఇన్నమురంగు దివెశా
కుతిర్విళక్కిరియ కోట్టుకాల్ కట్టి లిన్మేల్ -

ప్రా స లు

వజ్ కలయర్ వార్ శడయర్ మాన్ బనణినూలర్
విజ్ శలయర్ వేదముదై నావర్ నని మొయ్యార్
ఉజ్ కలయర్ ఉన్నయుర్ తవట్టనయి ముప్పార్
కొజ్ కల యువలా లైవిల్ తూణిగళ్ శుమన్దార్

తమిళమున నర్క, విర్క, ఉర్క అని సంయుక్తాక్షరములు ప్రాసలో నుండవు. తెలుగున నుండును. ఇది 'ర్క' ప్రాసము.

ముడికవేన్దర్ — మూవరుకు మరియు
దడిగణీర్యురు శిదాగన్నారుకు—

తెలుగువలె, అరవమునకు, పద్యములవలె సామెత లందును యతిప్రాసలుండును.

తె లు గు

అంగిట బెల్లము: ఆత్మలో విషము
ఆడేకాలు పాడేనోరు ఊరకుండవు
కోల ఆడితే కోతి ఆడును.

త మి ళ ము

ఉదట్టిల్ వెల్లమ్ ఉళ్లత్తిల్ నంజం
ఆడియకాలుం పాడియవావుమ్
సుమ్మాయిరాదు
కోల్ ఆడ కురంగు ఆడుమ్

తెలుగు, తమిళములకు సాజాత్యములైన సామెతలు 500 గలవు.[11] తమిళములో మన్నట్లు, తెలుగున పదాంతములు హలంతములుగా నుండవు. ఒక్క నకారము మాత్రమే 'న్' అనురీతిని హలంతముగా నుండును.

గ్రంథ విభాగము

తెలుగులో గ్రంథములు సాధారణముగా ఆశ్వాసములుగా విభాగింపబడును. కాని తెలుగున తొలి ఛందోగ్రంథమైన కవిజనాశ్రయమున ఆశ్వాసము కాక 'అధికారము' అను పేరితో నున్నది.

1. సంజ్ఞాధికారము 2. సమవృత్తాధికారము 3. యతిచ్ఛందోధికారము 4. వియతిచ్ఛందోధికారము 5. జాత్యధికారము 6. షట్ప్రత్యయాధికారము 7. దోషాధికారము.

ఈ 'అధికారము' అను విభాగము తమిళము నుండి గ్రహింపబడినది. శిలప్పదిగారము అను తమిళ గ్రంథమున ఇరుళదిగారవ్, పొరుళదిగారవ్ అను విభాగములున్నవి. 'అధికారము' అను శబ్దము తమిళమున అదిగార మగును.

క్రీ. శ. 15 వ శతాబ్దిలోనున్న మనుమంచి భట్టు అనుకవి. హయలక్షణవిలాసము[12] అను తన కావ్యమున, ఆశ్వాసములకు బదులు 'అధికారములు' అనియే పేరుపెట్టి యున్నాడు.

ఆ శతాబ్దియందే ప్రసిద్ధ లాక్షణికుడగు వెల్లంకి తాతంభట్టును — తన కవిచింతామణి యందు అధికార విభాగము చేసియున్నాడు.

అముద్రితములైన పై గ్రంథముల నుదాహరించుచున్నాను.

హయలక్షణ విలాసము

ఇది నకల సుకవిజన వినుత నంస్తూయమాన కవితా చాతురీ ధురీణ నిఖిల భాషాప్రవీణ భైరవాచార్య

11. Comparative proverbs in Dravidian Languages - Telugu, Tamil, Kannada Malayalam-Telugu (సాటిసామెతలు). Edited by N. Venkata Rao.

12. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము 1917-1919 గ్రంథ వివరణ పట్టిక R. 395. పుటలు 1100-1101.

పుత్ర మనుమంచిభట్టు ప్రణీతంబైన హయలక్షణ విలాసంబన్న కృతియందు తృతీయాధికారము.

తాతంభట్టు కవి చింతామణి యందొక్కొక్క యధికారము నందలి విషయములు స్ఫురింపజేసెడు పేరును బెట్టియున్నాడు.

1. ఇది యష్టభాషావతార వెల్లంకి తాతంభట్టు ప్రణీతంబైన చింతామణియను కావ్యానుశాసనంబున భాషాలక్షణాధికారము.

2. ఇది శబ్దవర్ణనీయ వెల్లంకి తాతంభట్టు ప్రణీతంబైన చింతామణియను కావ్యానుశాసనంబున వర్ణనీయాధికారము.

3. ఇది సారసాహిత్య వెల్లంకి తాతంభట్టు ప్రణీతంబైన చింతామణియను కావ్యానుశాసనంబున వళిప్రాసాధికారము.

4. ఇది విమతవిద్యావిశారద వెల్లంకి తాతంభట్టు ప్రణీతంబైన కవిచింతామణి కావ్యానుశాసనంబున దోషాధికారము.[13]

భాషా సమైక్యత ప్రధాన సమస్యగా పరిణమించిన ఈ రోజులలో విట్టి దృష్టితో పరిశోధన జరుపుట యావశ్యకము. మదరాసు విశ్వవిద్యాలయమున నేను సంగ్రహముగా తెల్పిన పై విషయమై పరిశోధన జరిగినది. కాని ఆ పరిశోధనగ్రంథము ప్రాతప్రతి యైన వా వద్ద లేకుండుటచే వివరములు నీయులేదు.

ఇప్పటికి, పదునేడేండ్ల క్రిందటనే ఈ విషయమై పరిశ్రమ చేసితిని.[14] అందు తెలుగు—సంస్కృతము, తెలుగు—ప్రాకృతము, తెలుగు—తమిళము, తెలుగు-కన్నడము, తెలుగు—మహారాష్ట్రము వీని పరస్పర సంబంధము వ్యక్తపఱుపబడినది. కన్నడాంధ్రముల సంబంధ ములను గూర్చి ప్రత్యేక గ్రంథమే ప్రకటించితిని.[15] సంస్కృతమునకు తెలుగునకుగల సంబంధ మీదృష్టితో వ్యక్తపఱచితిని[16].

ఈ సమస్యాపరిష్కారమునకు పై రీతిని పరిశ్రమ యింకను ఎంతో జరుగవలసి యున్నది.

---

13. మదరాసు ప్రా. లి పు. భా. వివరణ సంపుటము 5 సంఖ్య 1278 పుట. 1596 - 97.

14. Introduction in English to the Lives of Telugu Poets. 850—1250 A D. Madras University Publication.

15. కన్నడాంధ్రముల పరస్పర ప్రభావము.

16. Telugu—A link between North & South – Andhra Souvenir, Edited by K. Eswara Dutt.



# శీతారామయ్య పథకం

శ్రీ కొనకళ్ల వెంకటరత్నం

(గతసంచిక తరువాయి)

తెల్లవారగట్ట జూట్‌మిల్లు మొదటి కూత కూసింది. ముందు గదిలో పడుకున్నాడు శీతారామయ్య. మెట్ల చప్పుడయితే వెనక్కి తిరిగిచూచాడు. పార్వతమ్మ 'చూడండి' అని మంచంకోడుదగ్గర నిలబడింది. 'ఏమిటి?' అన్నట్టు చూచాడు.

'వాళ్లు రేపు వెళ్లిపోతున్నారు. మన సంసారం చూడబోతే ఇట్లా నీళ్లుగారి పోతుండెను!. పిల్లల పెళ్లిళ్లమాట ఏమిటి? వాళ్లకువాళ్లూ మీకు మీరు ముభావంగా ఊరుకుంటే ఎలా?...'అంది 'సీరియస్'గా.

శీతారామయ్య లేచి కూచుని తలగోక్కుని 'చెబుతా చెబుతా—చెప్పకపోతే ఎలా? సరే నువ్వు వెళ్లు...' అన్నాడు అటూ యిటూ చూచి...పార్వతమ్మ వెళ్లిపోయింది. నిజమే మరి. ఊరికేనే లోలోపల మథనపడడం, స్వగతంగా కారాలూ మిరియాలు నూరడం మినహా తనుచేసిన నిర్వాహకమేమిటి ఇంతవరకూ?

సాయంత్రం రామం ఒక్కడే ఉన్నాడు. ఆ మధ్య భిలాయ్‌లో పనిచేసిన 'ఎగ్జిక్యూటివ్ ఇంజనీ'రొకాయన సెలవుమీద ఏలూరు వచ్చాట్ట. ఆయనగారి భార్య 'లేడీస్ క్లబ్బు' కొచ్చిందట. ఆమెతో భుజభుజాలు రాసుకుందుకని చక్కాబోయారు కోడళ్లిద్దరూ... వంటయింటో పాత్రలు గలగలలాడుతున్నాయి. వదినలు పురమాయించిన చామంతి పువ్వుల కదంబం గుచ్చుతోంది రాధారాణీ.

'ఒరేయ్ రామం—ఇట్రా' అని పిలిచాడు శీతారామయ్య. అంతలో నళినీ ఎక్కడినించో కొంపకి చేరుకున్నాడు. లేడికి లేచిందే ప్రయాణమని, మళ్లీ ఎక్కడికేనా ఉడాయించగలడు. పిలిచాడు శీతారామయ్య. తల వంచుకొని టేబిలుపక్కని చిన్న బెంచీమీద కూచున్నా రిద్దరూ. 'ఏదో ముగ్గులోకి దింపుతున్నాడు నాన్న' అని లీలగా పసిగట్టారు సుపుత్రులిద్దరూ. కుర్చీమీద కూచుని టేబిలుమీదవున్న పేపర్ వెయిట్లు సద్దుతో ఉపక్రమించాడు శీతారామయ్య.

'ఏరా అబ్బాయిలూ-నా 'పెన్షను' రూ 73/- వస్తోంది. మీకు తెలియందేముంది—చూడబోతే పిల్లల పెళ్లిళ్లు కావాలాయెను—మరి ఆడుక్కునేవాడు సమేతూ రెండువేలకి తక్కువ కట్నం అడగడంలేదు. ఇట్లా వుంది పరిస్థితి. ఏమిచెయ్యమంటారు? ఏమిటి మీ వుద్దేశ్యం?' అని మెదలకుండా ఊరుకున్నాడు శీతారామయ్య...రామం ఎత్తుకున్నాడు. తనని గవర్నమెంటు 'లోన్'మీదనే చదివించారట అది తీరుస్తున్నాడట నెలనెలా వంద చొప్పున. బలవంతాన 'ఇన్‌షూరు' చేయించారట. దానికో డెబ్బై అవుతున్నాయట. హైదరాబాదులో గడపదాటితేసరి డబ్బు చిళ్లపెంకులల్లే ఖర్చయిపోతుందట. పెళ్లి అయింతరవాతేగాని అంతవరకూ నెలనెలా ఏదో పంపిస్తూనే వున్నాడట. పొలా లమ్మించి చదువుకున్నవాళ్లు కొంచెం బాధ్యత వహించాలట. నళినివంక చూశాడు శీతారామయ్య. సమాధానం అల్లుకుందుకు అనుకోకుండా వ్యవధి చిక్కింది నళినికి...తల తీవిగా ఒక వెంపుకి ఓరగావంచి కిటికీలోంచి అవతలకి నిర్లక్ష్యంగా చూస్తూ వల్లించాడు జవాబు. తనకీ 'ఇన్‌షూరెన్స్' బెడద వచ్చిందట. 'హౌస్ బిల్డింగ్ స్కీము'లో జేరమన్నారట. ఎవరో చెప్పడు. దానితో ఇంటెస్ట లంకింద

వెయ్యిదాకానూ, 'షేర్ల'కింద కొంతా 'డిపాజిట్లు' చేశాట్ట. ప్రతినెలా ఏదో వొక ఖర్చు వచ్చిపడిపోతోనే వున్నదట. అక్కడికీ తను పొదుపుగానే వుంటున్నాడట.

'ఒరే—అబ్బాయ్ — నా కుటుంబ ఖర్చులు భరించమని మిమ్మల్ని అడగడంలేదు నేను- అది నేనే సద్దు కుంటాను—సద్దుకొంటూనే వున్నాను—ఆ బరువేమీ మీ భుజస్కంధాలమీద కెత్తను — కాని ఆడపిల్లల పెళ్ళిళ్లు ఎట్లా గట్టెక్కేనూ అని? ఆ బాధ్యత మీరు వహించక తప్పదు మరి' అన్నాడు శీతారామయ్య.

పచ్చివెలక్కాయ గొంతు కడ్డం పడినట్టు మిడుతూమిడుతూ చూస్తున్నా రిద్దరూ. ప్రతి మెట్టుకీ తనే గుచ్చిగుచ్చి ప్రశ్న తరవాత ప్రశ్న అడగాలిసిన అవసరం అడుగడుక్కీ గుర్తొస్తూనే వుంది శీతారామయ్యకి.

'మరి అక్కడ పద్దుల పుస్తకంలో పోగు పడి వున్నయిగా రూపాయిలు— అవి పట్రండి మరి.'

'అడిగాం నాన్నా. అది మా కివ్వరట వాళ్ళు.'

'వాళ్లెవరు?'

'కోడళ్ళు.'

'పద్దులు వాళ్లపేర ఉన్నట్టా?'

'అవును'

'అయితే వాళ్లనే పట్రమ్మనండి.'

'వాళ్ళు సంతకాలు చెయ్యరట.'

'మీతో తర్కమెందుకురా నాయనా—వాళ్లి ద్దరిసీ మీ దగ్గరకే పంపేస్తాను. ఎట్లా పెళ్ళిళ్ళు చేస్తారో చెయ్యండి—నాకేమీ సంబంధంలేదు చెప్తున్నా' అని వొదిలేశాడు శీతారామయ్య. మెదలకుండా వూరు కున్న కొడుకులిద్దరివంకా పరకాయించి చూచాడు.

'అక్కడికీ నెలనెలా వందచొప్పున రెండు సంవత్సరాలు పంపాము మరి. ఈ పెళ్ళిళ్ళపేరుచెప్పి మా కంఠాలకేమో గుదిబండలు తగిలిస్తిరి' అని ముదలకిస్తున్నాడు నళిని పెళ్లికిముందు పిజియే కావా లని తను మొరాయించిన మొరాయింపు మరుపున బడిపోయిందప్పుడే.శీమధ్యలోనే మాట తుంచేసి, 'మీరు పంపిన వందలూ, యాభైలూ లెఖ వ్రాశాన్రా' అని డ్రాయరులాగి పద్దులపుస్తకం బైటికితీసి 'చూడండి' అని వాళ్లముందు పడేశాడు శీతారామయ్య. తన 'జిపి ఫండూ', వాళ్లు నెలనెలా పంపిన పైకంలో మిగిలిందీ, వేయించిన పందిళ్లకిందా, పెట్టిన విందు భోజనాలకిందా, చదివించిన లాంఛనాలకిందా, ఏ 'అయిటం'కి ఎంతయిందో, ఆఖర్న ఎంత మిగిలిందో, ఎంత తగిలిందో సావకాశంగా చూచుకోమన్నాడు. ఇద్దరూ ఒకడి మీద ఒకడు వొరిగి మహాపరిశీలనగా చూచుకుంటు న్నారు పద్దులు; తను తప్పుడు లెఖ్ఖలు వ్రాశాననో యేమో. వాళ్లచాత సంజాయిషీలు చెప్పించాలిసిందిపోయి చెయ్యని నేరాలకి తను సమాధానం చెప్పుకుంటున్న ఘట్టం విడ్డూరంగా ఉన్నదాయనికి. అక్కడికీ నెత్తూరు సలసలమని కాగిపోతున్నా, ఆ 'లావా'ని శాయశక్తులా అణిచిపెడుతోనే వచ్చాడు కార్యసాధనకని. పద్దుచూచి నట్టేచూచి ఈ 'సోఫా సెట్టు' కెంతయింది నాన్నా? అని 'క్రాస్' చేస్తున్నాడు నళిని. అక్కడే వుందిగా దాని ఖరీదు! ఆ 'క్రాసింగులో' అంతర్గతంగా ఒక నేరారోపణ ఉన్నదని గ్రహించలేక పోలేదు శీతారామయ్య. 'అప్పట్లో మీ ఇద్దరికీ పెద్దపెద్ద సమంధాలు వొస్తున్న సందర్భంలో, కొంచెం హుందాగా ఉండా లనిపించి, 'టీ సెట్ల'నీ, తివాచీలనీ కొన్నమాట నిజమే. నేనేదో దర్జా వులుముకుందామని కాదు-- దరిమిలా అవన్నీ అమ్మిన జమలుగూడా చిత్తగించండి దొరలు-ఎటొచ్చీ సోఫాసెట్టు ఒకటుంది— అదీ బేరానికి పెట్టాను' అని పేజీలు తిప్పి ఖచ్చితంగా వేలుపెట్టి చూపించాడు శీతారామయ్య. 'దానిక్కాదు నాన్నా—' అని నసుగుతోనే,...'రిక్షాలకి రెండు రూపాయిలు— చుట్టల కైదు రూపాయిలు'— అని ఏవీ ఎరగనట్టు పైకి చదువుతున్నాడు రామం. 'సేల్స్‌టాక్స్ ఆఫీసరు' లెఖ్ఖలు 'ఆడిట్'చేస్తే 'అబ్జక్షన్లు' 'రికార్డు' చేస్తున్నట్టు 'ఫీల'య్యాడు శీతారామయ్య. ఆఖరికి పద్దులపుస్తకం మూసిపెడుతోనే, నళిని ఒక 'జడ్జిమెంటి'చ్చాడు 'తర్కంకోసం కాదు నాన్నా—ఎట్లాగూ కొంత పొదుపుగానే పోవాలి మనం— మాట వరసకి, చుట్టలకని నెలకి అయిదు రూపాయి లవుతోందా మరి' అన్నాడు యధాలాపంగా.

'అయితే నన్ను చుట్టలు మానమంటావా?' అని నిదానంగా కుర్చీలోనించీ లేచాడు శీతారామయ్య—

చూస్తుండగానే, మొహం ఉబ్బిపోయి, కళ్ళు చింత నిప్పులల్లే ఎర్రజీరపడి, బీభత్సంగా తయారైపోయాడు. 'నన్ను...నన్ను...' అని పూనకం వచ్చినట్టు ఊగిపోతూ ఆ చెంపా ఈ చెంపా ఛెళ్ళుఛెళ్ళుమని వాయించాడు. 'అదేమిటి నాన్నా?' అని అదిరిపడి లేచాడు నళిని. 'మీ 'గేబర్డీన్ సూట్లూ', 'ఎంబాసడర్ బూట్లూ'—అటు ఢిల్లీ ఇటు బొంబాయికీ 'టూరింగు'లూ-వీట్లమధ్య నా చుట్టల కట్ట దుబారాకింద అవుపించిందట్రా రాస్కెల్' అంటో ఆమట్ని కత్తిదూసినట్టు, వంకీనున్న తోలు పటకా చర్రునలాగి నళినిని పట్టుకుని ఛక్‌ఛక్‌మని ఒకటే బాదేస్తున్నాడు; వొళ్ళు తెలీకుండా వొణికిపోతున్నాడు; తూలిపడబోతున్నాడు. నళినిమాత్రం నిటారుగా నిలబడి దెబ్బలుతింటోనే నవ్వుతున్నాడు నవ్వుతోనే దెబ్బలు తింటున్నాడు ఏమీ పట్టించుకోనట్టు. శీతారామయ్యని పట్టుకుని, 'పడిపోతావు నాన్నా! ఏమిటా వెర్రికోపం? కొడుదువుగానిలే కూచో,' అని హాలులో సోఫామీద కూచోబెట్టి అనునయిస్తున్నాడు ఎదురు. ఈ సందు చూచుకుని రామచంద్రం చల్లగా బైటికి ఉడాయించేశాడు-- ఇదంతా అన్నాయిమీద కొట్టుకుపోతోందిగదా అన్న దిలాసాలో. పార్వతమ్మ హడావుడిగా వొచ్చేసి అగ్గగ్గలాడిపోయింది. 'అయ్యో— అయ్యో - వొదలండి- చిన్నసన్నాసిని ఛంపేస్తారాయేం?' అని వాణీ, తనూ కలిసి విడదీసి, నళినిని వాటేసుకుని, వంటింట్లోకి లాక్కెళ్ళి ముక్కాలిమీద కూచోబెట్టి తలుపేసింది. నళిని నంగనాచిలా మెదలకుండా ఊరుకున్నాడు, దెబ్బలెక్కడెక్కడ తగిలినయ్యో తరవాత సావకాశంగా చూచుకోవచ్చునని. ముక్కూ మొహమూ జేవురించిపోయినై. చేతులమీదా, మెడమీదా దద్దుర్లు తేలాయి. కాని చిత్రం! ఖంగారు పడకుండా స్థిమితంగా చిన్నగా నవ్వుతోనే వున్నాడు. శీతారామయ్య హాలులో అలంగం తిరుగుతున్నాడు. 'భూమీ పుట్రా అమ్మీ, నా జి. పి. ఫండులోనించీ 'విత్‌డ్రా'చేసీ, ఎన్నిసార్లు రుణాలుతెచ్చి ఎన్నిసార్లు నా జీతంలో తీర్చాను? నానాగడ్డి కరిచానా— తల్వి తల కెత్తుతారని కొండంత ఆశలు పెట్టుకుని కుంగిపోతున్నానా ఒకచెంప! అవన్నీ అడుగున పడిపోయి, నా చుట్టలకట్ట పయికొచ్చిందంట్రా స్కౌండ్రల్?' అని రంకెలు వేస్తున్నాడు; రగిలిపోతున్నాడు. వంటింటోనించీ నళిని ఏదో సమాధానం ఇవ్వబోతే, 'నోరుముయ్యి' అని గదమాయించింది కుక్కిన పేనల్లే, కిక్కురుమనకుండా ఊరుకున్నాడు.

అవతల వాటాలోనించీ ఇంటి యజమాని రఘురామయ్యగారూ, ఇంకా ఇరుగు పొరుగు పోగయ్యారు. ఎక్కడెక్కడి వాళ్ళూ జనం ఎక్కడనో ఇళ్ళంటుకుంటున్నాయని బిలబిల లాడుతో వచ్చేశారు. కొంతమందికి, 'ఈ శీతారామయ్య మొన్న మొన్నటిదాకా గుమాస్తా గిరీ వెలిగించినవాడేను!— ఇంటో సోఫాలూ, కిటికీలకి 'కర్టెన్లూ'—మూడు పువ్వులూ ఆరుకాయలుగా వున్నదే ఈయన పని' అని కొంత కన్నెర్రగానే ఉంటున్నారు. వచ్చి భలానా సంగతి అని తెలుసుకుని, తండ్రీ కొడుకుల్ని విడదీసి, పైపెచ్చు, 'పెద్దలు తమరే అలా తొందరపడితే ఎలా?' అని చక్కాబోయారు. గుమ్మం దిగుతో కొంతమంది 'అయింది — భగ్గా వెలుగూను—అంతా తోడిపెట్టాడు కొడుకులికి...కొంప గుండమయింది...వాళ్ళు సరేసరి. ఉద్యోగాలు దొరకబుచ్చుకొని, పెళ్ళాల్ని పక్కల్లోకి తెచ్చుకుని, ఒకడక్కడా ఒకడిక్కడా టింగురంగా అని కొండెక్కి కూచున్నారు' అనుకున్నారు.

సీతారామయ్య సివాలు తొక్కుతోనే వున్నాడు.

'నా నెత్తురూ, నా ఆర్జనా, నా సర్వస్వమూ మంచి నీళ్ళల్లే గడగడ త్రాగేసి, నా ఆస్తిపాస్తి మేసేసి, కండబలిసి ఆంబోతులల్లే రంకెలు వేస్తున్నారా రాస్కెల్స్? నాకట్రా మీరు ధర్మపన్నాలు చెప్పేదీ? పొదుపును గురించి హితబోధలు చేపేదీని? నేను మట్టితిని మీకు కన్నం తినిపించానే! నేను గంజి తాగి మీకు అమృతం పట్టించానే! పాలుబోసి పని గట్టుకుని పాముచాత కాటువేయించుకున్నట్టయిందే నా రాత! ఇంత అక్రమానికి ఒడిగడతార్రట్రా? సిల్కులూ, టెరిలిన్లూ, ఫెర్రీకాటన్లుతప్ప మామూలు చొక్కాలూ 'పాంట్లూ' తొడిగార్రట్రా మీరు? 'పిక్నిక్కులా?' 'డిన్నర్లా?' 'ఎగ్జిబిషన్లా'? తీర్థయాత్రలా? మీ చావులా? మీ శ్రాద్ధాలా? కొవ్వుబలిసి పెళ్ళాల కొంగులు పట్టుకుని సినీమాలా? బీచిషికార్లా? ఇవన్నీ మీరు సంపాయించుకున్న ఉద్యోగాలే అనుకుంటున్నారేమిట్రా? 'డొనేషన్లు'కట్టి అడ్డమైన ఆఫీసర్ల కాళ్ళూ కడుపులూ పట్టుకుని, పేదరుపు

లరిచి, 'సిఫార్సులు' మోసుకొచ్చి మీ ఎదాన్ని పెడితే, కులుకుతో అందలమెక్కి, పగ్గాలు చేతో పుచ్చుకుని పరవళ్లు తొక్కుతున్నారా? ఒరేయ్ పెద్దింజనీరూ—ఆడంగి వెధవా! వంటింటో పెళ్లాం విడిచిన నైలాన్‌చీర మడత బెడ్తున్నావేమిట్రా? బైటికిరా నీ రక్తం కళ్ల జూస్తాను,' అని బారలు చాపి, పెద్దపెద్ద అంగలువేస్తూ హాలు కటూ ఇటూ సవారీచేస్తున్నాడు--సివాలు తొక్కుతున్నాడు- సవాలు చేస్తున్నాడు.

'ఇదుగో- ఇటు చూడండి.'

వెనక్కి తిరిగి చూచాడు శీతారామయ్య.

'ఒకటే గుర్తుంచుకోండి - అల్లరి పడి మనకే నష్టం—బ్రతుకు బజార్ని పడెయ్యకండి - పిల్లల పెళ్ళిళ్లున్నాయి.' కుంకంపొట్టు చెరగకుండ కొంగుతో మొహం తుడుచుకొంటూ గుమ్మంలో నిలబడింది పార్వతమ్మ.

'నిజమేనే—నీ మాట విన్నానుగాదే! పెళ్లి ఈడుకొచ్చిన ఆడపిల్లలు నట్టింటఉండగా మొగరాజులకేమి తొందరొచ్చిందీ అని హెచ్చరిక లివ్వనే ఇచ్చావు నువ్వు. వంటింటో పొగచూరిపొయ్యే నీకున్న పాటి ప్రపంచజ్ఞానం నాకు లేకపోయిందే. ఈ రాక్షసుల్ని నమ్మి నా కూతుళ్ల భవిష్యత్తు బగ్గం పాడు చేశానే—వాళ్ల బ్రతుకులు ఈ కసాయిముండాకొడుకుల చేతుల్లో పెట్టేశానే—' అని హాలుకిమధ్య, గొంతు కూర్చుని వంకరలు తిరిగిపొయ్యాడు శీతారామయ్య. 'వీళ్ల పెళ్ళిళ్లకని ఎవరిని చందా ఎత్తనిహా? నెలకి అయిదారువందల జీతాలు తెచ్చుకుంటున్న కుమారరత్నా లొక చెంప ఆహోరిస్తుంటే, నేనేమీ ఇవ్వలేనంటే నమ్మేదెవడు?' అని అచ్చు ఒక ఆడదానిలా శోకాలు పెట్టాడు శీతారామయ్య.

ఆ వేళ మరి చుట్ట వెలిగించలేదు శీతారామయ్య. అటు ధ్యాసపోయినప్పుడల్లా ఆ నళిని ఎత్తిన చుట్టలకట్ట కెలకవేస్తోంది లోపల.

నాలుగు మెతుకులు కతికి, నిస్త్రాణగావుండి గాఢన్నిదపొయ్యాడు శీతారామయ్య. తెల్లవారుతోనే లేచి నూతిపళ్లెందగ్గర బాల్చీకి తాడు ముడివేస్తూ, ఇల్లంతా నిశ్శబ్దంగా ఉన్నట్టనిపించి, 'వాళ్లేరే?' అని అడిగాడు. కాఫీనీళ్లలో ఇంకా కసిన్ని నీళ్లు కలుపుతో 'వెళ్లారు' అంది పార్వతమ్మ ముక్తసరిగా. 'ఎప్పుడు?' అన్నాడు శీతారామయ్య నోరు తెరిచేసి. 'రాత్రే' అన్నది. 'అవురా!' అని స్తంభించిపొయ్యాడు శీతారామయ్య.

* * *

శీతారామయ్య నీరసించిపోతున్నాడు. డాక్టరు దగ్గరకి వెళ్లండి అని పోరుపెట్టింది పార్వతమ్మ. వినడు. 'రోగం నీకా నాకా?' అని ఎదురు తిరిగాడు. సాతికేళ్ల చుట్ట అలవాటు పూర్తిగా కట్టిపెట్టాడు. నుందకొడిగా ఉంటూంట అందుకా అనుకున్నారు ఇంటెల్లపాదీ.

అటూ ఇటూ ఉత్తరాలు నడవడం లేదు. ఉత్తరం దాయకపోతే నష్టపడే దెవరో తెలియదు గనకనా వాళ్లకి?

రాధమ్మచేత ఉత్తరం రాయించింది పార్వతమ్మ. ముక్కాలి పీటమీద కూచుని తల ఓరగావంచి రాధ వ్రాశింది. 'ఆఖర్ని 'అమ్మ ఘోషపెడుతోంది' అని వ్రాయి తెలిశిందా?' అన్నది పార్వతమ్మ. వ్రాయించింది, వాయిల్ చీరకి కందికాయికుట్లు మూడోసారి కుట్టుకుంటుండగా చూచిన్నీ చలించని కొడుకులికి!

ఆ వుత్తరానికి జవాబు రాలేదు.

వ్యవహారం కటికముడి పడేలా వున్నదే అని విచారించాడు శీతారామయ్య. ముళ్లమీదపడిన మల్లుపంచెని నిదానంగా తొలిగించుకోవడంపోయి, లాగిలాగి చీలికలూ పేలికలూచేసి వదలిపెట్టాడా తను? ఏమో—వెనక్కి తిరిగి చూచుకుంటే తనుచేసినవన్నీ తప్పులే అనిపిస్తోంది—తను గుమాస్తా గిరిలో ప్రవేశించడమూ—పిల్లలు ఛస్తే గుమాస్తాలు కాగూడదని తీర్మానించుకోవడమూ—వాళ్లని పెద్దచదువులు చదివించి పెద్దవుద్యోగాలు సంపాయించి పెట్టడమూ, వాళ్లకి పెళ్లిళ్లు చెయ్యడమూ—ఒకటేమిటి—ఆ ఘడియదాకా నడిచిన తంతంతా తప్పు. తప్పు...... ఒకటే తప్పుల తడక! శిక్ష అనుభవిస్తున్నాడు—కాని ఈ ఆడపిల్లలు...అభమూ శుభమూ ఎరగని పసాసులు—వీళ్లేమి చేశారు ఈ శిక్షలో భాగం పంచుకుందుకు? చదవమంటే చదివారు—మానమంటే

మానారు. ఏ సమంధాలు వొచ్చినా నీ ఇష్టం నాన్నా అంటున్నారు, తనకి భారం తగ్గిద్దామని... అయ్యో, నోరులేని ఈ పసివాళ్లని నిష్కారణంగా అన్యాయం చేశానే అనిపించింది శీతారామయ్యకి.

* * *

ఒకనాడు భోజనానికని వంటింటికేసి వెడుతుంటే రెండు కొత్త చీరలు మడతబెడుతోంది పార్వతమ్మ. 'ఎక్కడివే'? అని అడిగాడు శీతారామయ్య. నేతిగిన్నె కుంపటిమీద పెడుతూ, 'నళినిని తెమ్మన్నా' అన్నది. 'ఏమిటేమిటీ? అయితే అడుక్కున్నానన్న మాట? దేహీ అన్నందుకు ఫలించింది మొత్తవిన్మాద. ఏమేవ్ రాధీ! చిన్నన్నాయిని నువ్వూ అడుక్కోక పోయినావుటే? నాలుగువోణీలు తీసుకొచ్చి పడేశేవాడు' అని ఎద్దేవా చేస్తున్నాడు శీతారామయ్య.

'అబ్బ పోనిస్తురూ—నా పేగులో పేగువాణ్ని అడిగినా అడుక్కున్నా నామర్దాలేదు నాకు...'

'పేగులో పేగు! ఆ పేగులే మిగిల్చారులే నీకూ నాకూ—ఒసేవ్, నీకు బుద్ధి శరమూ లేదటే? సిగ్గూ లజ్జా లేవూ? ఏ మొహం పెట్టుకుని అడిగావే వాణ్ణి?—అదుగో చూడు— ఆ శనివారప్పేట మలుపులో నాలుగు రోడ్ల మొగని ఒక చిన్న చినిగిన తువాలు పరుచుకుని కూచుంటివా, సాయంత్రానికల్లా పది రూపాయిలు రాలతాయే!' అని నవ్వుతోనే అంటించాడు శీతారామయ్య.

వాణీ రాధారాణీ హాల్లోకి తప్పుకున్నారు, ఈ తుఫాను తమమీద పడినా పడవచ్చని.

* * *

విజయరాఘవంగారు గుంటూరు మానారు ఈ మధ్య. ఇట్లా కాదని శీతారామయ్య వియ్యంకుడి దగ్గిరికి వెళ్లాడు. కాళ్లు కడుక్కుందుకు నీళ్లివ్వడం గాని, కుశలప్రశ్నలు వెయ్యడంగాని చెయ్యలేదాయన. అదేమిటి? ఆయన అల్లుణ్ణి కాదుగా తను కొడతా. కూచున్నాడు. తప్పుతుంది గనకనా? ఆయన ఉపోద్ఘాతం లేకుండా 'ఏమండీ బావగారూ—వాళ్లది పడుచురక్తం—మన వేమో కాగిచల్లారిన పాలా యెను—పెద్దలయ్యుండీ చెట్టంత కొడుకుమీద చేయిజేసుకుంటారా— అంత రాక్షసంగా?'. చర్రున కోపమొచ్చేసింది శీతారామయ్యకి. ఆనాడు తనని ఆవహించిన భూతమేదో మళ్లీ మేలుకున్నట్లయింది లోపల. అనువుగాని చోటాయెను - తమాయించుకున్నాడు. ఎంతో ఓర్పుగా వివరించాడు. తర్జనభర్జన జరిగి ది కాస్సేపు. కొసకి 'జరిగిందేదో జరిగిపోయింది లెండి' అనేసుకున్నా రిద్దరూ. ఇష్టాగోష్ఠిలో ఆడపిల్లల పెళ్లిళ్లమాట ఎత్తాడు శీతారామయ్య.

'ఎక్కడిదక్కడ బిగించుకుని కూచుంటే వాళ్లు నేను గట్టెక్కేనూ?' అని నిగ్గదీశాడు. విజయరాఘవంగారు గొప్ప వ్యవహర్త. కళ్లజోడు తీసి ఎడమచేత్తో పట్టుకుని, కుడిచేతి చిటికెనవేలితో సిగరెట్టు నుసి విదిపి, కొసని వెలుగుతున్న ఎరుపు వంక తీక్షణంగా చూస్తో మందహాసం చేశాడాయన. 'చూడండి బావగారూ—నాకు నలుగురాడపిల్లలు—నేను లక్షాధికారినే అనుకోండి—నలుగురికీ నాలుగు పదిహేన్లు అరవై వేలు ధారపోసి బతికి బైటపడే సరికి నా ముగ్గురు కొడుకులికీ ఏమి మిగులుతుందో చెప్పండి. నేను ముట్టజెప్పిన పదిహేనువేలూ మీ పిల్లల పెళ్లిళ్లకని వెచ్చిస్తే నా బిడ్డ ఏమికాను? మీ ఆస్తి చూచి ఇచ్చానా నేను? చదువు చూచి ఇచ్చాను అమ్మాయికీ, దానినిబట్టి అల్లుడికీ ఆధారంగా వుంటుందని కొంత ఆస్తి ఆడపిల్లలపేర వ్రాశాం...అది తేతెమ్మనమంటే ఎట్లా?'

'అదుగో—పిల్లల కాస్తి అంటారేమిటండీ?' అని తర్జుమా చేశాడు శీతారామయ్య.

'కట్నమని ఎవరు చెప్పారండీ మీకు?, మాచేతిమీదుగా మీకు ముట్టే మొత్తాలవి. నా కూతురూ, నా అల్లుడూ అనుభవించాలది. నా అల్లుడేగాని మీ కొడుకు కాదాయేం?'

ఈ నాటకం వెనక ఈ మామయ్యల మంత్రాంగం పూర్తిగా వున్నట్టుంది.

ఆయనన్నదీ సబవుగానే వుంది శీతారామయ్యకి. తనకూతుర్ని ఆస్తి లేని అల్లుడికి దయాధర్మ భిక్షం కింద ఇచ్చినందుకు కొంత ఆధారం చూపించాడా ఇద్దరికీ. తను పడిన శ్రమంతా ఈయనగారి కొమ్మెక్కి మాంచి అల్లుణ్ణి పెద్దపెద్ద చదువులు చెప్పించి, మంచి మంచి ఉద్యోగాలు తెప్పించి, కండా

కొవ్వూ పచ్చేట్లా తయారు తినిపించి సిద్ధం చేసేండు కన్నమాట! బావుంది సందర్భవశాత్తూ ఆ ఖాతా పద్దులూ అతని కళ్లబడినై. అట్లాగే వున్నయి అవి కోడిగుడ్లు పెట్టినట్టు ఫాయిదాలు పెంచుకొంటూ. ఏవీ వాడుకోలేదు వాళ్లు.

*　　　*　　　*

శీతారామయ్య ఏలూరు వచ్చేసి 'ప్లీడరు' దగ్గరికివెళ్లి ఉన్న పరిస్థితి విశదించాడు. 'ప్లీడరు'గారు అవీ ఇవీ తిరగేసి, చప్పరించి 'ఏమీ లాభం లేదు' 'లా' బుక్కులన్నీ మూసిపెట్టేశాడు. 'ఆ డబ్బంతా ఆడపిల్లలకి తండ్రి ఇచ్చిన ఆస్తికింద లెఖ్ఖలలో వుంది మరి. అది స్త్రీ ధనం. కోడళ్లకే హక్కుంది ఆ పైకమ్మీద. అది నీకు కట్నంకింద దఖలు పడలేదు. 'అది కట్నమేను' అని నువ్వు తర్జువా చేశావంటే జైలుకు పోతావు జాగర్త. కట్నాల నిషేధమిప్పుడు, నీకు తెలీదేమో గోల' అని హెచ్చరించాడు.

కండవా చంకనెట్టుకొని తలకాయి వంచుకుని ఇంటికి తిరిగి వచ్చాడు శీతారామయ్య.

సరే ఎక్కడేనా కొంత బదులుతెచ్చి పిల్లలకి పెళ్లిళ్లు చెయ్యాలని సంకల్పించుకున్నాడు శీతారామయ్య. ఆ మధ్య ఎదో మూడువేలు కావాలి, అవి అడిగితే, 'మూడు కాదు నాలుగు తీసుకో—నీ కివ్వ డానికేమయ్యా బంగారు పిచ్చుకవు' అని ఆకాశాని కెత్తిన కరణం సుబ్బారాయుడు, మళ్లీ ఆ ప్రస్తావన తెచ్చేసరికి, 'అరె ఇంకా కూచుంది? నిన్న నడిగితే ఇచ్చేవాణ్ణేస్మీ' అని నాలిక కరుచుకున్నాడు. ఇద్దరు ముగ్గుర్ని కదిపి చూచాడు. తొంట చెయ్యి చూపారు. ఆ నాడు తను అనాలోచితంగా పెట్టుకున్న గలాటాలో కొడుకులికీ తనకీ పడడంలేదనీ, వాళ్లని దృష్టిలో పెట్టుకుని ఈయనకేదో ఇవ్వడం ప్రమాదమనీ అప్పుడే 'పబ్లిగ్గా' తెలిసిపోయింది. ఇహను ఇక్కడ తన పరపతి చచ్చింది. ఇదివరకే ఈ వూహ తట్టివుంటే బదులు తీసుకొచ్చి కొడుకుల్ని తీర్చమనేవాడు. రోగం కుదిరేది దానితో. తరవాత వాళ్ళూ వాళ్ళూ గంగలో కలవనీ.

*　　　*　　　*

సమంధాలకోసం మళ్లీ తడిమన్ను పాడిమన్నయేలా తిరుగుతున్నాడు శీతారామయ్య. ఎక్కడికి వెళ్లినా మీ అబ్బాయి లేమిచేస్తున్నారూ అన్న ప్రశ్నే వస్తోంది చెప్పాడు. చెప్పక తప్పుతుందా? ఆ చెప్పినప్పుడు ఒకానొక గర్వరేఖ మెరిసింది కూడా తన కళ్లల్లో. కాని కట్నమెంతా అన్న ప్రశ్న ఎదురుకోగానే పలాయనం చిత్తగించక తప్పడంలేదు వచ్చిన వాళ్లు పిల్లని చూచి, పనిలోపనిగా చుట్టుపక్కల ఏదో కొంత వాకబుచేసుకుని, 'ఈనకీ ఈయన కొడుకులికీ పడటంలేదట. ఏమి విదుపుతాడూ ఇహ?' అని తిరుగుముఖం పడుతున్నారు. వాళ్లు తీసుకొచ్చిన బత్తాయికాయిలూ, పటికబెల్లం పొట్లాలూ ఇంటో వీళ్లు ఊదేస్తున్నారు. తను పెట్టిన కాఫీలూ, కలర్లూ వాళ్లు ఊదేస్తున్నారు. పర్యవసానం తన 'పెన్షన్'లో ఒక పెద్ద మొర్రి ప్రతినెలా!

క్రితం రోజున ధవళేశ్వరంనించీ ఎవరో వచ్చి చూచిపొయ్యారు. రాధనయితే చేసుకుంటారట! ఇదో కొత్త ఆపత్తు వొచ్చిపడింది. అరుగుమీద కూచుని, 'రాధీ ఇట్రా' అని పిలిచాడు. జడ అల్లుకొంటో వచ్చింది. ఈ మధ్య పిలవగానే పలక్కపోతే పెంకు లెగిరేలా కేక లేస్తున్నాడు శీతారామయ్య. 'ఇటు చూడమ్మా — వాణీ పెళ్లిచూపులి కెవరేనావస్తే కొంచెం నీ అలంకారం తగ్గించు—తెలిశిందా? దాన్ని వొదిలి నీకూడా పడుతున్నారు అప్రాచ్యులు. ఆ 'పవుడరు' అంత వొత్తుగా మెత్తనక్ఖర్లేదులే, జడలో రిబ్బను అంత నాజూగ్గా మిసమిస లాడనక్ఖర్లేదు—కొంచెం షోకులు తగ్గించు—లేకపోతే ఏ వంటింటోనో కాస్సేపు అహోరించు.'

'అట్లాగే నాన్నా' అని మెల్లిగా వెళ్లిపోయింది రాధ.

'దొరసానివేషాలూ నువ్వూను! మహా అందంగా వున్నావని మిడిసిపాటుగా వుందిలే—నీ అందం అందలమెక్కినట్టే వుంది! కొంచెం నిదానంగా నడు—అదేమి నడక? సివంగి నడక!—అమ్మో మీరా—పెళ్లి పెడాకులూ లేవుగాని, అయితేనా, పైనబడితే వానలుండవు—కిందబెడితే పంటలుండవు—పట్టపగ్గాలుండేనా?' అని సణుగుతోనే వున్నాడు వెనకాల. 'ఎందుకట్లా చిన్నపన్నాసుల్ని వేపుకుతింటారూ?' అని ముదలకించింది పార్వతమ్మ. తన గదిలోకి దూరి చేక్కా వూరుకున్నాడు.

ఒక విచిత్రమైన ధోరణి వచ్చేసింది శీతారామయ్యకి.

వాణీ రాధారాణీ ఎవళ్ళకిం ళ్ళు శీతారామయ్యకి కనఁ పడకుండా దాక్కొంటున్నారు. కొండగుహాలో ఆక[illegible] [illegible] రుసరుసలాడుతూ కు[illegible] టుం[illegible] [illegible] మూగగుగదిలో శీతారామయ్య.

ఎక్కడనించో హడావుడిగా వచ్చేసి, 'ర్రోయ్ ఎక్కడ చచ్చారే లోపల' ఒక్క పెట్టాడు. 'ఏం కావాలి?' అని ఎంగిలి హడావుడిగా వచ్చింది పార్వతమ్మ 'నీ శ్రాద్ధం' చక్కాబోయాడు గదిలోకి. 'ఏమిటీ మనిషి?' అను కుంది పార్వతమ్మ

*

వాణీ ఏదో పుస్తకం చదువుకుంటోంది. 'ఏమిటీ ఆ పుస్తకం? డిటెక్టివ్ నవలా?' నాన్న గదమాయింపుకి గభాల్న లేచింది వాణీ. 'అట్లా తెల మొహం వేసావేమిటే నీ మొహంమండా...చదివింది చాలులే ...నవలలు చదువుతోంది!... అదిగో ఆ కిటికీలోనుంచీ పరకాయించి చూస్తున్నావేమిటీ? పక్కింటి కిటికీలో ఎవడేనా వున్నాడా యేం? ఇహనదే తరవాయి. వంటింటోకి తగుండే త లదు. పెళ్ళయ్యేదాకా మాట దక్కించండి. ఆ తరవాత గంగలో కలవండి' – రివ్వున తనగదిలోకి దూరాడు శీతారామయ్య. 'వెధవ మొహాలంటూను వెధవ మొహాలు! ఇట్లాంటి దిష్టిపిడతకే పెళ్ళిళ్ళ య్యేది. టాయిలెట్టు అరగంటా? రోజు రోజుకి మొహాన్ని తిలకంమాత్రం పెద్దదవుతోంది!...' అని గొణుక్కొంటోనే వున్నాడు.

పిల్లలిద్దరూ పెద్దవాళ్ళవుతున్నారు. మీాద కొచ్చిపడుతున్న అందాన్ని వయస్సునీ ఎక్కడ దాచుకో గలరూ?

సాదా పరికిణీ వోణీ వేసుకుని అగుపిస్తే, 'ఏమిటా అవతారం వెధవముండా వేషాలూ నువ్వూను! అది మొగుడు చచ్చిం తరవాత–ఇప్పుడుకాదు తెలిసిందా?' అని రొక్కిస్తున్నాడు. మొహం కస్తు నబ్బుతో తోముకుని తలలో ఏ ఎర్రగన్నేరు పువ్వో తురుముకుంటే చాలు, 'ఎక్కడికి వేంచేస్తున్నారు రంగసానులు–మెరకవీధికా?' అని శూలాలు పొడుస్తున్నాడు.

ఘడీ ఘడీకీ తమమీాద చేస్తున్న ఈ దండయాత్రతో అక్కచెల్లెళ్ళిద్దరూ జడివానలో తడిసిన నామర్లే ముదుచుకుపోయి ఏ వంటి టి మూలనో [illegible]నారు తలి[illegible] [illegible]చని.

ఎంత మారిపోయాడు నాన్న! ఎంతో లస్తారు [illegible]తంగా చూచుకున్న నాన్న! కాలు కింద పెట్టనిచ్చేవాడా? సిగ్గుపొర్ర నాడనిచ్చేవాడా? ఒక్క తుమ్ము తుమ్మితే చాలు, కాస్త తలనొచ్చిలే చాలు అడ్డమైన మందులూ పట్టుకొచ్చేవాడు రొంప 'బ్రాంఖాయిటిస్'లోకి దింపుతుందనేవాడు. జ్వరం రెండు రోజులు పొడిగిస్తే చాలు 'టైఫాయిడ్'కాదుగదా అని గాబరా పడిపోయేవాడు. నీళ్ళలో [illegible] తడిస్తే చాలు–జలుబు చేస్తుందనేవాడు. రాత్రి పదిదాటి చదువుకుంటే నిదర చాలక వేడిచేస్తుందనేవాడు అట్లాంటి నాన్న ఇప్పుడు దుర్నిరీక్ష్యంగా వున్నాడు......ఆ కోపం! అది కోపం కాదు–ఆ కోపానికి గురి అవుతున్నందుకుకాదు వాళ్ళు బాధపడుతుంటా. ఆ కోపానికి వెనక పడిపోయి, రూపం మార్చుకొని, మారువేషం వేసుకొని కఠోరంగా బైట పడుతున్న మమత్వం! ఆ మమకారానికి ఈ కోపం ప్రతిరూపం. వాత్సల్యప్రేమ అన్నది సహజంగా, ధారాళంగా, ఆరోగ్యంగా బైటపడినప్పుడే తేనెసోనలా వుంటుందికాని సందు దొరకక గిలగిల కొట్టుకునే ప్రేమ, గుండెలు దొలిచే ప్రేమ, కోపంకిందా, రోషంకిందా, ద్వేషంకిందా, వెటకారంకిందా, తిట్లకిందా, చివాట్లకిందా విషం కక్కులో బైటపడుతుంది క్షణక్షణమూ.

*　　*　　*

ఇంటి సామాన్లన్నీ ఒకదాని తరవాత వొకటి తాకట్టులోకి నడిచివెళ్ళి వాకట్టయి ఊరుకున్నాయి. శీతారామయ్య చూస్తూ ఊరుకున్నాడు. ఇంటి అద్దె బకాయిపడింది. ఏదో వొకనాడు గప్‌చిప్పుగా ఇంటికి తాళంపెట్టి ఏదో ఊరు, ఏ పల్లెటూరో ఉడాయిస్తేసరి! ఎవడు చూడొచ్చాడు? పార్వతమ్మకి సూచనగా అందించా డొకనాడు. 'అవ్వ' అని నోరు నొక్కుకుంది పార్వతమ్మ. 'నీ శ్రాద్ధం-ను వ్వొకత్తివి

శకునపక్షివి! న్యాయంట న్యాయం!' విదిలించి చక్కా పోయాడు శీతారామయ్య.

*

ఒకనాడు దొంగచాటుగా వంటింట్లోకి తొంగి చూచాడు శీతారామయ్య. కళ్లు మూసుకుని గౌరిదేవి పటంముందు జపంలో వుంది పార్వతమ్మ. 'నూనె తగలేస్తోంది దీన్దుంపతెగా' అనుకున్నాడు. అగరొత్తు లొకటా? ఈవిడకి జపాలూ తపాలూ ఎక్కువయి పోతున్నట్టున్నాయి. దీని నాడి ఇంతవరకూ పట్టుకుని చూడలే దింతవరకూ తను. ఈ రోగం సెల వేయక క్రితమే జాగర్తపడాలి. కొక్కిరాయిచేష్టలు మానిపించాలి – లేకపోతే, అరిటిపళ్లనీ, కొబ్బరికాయ లనీ, హారతి కర్పూరమనీ తేతెమ్మంటుంది. ఆపద మొక్కులేమైనా మొక్కుతోందేమో, లోలోపల కొంప ఆనక తీర్చమంటుంది.. శీతారామయ్య గుండె తీవ్రంగా కొట్టుకుంది. ఏ అలికిడయితే ఆవిడ జపమెక్కడ భంగమవుతుందోనని గుండె పీకుతోనే వుంది ఒక చెంప పిల్లిలా అడుగులు వేసుకొంటూ హాలులోకి వెళ్లిపోయాడు.

ఒకనాటి మధ్యాన్నం, శీతారామయ్యా పార్వతమ్మా ఒక చిన్న చిట్కా ఆలోచించారు. అందరూ కట్టగట్టుకునివెళ్లి భిలాయ్‌లో ఆ పెద్దాడిమీద పడితే సరీ – తిండిపెట్టను పొమ్మంటాడా? పెళ్లిళ్ల మాట తరవాత చూడవచ్చును. బాగుందంటే బాగుందనుకున్నారు. ఇన్నాళ్లా ఇంత చిన్న ప్రకియ ఊహకి తట్టలేదేమా అనిపించింది. కాని పార్వతమ్మ ఒక చిన్న 'బ్రేక్' వేసింది భిలావానాడు, భిలాని 'ప్రెయినుకి' వస్తున్నాము అని ముందస్తిగా వ్రాయమంది. ఈ మధ్య పార్వతమ్మ మాటమీద శీతారామయ్యకి కొంత గురి కుదిరింది. ఉత్తరం వ్రాశాడు. చిత్రం! తిరుగు టపాలో జవాబు వచ్చింది. అంతావస్తే పెద్ద ఇల్లొకటి తీసుకోవాలిశుంటుందనీ, ఇంటికోసం గాలిస్తున్నాననీ, ఇల్లు దొరకగానే ఉత్తరం వ్రాస్తాననీ. ఆ పెద్దయిల్లు ఛస్తే దొరకదు! దొరకలేదుకూడా!! ఉత్తరాలమీద ఉత్తరాలయితే వ్రాశారు. ఇట్లాంటి పరిస్థితుల్లో బిళ్లపెట్టుగావెళ్లి పీకలమీద కూచుంటే బైటికీడుస్తాడేమో గోల. తనకీ వాడికీ మధ్య పచ్చగడ్డివేస్తే భగ్గుమంటోందాయెను. మా అమ్మా నాన్న పీక్కలకాదు అని బుకాయిస్తే? ఇరుగూ పొరుగూ నమ్మినా నమ్మవచ్చు. నమ్మరూ? అబద్ధం ఎంత పెద్దదయితే అంత సులభంగా నమ్మించవచ్చును. 'వీాది మరీ విడ్డూరమండీ – అందాకా వెడుతుందా?' అని అప్పుడేగాని పార్వతమ్మకి సంకోచంగానే వుంది లోపల. ఈ మధ్య శీతారామయ్య ఏదేనా ఒక చిన్న ఉపాయమాలోచించాడంటే దానిని వెయ్యి అపాయాలు ముట్టడిస్తున్నాయి. మళ్లీ ఒక్కొక్క అపాయానికీ ఉపాయాలల్లుకు పోతున్నాడు. మెదడు మహామురుగ్గా పనిచేస్తోంది. ఎవరో చెబితే విన్నాడు – మెదడు ఆగిపోయేముందు అతితీవ్రంగా ఆలోచిస్తుందట.

చుట్టూతా తనకి పిచ్చెక్కిందని పుకార్లు రేగుతున్నాయి. ఒకవేళ తనకి పిచ్చేమో గోల. ఆలోచనా పాలోచన అంతా శుభ్రంగానే వుంది మరి లోపల పిచ్చివాడికి పిచ్చెక్కుతున్నట్టు తెలుసుందా అసలు? ఏమో మొగట్లో మెదడు ఒకవేపునించీ కుళ్లి పోతుంటే ఇంకోవేపున అటుకేసి కుళ్లుపడుతున్నట్టు తెలివిడి పనిచేస్తుందేమో. క్రమేణా మెదడంతా కుళ్లి పోయి, పిచ్చిముదిరి...శీతారామయ్యకి బుర్ర వేడెక్కి పోయింది.

ముంగిట్లో బాదంచెట్టుఆకులు రాలుతున్నాయి. పదపడిన ఆకుల్ని మేకలు పరపర నములుతున్నాయి.

శీతారామయ్య పచారికొట్లో ఖాతా పుస్తక మీాద ప్రొటోసర్లదగ్గర ఘర్షణపడి ఇంటికి వస్తున్నాడు. కనుచీకటిగావుంది. రాధారాణీ ఎక్కడికో వెళ్లి తిరిగివస్తూ కనిపించింది. 'ఎక్కడికి వెళ్లావు?' జదార్తుగా అడిగాడు వెనకాలనించీ. బిక్కచచ్చిపోయింది రాధ. ఏదో జరుగుతున్నదని లీలగా అనుమానం సోకింది శీతారామయ్యకి. అతనికి మానవత్వంమీాదా మంచితనమీాదా నమ్మకం క్షీణించిపోయింది. 'పద ఇంటికి' అని నడిపిస్తూ, 'ఏమిటి కథ?' అని లాలనగా అడిగాడు. 'ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజ్ ఆఫీసు కెళ్లి వస్తున్నా నాన్నా – వాణికీ నాకూ 'పోస్టింగులు' వచ్చాయి.' 'ఎక్కడా?'

'డిస్ట్రిక్టు రిజిస్ట్రార్ ఆఫీసులో నాకూ,

జిల్లా పోలీసు ఆఫీసులో అక్కయ్యకీను...అన్నది నేరం చేస్తుండగా దొంగ దొరికిపోయినట్టు. ఇంటో అడుగు పెడుతోనే, 'ఏమండోయ్ పార్వతమ్మగారూ—తమ పుత్రికామణులు ఉద్యోగాలు సంపాదించుకొన్నారేవ్—బలేబలే—అవున్లే - కొమాళ్ళు నాకు మల్లే గుమాస్తాలై ఎక్కడ నలిగిపోతారో అని వాళ్ళని ఆ గాడిలోనించీ తప్పించా. వాళ్ళని వొదిలి అమ్మాయిల్ని వరించిందిలే గుమాస్తాగిరీ. ఆనవాయితీ తప్పిస్తే ఎలా? అవతల వీధిని శ్రీరామచంద్రమూర్తిగారి యింటో వంటమనిషి కావాలిట...'అప్లికేషన్ నివ్వు దాఖలుచేస్తా. ఇదంతా నన్ను ఏ షావుకారు గుమాస్తాగానో అఘోరించమని పాశమా యేం?' అన్నాడు.

అన్నంగిన్నె పొయిమీదనించీ దింపి విసవిస నడిచివచ్చింది పార్వతమ్మ. 'చూడండి—మీరు వేళా కోళంగా అంటున్నారుగాని, ఇప్పుడు మీరన్న పను లన్నీ అక్షరాలా జరిగితే ఆ దుర్మార్గుల చేతిలో పడ కుండా దివ్యచకోరంగా గడిచిపోతుంది మనకి.' తెల్ల మొహం వేశాడు శీతారామయ్య. కొబ్బరినూనెలేక ఆమె జుత్తు రాగిరంగు పడిపోయింది. ఈవిడ కెట్లాగూ చొరవ ఎక్కువయిం దీమధ్య ఈవిడకీ ఇష్టమే గావును—దీనికీ నోరొస్తోంది మెల్లిగా—అనుకున్నాడు శీతారామయ్య.

ఆ బులపాటమూ అయింది. షావుకారు మల్లి కార్జునంగారి కొట్లో చిఠా అవర్జాలు వ్రాశాడు కొన్నాళ్ళు శీతారామయ్య. ఒక వారం రోజులదాకా 'పంతులుగారూ' అని సంబోధించాడు షావుకారు. తర వాత 'పంతులూ' అని పిలిచాడు. 'ఏమండి'తో మొదలై, 'ఏమోయ్'దాకా దిగజారింది కొసకి. స్వస్తి పెట్టుకొన్నాడు. ఒకనాడు బజారుకెళ్ళి కూరగాయల పట్టమ్మనాడు. చేతికిచ్చిన వలసంచీ మొహాన్ని కొట్టి చక్కావచ్చాడు. క్రిమినల్ కేసు పెట్టడుకదా? ఇంకా నయం. నౌఖర్ననుకుంటున్నాడు గామాలు!

* * *

మర్నాటినించీ వాణీ రాధారాణీ ఉద్యోగాలు చూచుకున్నారు. దొడ్డిదారినవెళ్ళి, నాన్నకి కనపడ కుండా మెలకువగా ఇంటోకి జొరబడుతున్నారు. దొంగకి తేలుకుట్టినవతుగా శీతారామయ్య తెలిసీ తెలీ నట్టే నోరు మూసుకుని ఊరుకున్నాడు. ఇన్నాళ్ళా అయిందానికీ కానిదానికీ నోరుచేసుకుని వాళ్ళని నానాహింసాపెట్టి, మాటలతో కుళ్ళబొడుస్తూ, 'ఈ పని ఎందుకు చెయ్యరూ వీళ్ళు?' అనేవో తన అంతరాత్మే తనకి ద్రోహం చేస్తోందా.' ఈ మధ్య తనలోపల ఒక మనిషీ, బైట మరోమనిషీ పని చేస్తోన్నట్టు అనుమానం సోకింది శీతారామయ్యకి.

*

మెల్లిమెల్లిగా చుట్టూపేరుకున్న అప్పులు తీర్చాడు శీతారామయ్య. కొంపలో కూరా, నారా; పాలూ పంచదారా పుష్కలంగా అమరుతున్నాయి. మళ్లీ సంసారం పచ్చపచ్చగా రంగులు మార్చు కుంటోంది.

ఒకనాడు రాధారాణీ నాన్న దగ్గరకి పరిగెత్తు కొచ్చింది. చేతులు రెండూ వెనక్కి పెట్టుకొని 'నాన్నా, నీకో తాయిలం తెచ్చా' అంది. అట్లా అల్లారు ముద్దుగా తన బిడ్డలు నిర్భయంగా తన దగ్గరకెప్పుడు వస్తారా అని ఎదురు చూచి చూచి కళ్ళుకాయలు కాచిపోయాయి శీతారామయ్యకి. ఏ కళ నున్నాడో తల కుర్చీ వెనకాలవోపి, 'పెట్టు' అని నోరు తెరిచాడు చిన్నపిల్లాడికి మల్లే. రాధ గోముగా కుర్చీచేతులమీద కూచుని, నాలుగు పొగాకుకాడలు టేబిలుమీద వుంచి, 'చుట్ట కాల్చవు నాన్నా?' అని గునిసింది. ఏహో బాంబు పేలినట్టయి, భళ్ళున దుఃఖం వచ్చింది శీతారామయ్యకి. ఆయన జుత్తులోకి వేళ్ళు పోనిచ్చి, 'ఆడపిల్లలకి మాత్రం అమ్మా నాన్నని పోషించుకునే హక్కులేదా యేమిటి నాన్నా' అని అనునయించింది రాధ. డగ్గుత్తికతో కళ్ళు వొత్తుకున్నాడు శీతారామయ్య.

* * *

కొంచెం మెతక—నల్లనివన్నీ నీళ్ళూ తెల్లనివన్నీ పాలూ అనుకుంటుంది. ఆఫీసులో పక్క సీట్లోవున్న రహమాన్ కలగజేసుకుని ఏ కాయితం ఎట్లా 'డిస్పోజాఫ్' చెయ్యాల్సో ఓపికగా చెప్పాడు. పాపం మంచివాడు అనుకుంది. 'మీ వ్రాత ముత్యాల కోవనమండి' అన్నాడు 'టైపిస్టు' గౌరీపతి. కాబోలను కుంది. ఇవన్నీ తరవాత తరవాత మింగబొయ్యే చేదు మాత్రలకి పంచదార కోటింగని తెలీదు. 'ఎక్కౌంటెంటు' రామనాథం ఒకనాడు చేతిలో కాయితం

అందుకోబోయి చెయ్యే పట్టుకుని లాగాడు. ముచ్చెమ
టలు పట్టినై వాణీకి. 'రిజై'నిచ్చి చక్కా వచ్చింది.
రాధకి అట్లాంటి ఘట్టమే ఒకటి ఎదురైతే, చెంప
ఛెళ్ళుమనిపించి, ఆ వేళనించీ 'ఆఫీసరు' పక్కనే
కుర్చీ వేసుకుంది. ఆ తరవాత ఆమెని శేరపార
జూచేందుకు గుండె నిబ్బరం ఎవ్వరికీ కలగలేదు.
'ఆఫీసరు' సమేతూ తప్పనిసరిగా నిగ్రహం అలవాటు
చేసుకున్నాడు.

* * *

ఎన్నడూ లేనిది ఆనాడు శీతారామయ్యని
పెద్దాసుపత్రికి తీసికెళ్ళింది రాధ. పరీక్షచేసి 'షుగరుం'
దన్నాడు డాక్టరు. రక్తపుపోటు విస్తారంగా ఉందన్నాడు.
గ్రహణి జీర్ణించిందన్నాడు. లివరు సరిగా పని
చెయ్యడం లేదన్నాడు.

'లేనిరోగ మేమిటండి?' అని అడిగాడు
రామయ్య. ఎగా దిగా చూశాడు డాక్టరు ఉప్పూ
కారం పులుసూ పూర్తిగా మానమన్నాడు. 'మంచి
నీళ్ళు తాగవచ్చాండి?' అని అడిగాడు శీతారామయ్య
'సీరియస్'గానే. మందపాటి కళ్లద్దాలలోనించి కొరకొర
చూశాడు డాక్టరు. ఆసుపత్రి మందులు పనిచెయ్యవూ
అని, కసిదీరా ఓ వందరూపాయిల ఔషధాలు కొని
తెచ్చి వాడమని చాటభారతమంత 'ప్రిస్క్రిప్షన్'
వ్రాసి ఇచ్చాడు. రాధ అందుకోబోతుంటే లాక్కుని
జేబులో పెట్టుకున్నాడు శీతారామయ్య.

* * *

ఇంటికి వెళ్లేసరికి వాణీని చూడడానికని
ఎవరో వచ్చారు. రెండో సమంథం పెళ్లికొడుకు!
తను వచ్చి చూచుకోమని చెప్పనేలేదు. కాని వాళ్ల
ధైర్యం! మొగ్గకపోతారా అని. కట్నం అక్కర్లేదట.
పాపం అదే పోనీ లెమ్మని త్యాగం చేసేశాడు పెళ్లి
కొడుకు! పెళ్లిచూపులయినై. వెళ్లారు, పిల్ల నచ్చిం
దట. ఇంటో అంతా సై అంటే సై అనుకుంటు
న్నారు. ఇహనేముంది, పెళ్లి నిశ్చయమై పోయినట్టే.
శీతారామయ్యకి లోపల దేవినట్టుగా వుంది. సన్న
జాజులచెండు తీసి నీళ్ల చెంబులో వేస్తున్న వాణీ
వంకచూచి, 'నీ కిష్టమేనేమిటే?' అని అడిగాడు.
ఇష్టమే అన్నట్టు తలవూపింది. 'పిల్లలెంతమందటా?'
అని రెట్టించాడు. 'ఇంటిదగ్గర పిల్లలెవరూ లేర
న్నాడు వెంకటశాస్త్రుల్లు' అని వంటింటోనించీ అరి
చింది పార్వతమ్మ. 'వెంకటశాస్త్రుల్లా? అట్లా
చెప్పు,' అని, 'ఓసి నిన్ను తగలేసిరిగాదే—నీ బుర్ర
ఏమయిందే? వాడికిద్దరు కూతుళ్లూ, ఒక కొడు
కూను నాకు తెలుసు. కొడుక్కీ వీడికీ పడక తెగ
తెంపులు చేసుకున్నారు. కూతుళ్లిద్దరికీ పెళ్లిళ్ల
యినై. పిల్లల్ని కంటున్నారు కూడా. ఆ కొడుకు
రోగం కుదర్చాలని ఈ త్రాష్టుడు రెండోపెళ్లికి
తయారయ్యాడు— చేసుకో అమ్మా చేసుకో— మొగు
డంటూ ఒకడు దొరికితే చాలు. కొన్నాళ్లు కాపరం
చెయ్యి, పిల్లల్నికని వాళ్లనిపెంచి పోషించా, వాళ్లక్కి
మళ్లీ పెళ్లిళ్లూ పెడాకులూచేసి వాళ చాత
పిల్లల్ని కనిపించా. ఆ ముచ్చట్లన్నీ, ఒకదాని
తరవాత ఒకటేమిటి ఖర్మ...అన్నీ అత్తారింటో
అడుగుపెట్టగానే ఒక్కబిగిని తీరిపోతై, పీడాబాయిరి...
నీ మొహమెట్లావుందే! తెంపిపోసినట్టు' అని ఒక్క
ఉరుమురిమాడు శీతారామయ్య. పార్వతమ్మ, ఇంతకథ
వుందీ, అని కొయ్యబారిపోయింది. వాణీ ఏడుస్తో
వెనకాల గదిలోకి వెళ్లిపోయింది. ముందు గదిలోకి
దారి టేబిలు అంచుమీద తాళంవేస్తూ కూచు
న్నాడు శీతారామయ్య.

* * *

మిట్టమధ్యాన్నం—ఆకాశంమీద తెల్లగద్దలు
చక్కర్లు కొడుతున్నాయి దీర్ఘవృత్తులలో శ్రీకృష్ణుణ్ణి
పిలుస్తో. 'ఏమేవ్' ఒక్క గావుకేక పెట్టాడు శీతా
రామయ్య. చీరకి పట్టిన కొత్తచిరుగు కుచ్చిళ్లలో
కలివెయ్యడ మెట్లాగా అని తాపత్రయం పడుతో
చక్కావచ్చింది పార్వతమ్మ. 'సూటుకేసు' తీసి హాల్లో
దులుపుతున్నాడు శీతారామయ్య. 'ఎక్కడికి?' అంది.
'హైదరాబాదు పోతున్నా— వాడూ డాక్టరేగా?
నాకేమో వొంటో బావుల్లేదు...ఆస్పత్రి మందులేగా?
వాడు మొయ్యాలిసిన బరువేముందీ? ఏమంటావు?'
ఇష్టంగా అడిగాడు. అందాకా మందుమాట ఎత్తితే
టపాకాయిలా పేలిన భర్త, ఈనాడు తనకుతానే
ఆ ప్రస్తావన తెచ్చేసరికి పట్టలేని ఆనందమయింది
పార్వతమ్మకి. మళ్లీ గుబులు తిరుగుతుందేమో
నని, చొక్కాలూ పంచెలూ చకచక సర్దేసింది...

బండిటైము కావచ్చింది. పార్వతమ్మా రాధా రాణీ హడావుడిగా తిరుగుతున్నారు. వంటింట్లోకి తొంగిచూశాడు శీతారామయ్య. అక్కడ కావిడిపెట్టె మీద కూచుని కిటికీలోనించీ బైటికిచూస్తో ఏడుస్తోంది వాణీ. వెనకాలనించీ వెళ్ళి భుజమ్మీద చెయివేసి 'కోపమా అమ్మా?' అని అడిగాడు. ఉలిక్కిపడి గిరుక్కున వెనక్కితిరిగి గబగబ కళ్ళు తుడిచేసుకుంది వాణి. 'నా కండవాలు సర్దవా అమ్మా?' అని వెళ్ళిపోతున్నాడు శీతారామయ్య. ఆయన మాటలో కంపంలేదు. కంఠంలో గాద్గద్యం లేదు. వెనకాలే హాలులోకి నడిచివెళ్ళింది వాణీ. రాణీ పొగాకు గొట్టం తీసుకొచ్చి ఒకమూల నొక్కింది. వాణీ 'ఫ్లాస్కు' తీసుకొచ్చి ఒకవేపున కుక్కింది. ఈ గందరగోళమంతా బెంచీమీద కూచుని నిశ్శబ్దంగా చూస్తున్నాడు శీతారామయ్య. పార్వతమ్మ వచ్చి సీసాకి అడుగున మిగిలి వుంటే కాస్త మందారాయిలు రుద్దింది నెత్తిన. రాధ తనూ వస్తానంది, నాన్న ఒక్కడూ వెళ్ళగలడో లేడోనని. సరే రమ్మన్నాడు, కాని మళ్ళీ మార్చుకున్నాడు. 'మనమిద్దరమూ కట్టగట్టుకుని దేనికి పయనం? అక్కడ కొన్నాళ్ళు ఉండాలిసివస్తే తక్షణం ఉత్తరంరాస్తే, వాణీని రమ్మను. లేకపోతే అమ్మని పంపు—నాకు ఒత్తులెవడు ఒత్తుతాడు అక్కడ?' అన్నాడు. యాభై రూపాయిలు 'పర్సులో' పెట్టింది రాధ....'యాభయ్యెందుకమ్మా? పర్సులో అంత డబ్బు చూస్తే తిరుగుప్రయాణానికైనా డబ్బిస్తాడా వాడు? ఆ 'ఛార్జి' వాడిమీద నే రుద్దుతా. ఎక్కడికక్కడే!' అని వారించాడు శీతారామయ్య. అట్లా కాదన్నది రాధ. వాడేమైనా అంటే పడవద్దంది. ఈ పరీక్ష చేయించుకుని ముప్పాతిక మూడుపాళ్ళు మందులు రాయించుకుని వచ్చెయ్యమంది. ఆసుపత్రిలో ఉండాలిసివస్తే ఉత్తరం రాయమంది. 'ఓ-- ఛస్తే వాడి చేతిలో పడను' అన్నాడు శీతారామయ్య. స్టేషన్లో టిక్కట్టు కొనడమొక 'సర్కాన్ఫీటు' అని పస్తాయిస్తున్నాడు. 'ఎందుకూ? నేను వస్తాగా' అంది వాణీ. నేనూ వస్తానని వంతుటోయింది రాణీ. 'ఇద్దరూ రండే. టిక్కట్టుకొని బండెక్కించి తిరిగి వద్దురుగాని...ఆదివారమేగా...రైళ్ళు జంక్షనుగావు నిప్పుడు...అటువెళ్ళే రైలెక్కేబదులు ఇటువెళ్ళే రైలెక్కెయ్యగలను...నా కసలే గాభరా... అని బట్టలు మార్చుకున్నాడు శీతారామయ్య.

వాణీ రాధారాణీ ఇద్దరూ వచ్చారు స్టేషనికి. అటు వాణి, ఇటు రాణీ చెరోవేపునా నిల్చుంటే వాళ్ళ భుజాలమీద చేతులానించి 'ప్లాట్‌ఫారం' మీదకి నడిచాడు శీతారామయ్య

రైలు వచ్చేసింది.

ఖాళీగాఉన్న ఒక పెట్టెలో కూచోబెట్టి, సూట్‌కేసు పక్కనే పెట్టుకోమని, ఆ పెట్టెలోనే హైదరాబాదువెడుతో ఎరిగినాయన ఒకాయనవుంటే... 'మా నాన్నారిని జాగర్తగా దింపండీ?' అని చెప్పింది రాధ. 'పర్సు జాగర్త నాన్నా' అని హెచ్చరించింది.

టైమయింది. గంట కొట్టారు.

ఇద్దరూ గబగబా బండి దిగిపోయారు.

ఘణేల్లుమని రైలు కదిలింది.

'చప్పున వచ్చేసెయ్యి నాన్నా...వాడు ఉండమని ప్రాధేయపడితే ఉత్తరం రాయి' అని కేకేశారు.

'ప్లాట్‌ఫారం' మీద నిలబడి అట్లాగే కళ్ళప్పగించి చూస్తూన్నారిదరూ. 'ప్లాట్‌ఫారం' దూరమవుతున్న కొద్దీ వాళ్ళిద్దరూ క్రమక్రమంగా రెండు పూల మొక్కలల్లే, రెండు నీడలల్లే, ఆఖరికి రెండు చుక్కలల్లే మారి, ఆకాశపుటంచుల్లో లీనమయ్యే దాకా చూస్తోనే కూచున్నాడు శీతారామయ్య.

*        *        *

ప్రొద్దున్న పదింటికి 'ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాం' వచ్చింది. శీతారామయ్య రైలుకిందపడి చచ్చిపోయాడట. శవాన్ని టాక్సీమీద తీసుకొస్తున్నాడట. టెలిగ్రాం రామచంద్రమిచ్చాడు.

ఇల్లు దుఃఖ సముద్రంలో మునిగింది. పార్వతమ్మ శోషవొచ్చి పడిపోయింది. ఇరుగూ పొరుగూ మూగారు. ఊరడించారు.

మధ్యాహ్నం మిడిఎండలో 'టాక్సీ'మీద శవం వచ్చింది. హైదరాబాదు స్టేషన్లో రైలు ఆగేముందు ఆదరాబాదరా దిగడంలో కాలుజారి 'ప్లాట్‌ఫారానికీ' రైలు చక్రాలకీమధ్య పడ్డాడట. కాళ్ళూ చేతులూ

తునాతునకలయిన్నై. నెత్తురులో తడిసి ఆనవాలేనా, దొరకని ఆ చల్లని మాంసం ముద్దలో ఎన్ని ఆశలు, ఎన్ని నిరాశలు: ఎన్ని ద్వేషాలు, ఎన్నిరోషాలు, ఎంత రక్తి, ఎంత విరక్తి, ఎంత తామసం, ఎంత కసి, వేగి వేగి మూగవోయినయ్యో ఎవరికీ కనిపించలేదు, వినిపించలేదు.

పిండప్రదానాలూ, శ్రాద్ధకర్మలూ, తెంపి పోతలూ గట్రా యధావిధిగా జరిగిపోయిన్నై. రాధ ఉద్యోగంచేస్తూ ఏదో చక్రం తిప్పుతోందని కనిపెట్టి సెలవతై పోయినయ్యని ఆదరాబాదరా టపాకట్టేశారు సుపుత్రులిద్దరూ.

*  *  *

మర్నాడు పోస్టులో ఒక కవరు వచ్చింది. కవరు చించింది రాధారాణీ. అవి 'ఇన్‌షూరెన్స్ ప్రీమియం నోటీసులు.' పెద్దకళ్లు చేసుకుని పరిశీలనగా చూచింది రాధారాణీ. అమ్మా నాన్నా నాలుగేసివేలకి జీవిత భీమా చేశారు ఏనాడో! ఒక్కసారీ చెప్పలేదు.

'అమ్మా, నాన్నారు...కాయితా లెక్కడపెట్టే వారే?' అని లోపలికి'వెళ్లి అడిగింది రాధ. డ్రాయర్లో చూడమంది పార్వతమ్మ. 'డ్రాయరు' తెరిచింది. చుట్టలు చుట్టుకున్న నాగుపాములల్లే రెండు 'పాలసీలూ' భద్రంగా ఉన్నాయి. శీతారామయ్య 'పాలసీ' తెరిచిచూచింది. లోపలనించీ ఒక చిన్న చీటీముక్క కిందపడింది. తీసుకుని చదువుకుని చప్పున దాచేసింది రాధ.

పార్వతమ్మ అన్నీ వింది. 'పాలసీ అంటే ఏమిటి?' అడిగింది. రాధారాణీ వివరంగా చెప్పింది.

*

ఆలస్యం చెయ్యకుండా డెత్‌సర్టిఫికెట్టు దాఖలుచేసి 'కార్పొరేషన్'నించీ నాలుగువేలూ పట్టుకొచ్చింది.

మూడో నెల తిరక్కుండానే వాణికి పెళ్లి ఖాయమయింది. డబ్బు శాశ్వతమా అంటారు తెలివి తక్కువగా! డబ్బంటే లక్ష్మి! విష్ణుమూర్తి భార్య!! దాన్ని నిర్లక్ష్యంచేస్తే ఆ దేవుడికే కోపం రావచ్చు!!

రాధ ఉద్యోగం చేస్తోంది తనకట్నపు సొమ్ము తనే సంపాయించుకొంటోంది. ఒకనాడు ఆఫీసునించీ వచ్చేసి, భోంచేసి పడుకుని, కొంచెం సేపు ఏదో పుస్తకం చదువుకుని, 'స్విచ్చి' 'ఆఫ్'చేసి, ఆవలింతలొస్తుంటే, చిటికలు వేసుకొంటూ కళ్లుమూస్తుంటే పార్వతమ్మ మంచం పట్టీమీద కూచుని కనిపించింది. ఎప్పుడొచ్చిందో యేమో. అంతరంగికంగా మాట్లాడవలసిందేమయినా వుంటే పార్వతమ్మ ధోరణి అది!

'అయితే రాధీ... నాన్నగారు వెళ్లిపోయారు కదా...ఏదో మహరాజు! చచ్చిపోతూ కూడా ఒక పిల్లదాని కన్నెచెర విడిపించి మరీ తనదారి తను చూచుకున్నారు...ఎవరికేనా అదే దారి అనుకో...ఎదో ముందూ వెనకా అంతే...ఉట్టిగటు కుని కలకాలం ఊగులాడతామా?'

'ఏమిటమ్మా ఈ ధోరణి?' అని విసుక్కుంది రాధ.

'అది కాదమ్మా...మరి...ఆ కాయితం, మనిషి హరీ అంటేనేగాని మారదాయేం?' చటుక్కున ఆగింది.

రాధ మెదలకుండా ఊరుకుంది.

'అయితే మరి...నాన్న కాయితానికి నాలుగు వేలొచ్చినయికదా, నా కాయితానికీ నాలుగు వేలొస్తయ్యన్నమాటే కదా? వస్తేమరి నీ...'

మాట మధ్యలో తుంచేసి చప్పున ఆమె నోరు మూసింది రాధ.

(అయిపోయింది)

# నిజం

శ్రీ సి. నాగేశ్వరరావు

మనస్సాగరపు అగాధం
లోతుల్లోకి వెళ్ళాను.
ఆలిచిప్పలు—ముత్యపు చిప్పలు
దొరికినవి—తీసుకున్నాను.

పవిత్ర మేమిటి?
అపవిత్ర మేమిటి?
అబద్ధ మేమిటి?
అతిసత్య మేమిటి?

దేవత్వపు ఉపలబ్ధు లేమిటి?
రాక్షస ప్రవృత్తు లేమిటి?

ఆకలి రోదన ఏమిటి?
అతితిండిరోగ మేమిటి?

అగాధంలోకి దూకి
ఏరిన ఏ చిప్పలో
నిజమైన ముత్యముందో
నన్న జిజ్ఞాసతో వా టన్నిటిల
వెదుకుతూనే ఉన్నాను.

మనస్సు పొందే అనుభవాలు
నిజం కావని, నిజానికి రూపం
లేదని, అది అతిదూరమని,
అది ఎంతో అసాధ్యమని
అఖరికి ఒక శుక్తిలో ఈ
ముత్యాన్ని కనుగొన్నాను.
అదే నిజమనుకున్నాను.



# విష్ణుకుండినులు - కాలనిర్ణయము

శ్రీ బి. ఎన్. శా

ఇంద్రపాలనగర తామ్రశాసనములలో గోవిందవర్మ వేయించిన శాసనము,[1] విక్రమేన్ద్ర భట్టారకవర్మ వేయించిన శాసనము[2], భారతి మాసపత్రికలో నాచే ప్రకటింపబడినవి. చారిత్రక దృష్టితో జూచిన ఈ శాసనముల కెంతేని ప్రాముఖ్యము కలదు. విష్ణుకుండిన వంశమును గూర్చి నూతన విషయములు తెలిసికొనుటకే శాసనము లుపయోగపడు చున్నవి. ఈ వంశీయుల కాలనిర్ణయమునకు విక్రమేన్ద్ర భట్టారక వర్మ శాసనము మిక్కిలి ఉపయోగపడుచున్నది.

సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు డా॥ మారేమండ రామారావుగారు ఇంద్రపాలనగర తామ్రశాసనములను గూర్చి New Light on the Vishnukundins అను వ్యాసమును Journal of Indian History Vol. XLIII, Part-III లో ప్రకటించి తమ అభిప్రాయమును తెలిపినారు. డా. మారేమండ రామారావుగారు నాకు గురుతుల్యులు. వారు ప్రకటించిన భావములతో నే నేకీభవించ లేనందుకు విచారించుచు, విష్ణుకుండిన వంశమును—విష్ణుకుండినుల కాలమును భారతిలో నేను ప్రకటించిన విధమునే సమర్థించుచు ఈ వ్యాసమున చేర్చుచున్నాను.

ముఖ్యముగా డా. మారేమండ రామారావుగారు విష్ణుకుండినుల రాజ్యారంభకాలమును, రాజ్యపతన కాలమును, గోవిందవర్మ శాసనమున పేర్కొనబడిన రాజుల విషయమునను నా వాదము నంగీకరింప లేదు. డా. రామారావుగారు విష్ణుకుండినులు క్రీ. శ. 450 నుండి రాజ్యపాలన మారంభించినట్లు తెలిపినారు. నేను భారతిలో ప్రకటించిన గోవిందవర్మ శాసనమున విష్ణుకుండిన మహా రాజేంద్రవర్మ క్రీ. శ. 388 లో రాజ్యము స్థాపించినట్లు తెలిపినాను. విక్రమేన్ద్ర భటారకవర్మ శాసనమున పేర్కొనబడిన పల్లవ సింహవర్మను క్రీ. శ. 600 – 630 వరకు ఆంధ్రదేశపు తూర్పుతీర ప్రాంతమువరకు పాలించిన మొదటి మహేంద్రవర్మ తాతగా డా. రామారావుగారు గుర్తించినారు. ఈ పల్లవ సింహవర్మ క్రీ. శ. 555 - 575 వరకు పాలించినట్లు తెలిపినారు.

విష్ణుకుండిన వంశవృక్షమును కాలమును విక్రమేన్ద్ర భట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనమున పేర్కొనబడిన శక సంవత్సరము ననుసరించి నిర్ణయించినారు.[3] విష్ణుకుండిన వంశమునకు, విష్ణుకుండినుల కాలమునకు సంబంధించిన విషయము లను క్లుప్తముగా నిచట తెలుపుట సమంజసమనియే భావించి వ్రాయుచున్నాను.

---

1. భారతి. జూన్ 1965 Page 14 – 28.

2. భారతి జూలై 1965 Page 2 – 14.

3. '.... The Commencement of Vishnukundin rule has to be assigned to about the middle of the fifth Century A. D. and its end to 615 A. D.

Taking saka 488 expired, corresponding to 566–567 A. D. and the regnal years mentioned in the C. P. grants as the basis the Chronology of the Vishnu-Kundins may be restated as follows.

| | |
|---|---|
| Vikramendra Varman | 450–458 |
| Govinda Varman | 458-468 |
| Madhava Varman | 468-518 |
| Vikramendra I | 518-528 |
| Indrabhattaraka Varman | 528-555 |
| Vikramendra II | 555–566 |
| Indra Varman | 566-570 |
| Madhava Varman | 570–575 |
| Govinda Varman | 575–615 |

—Journal of Indian History Vol. XLIII, Part. III

ఇంద్రపాల నగర తామ్రశాసనములవలన మనకు విష్ణుకుండిన వంశీయులకు సంబంధించిన నూతన విషయములు తెలియుచున్నవి. గోవిందవర్మ ఇంద్రపాల నగర తామ్రశాసనమువలన విష్ణుకుండిన వంశకర్త మహారాజేంద్రవర్మ. అతని కుమారుడు మాధవవర్మ. మాధవవర్మ కుమారుడు గోవిందవర్మ. గోవిందవర్మ తన 37 వ విజయ రాజ్య సంవత్సరమున వేయించిన ఈ శాసనమున 'సత్వ సత్య త్యాగాభిజన నయ వినయోత్సాహాది గుణగణ సంపదా స్వయమధిగత రాజ్యానాం సమ్యక్ప్రజాపాలనా ప్రథితావదాత పృథుయశసాం రాజ్ఞాం విష్ణుకుణ్డీనా మమల విపుల సకలకుల తిలకేన శ్రీ మహారాజేన్ద్రవర్మణః సత్పుత్రేణ మహారాజశ్రీ మాధవవర్మణః సుపుత్రేణ స్వతయ భుజ బలోత్సాహ ప్రభావానురాగావాప్త స్వరాజ్యేన......... మహారాజశ్రీ గోవిన్దవర్మణా.......' అని వర్ణింపఁబడుటవలన విష్ణుకుండినులు స్వపరాక్రమంబునం రాజ్యమును పొందిరని తెలియుచున్నది. అనగా సత్వము, సత్యము, త్యాగము ఉన్నతవంశసంజాతత్వము, నయ వినయోత్సాహాది సద్గుణ సంపత్తిచే స్వపరాక్రమంబునం రాజ్యమునుపొంది సక్రమప్రజాపాలనమువలన కీర్తిగాంచి అనేక దానములవలన విస్తారకీర్తిం బొందిన విష్ణుకుండిన రాజలోకములో నందరికిని తిలకాయమానుఁడగు శ్రీ మహారాజేంద్రవర్మ సత్పుత్రుడై మహారాజశ్రీ మాధవవర్మకు సుపుత్రుఁడై తన భుజ బలోత్సాహముచేతను ... మహాబోధివిత్తముగలవాఁడును అగు మహారాజ గోవిందవర్మ...వర్ణింపబడినాడు.

ఇంద్రపాలనగర తామ్రశాసనములవలన తెలియుచున్న ముఖ్య విషయములు:—

1. గోవిందవర్మ శాసనమున పేర్కొనఁబడిన 1. మహారాజేంద్రవర్మ 2. మాధవవర్మ 3. గోవిందవర్మ.
2. విష్ణుకుండినులు బౌద్ధమతానుయాయులు, బౌద్ధమతాభిమానులు. శ్రీ పర్వతస్వామి పాదానుధ్యాతలు. క్రతుసహస్రయాజులు.
3. ఇంద్రపాలనగరము – బౌద్ధవిహారము.
4. విష్ణుకుండినుల కాలనిర్ణయమునకు సంబంధించిన విక్రమేన్ద్ర భట్టారకవర్మ శాసనమున పేర్కొనఁబడిన శకసంవత్సరము 488.
5. విక్రమేన్ద్ర భట్టారకవర్మ శాసనమున పేర్కొనఁబడిన గోవిందవర్మ వాకాటక రాజకుమారిని వివాహమాడిన మాధవవర్మ తండ్రి. విష్ణుకుండినులు బ్రహ్మ, క్షత్ర తేజస్సు కలవారు.
6. విక్రమేన్ద్ర భట్టారకవర్మ కుమారుడు మాధవరాజు.
7. విక్రమేన్ద్ర భట్టారకవర్మచే ఓడిపోయిన పల్లవ సింహవర్మ.
8. విక్రమేన్ద్ర భట్టారకవర్మ శాసనమున కాఞ్చిపుర సత్రపులలో ప్రముఖుఁడైన శ్రీ మూలరాజు.

పైన పేర్కొనబడిన విషయముల నొక్కొక్క దానిని గ్రహించి విపులీకరించిన విష్ణుకుండినుల విషయమునగల సంశయములు కొంతవరకు తీరుననుటలో సందేహము లేదు.

1. గోవిందవర్మ శాసనమున పేర్కొనఁబడిన 1. మహారాజేంద్రవర్మ 2. మాధవవర్మ 3. గోవిందవర్మ.

విష్ణుకుండినులకు సంబంధించిన ఆరు తామ్ర శాసనములు ఒక శిలాశాసనము ప్రకటింపబడినవి.



5. ఈపూరు శాసనము  6. పొలమూరు శాసనము




ఇంద్రపాలనగర శాసనములు




1. రామతీర్థ శాసనము 2. చిక్కుళ్ళ శాసనము 3. తుండి శాసనము 4. ఈపూరు శాసనము 5. పొలమూరు శాసనముల ననుసరించి శాసనములలో పేర్కొనబడిన రాజులపేళ్లు, విక్రమేంద్ర భట్టారకవర్మ వేయించిన ఇంద్రపాలనగర శాసనములోని రాజుల పేళ్లతో సరిపోవుచున్నవి. కాని విక్రమేంద్ర భట్టారకవర్మ శాసనమున పేర్కొనబడిన గోవిందవర్మ పేరు పైన పేర్కొనబడిన నాలుగు శాసనములందు లేదు. పొలమూరు, ఈపూరు శాసనములందు పేర్కొనబడిన గోవిందవర్మ మాధవవర్మ తండ్రిగా చెప్పబడినాడు. విక్రమేంద్ర భట్టారకవర్మ ఇంద్రపాల నగర తామ్రశాసనమున పేర్కొనబడిన గోవిందవర్మ పైతము మాధవవర్మ తండ్రిగానే పేర్కొనబడినను ఈ మాధవవర్మలు మాత్రము వేర్వేరని చెప్పుట కవకాశమున్నది. విక్రమేంద్ర భట్టారకవర్మ శాసనమున పేర్కొనబడిన మాధవవర్మ గోవిందవర్మ పుత్రుడు. వాకాటక మహాదేవిని వివాహమాడినవాడు. ఏకాదశాశ్వమేధ, రాజసూయ, వాజపేయ, పురుషమేధ క్రతు సహస్రము లాచరించిన వాడు. మాధవవర్మ కుమారుడు విక్రమేంద్రవర్మ. వాకాటక మహాదేవి సుతుడు.

పొలమూరు, ఈపూరు శాసనములందు పేర్కొనబడిన మాధవవర్మ గోవిందవర్మ కుమారుడే యైనను విక్రమేంద్ర భట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనమున పేర్కొనబడిన మాధవవర్మ మాత్రము కాదు. ఈ మాధవవర్మ కుమారుడు మంచన భట్టారకుడు. ఈ మాధవవర్మ జనాశ్రయుడు. త్రివర నగర భవన గత పరమ యువతిజన విహరణ రతి రనస్య నృపతి సాధారణుడు.

రామతీర్థ శాసనము, చిక్కుళ్ళ శాసనము, తుండి శాసనము, విక్రమేంద్ర భట్టారకవర్మ ఇంద్రపాలనగర శాసనములందు పేర్కొనబడిన మాధవవర్మ గోవిందవర్మ కుమారుడు. దేవవర్మ కుమారుడగు మాధవవర్మ తన 47 వ సంవత్సరమున వేయించిన ఈపూరు శాసనమున దేవవర్మ తండ్రిగా పేర్కొనఁబడిన మాధవవర్మ పైన పేర్కొనబడిన శాసనము లందలి గోవిందవర్మ కుమారుడగు మాధవవర్మయే కాని అన్యుఁడుకాడు.

విక్రమేంద్ర భట్టారకవర్మ ఇంద్రపాల నగర తామ్ర శాసనమున పేర్కొనబడిన గోవిందవర్మ మాధవవర్మ తండ్రి. గోవిందవర్మ షడభిజ్ఞప్రతిపాద్య దర్శనానుగ్రహమువలన సుగతసిద్ధాంతమునందు గౌరవము కలిగిన వాడును సర్వలోకములకు దీటైన అందముతోగూడిన మహావిహారములను నిర్మించుట వలన బ్రాహ్మణోపకారజనితంబగు పుణ్య సంభారముమ పొందినవాడునై యుండెను.

పొలమూరు శాసనమున పేర్కొనబడిన గోవిందవర్మ 'అనేక సమర సంఘట్ట విజయినః పరనరపతి మకుటమణిమయూఖావధాత చరణయుగళ విక్రమాశ్రయస్య శ్రీ గోవిందవర్మణః' అని ప్రశంసింపఁబడినాడు.

ఈపూరు శాసనమున పేర్కొనబడిన గోవిందవర్మ 'భగవచ్ఛ్రీపర్వతస్వామిపాదానుధ్యాతస్య విష్ణుకుండినామాపరిమితబలపరాక్రమస్య పరమ ధార్మికస్య ప్రణత సకల సామంత స్యానేక గోహిరణ్య భూమి ప్రదానస్య మహారాజస్య శ్రీ గోవిందవర్మణః' అని ప్రశంసింపబడినాడు.

గోవిందవర్మ ఇంద్రపాల నగర తామ్రశాసనమున గోవిందవర్మతండ్రి మాధవవర్మ, తాత మహారాజేంద్ర వర్మ పేర్కొనబడినారు. ఈ శాసనమును గోవింద వర్మ తన 37 వ రాజ్య సంవత్సరమున వేయించి నాడు. మహారాజేంద్రవర్మ వంశపరంపరగా వచ్చిన రాజ్యమున కధికారికాడు. 'సత్వ సత్వ త్యాగాభిజన నయ వినయోత్సాహాది గుణగణ సంపదా స్వయమధిగత రాజ్యాణాం సమ్యక్ప్రజాపాలనాత్ప్రథి తావదాత ప్ర థుయశ సాం రాజాం విష్ణుకుణ్డీనా మమల విపుల సకల కుల తిలకేన శ్రీ మహారాజేన్ద్రవర్మణా' అని ప్రశంసింప బడినాడు. ఇతని పుత్రుడు మాధవవర్మ మహారాజుగా పేర్కొనబడినాడు. శాసనము వేయించిన గోవిందవర్మ 'సకలసత్వధాతుత్రాణాయో త్పాదితమహాబోధివిత్తేన మహారాజశ్రీ గోవిందవర్మణా' అని వర్ణింపబడి నాడు. ఇతడు మహాదేవి విహారమునకు పేన్కాపఱ గ్రామమును దానము గావించెను.

విక్రమేంద్రభట్టారకవర్మ శాసనమున పేర్కొనబడిన గోవిందవర్మ బౌద్ధమతాభిమాని. ఇతడును బౌద్ధమతానురక్తుడు. విక్రమేంద్ర భట్టా రకవర్మ శాసనమున 'ప్రతివిషయమతి బహుప్రకార మణరమోదారక కవర్మాద్భుత స్నాత విహార చూడామణిభి రలంకృత సకలదక్షిణాపథస్య శ్రీపార్వ తేయ పూర్వాపర క్షితిపతి పరంపరాహార మద్ధ్య నిరుపమ విరాజితయా కౌస్తుభాయమాన యశో జన్మనః గుణరూప సంపద్భి రనుగత గోవిన్దస్య శ్రీ గోవిన్ద రాజస్య మూర్తిమతీం శ్రియం ప్రత్య విష యాకృత మనోరథయా పరమభట్టారికా మహా దేవ్యా శ్రీమ ద్రిన్ద్రపుర ముచ్చై రలంకర్తుకామ యేవ ప్రతిష్ఠాపితే శ్రీమతి పరమభట్టారికా మహా విహారేస్మిభి ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్స రైకా దశే కార్తికమాస కృష్ణపక్షేష్టమ్యాం చాతుర్దిశ శార్యవరభిక్షుసంఘపరిభోగాయ సర్వకాదాన సహిత సర్వబాధా పరిహారేణ ఇరుణ్డఱో నామ గ్రామో దత్తః' అని కలదు.

గోవిందవర్మపై గల అభిమానము వలనను సింహవర్మను జయించుట వలన కలిగిన సంతోషాతి శయము వలనను విక్రమేన్ద్ర భట్టారకవర్మ 'ఇరు ణ్డఱో' గ్రామమును భిక్షుసంఘములకు దానమిచ్చి నాడు. విక్రమేన్ద్ర భట్టారకవర్మ చిక్కుళ్ల, తుండి శాసనములందు అతని ప్రపితామహ, పితామహ, పిత రులు మాత్రమే పేర్కొనబడినారు. కాని ఇంద్ర పాలనగర తామ్రశాసనమున ప్రపితామహుడగు మాధవవర్మ తండ్రి గోవిందవర్మ పేర్కొనబడినాడు. ఈ గోవింద్రవర్మ తండ్రి మాధవవర్మ. గోవిందవర్మ ఇంద్రపాలనగర శాసనమున పేర్కొనబడినవాడు. గోవింద వర్మ తండ్రిపేరును కుమారునకు పెట్టియుండ వచ్చును. ఈ కారణమువలన విక్రమేన్ద్ర భట్టారక వర్మ శాసనమున పేర్కొనబడిన గోవిందవర్మ—ఇంద్ర పాలనగర తామ్రశాసనమును వేయించిన మహారాజేంద్ర వర్మ పౌత్రుడును మహారాజశ్రీ మాధవవర్మ పుత్రు డును నగు గోవిందవర్మ ఒక్కరేనని తెలియుచున్నది. కావున విష్ణుకుండిన వంశకర్త మహారాజేంద్రవర్మ యనియు అతని కుమారుడు మొదటి మాధవవర్మ, మనుమడు గోవిందవర్మ యని విశదమగుచున్నది. ఈ గోవిందవర్మ కుమారుడే ఏకాదశాశ్వమేధ క్రతుసహస్ర పౌండరీక వాజపేయ పురుషమేధాదులు చేసి, విష్ణు కుండిన సామ్రాజ్యమును విస్తరింపజేసి వాకాటక రాజకుమార్తెను వివాహమాడిన వాడు.

2. ........ బౌద్ధమతాను యాయులు. బౌద్ధమతాభిమానులు. వైదికమతాను యాయులు. శ్రీ పర్వతస్వామి పాదానుధ్యాతలు. క్రతుసహస్రయాజినులు.

విష్ణుకుండిన వంశస్థాపకుదు మహారాజేంద్ర వర్మ—ఇక్ష్వాకు వంశ పతనానంతరము ఆంధ్రదేశ మును వివిధ వంశములకుఁ చెందిన రాజులు పాలిం చిరి. అందు బృహత్ఫలాయన, ఆనంద గోత్రిక, శాలం కాయన, పల్లవ వంశీయులు ముఖ్యులు. విష్ణుకుండి నులు ఇక్ష్వాకు వంశీయులకు మండలాధిపతులుగనో లేక సామంతమాండలికులుగనో వ్యవహరించియుందురు. కృష్ణానదికి ఉత్తరమున విజయపురికి దగ్గరలో నల్లగొండమండలమున ఏలేశ్వర ప్రాంతము విష్ణు కుండినుల కావాసస్థలముగా నుండియుండవచ్చును. మూసీనదీతీరమునున్న ఇంద్రపాలనగరము ఇక్ష్వాకుల కాలమున బౌద్ధక్షేత్రముగా వర్ధిల్లియుండును. మూసీనది నల్లగొండ మండలమున ప్రవహించు

చున్నది. వాడపల్లి వద్ద కృష్ణానదిలో సంగమమగు చున్నది. నల్లగొండమండలములోని సూర్యాపేట నుండి జనగామ వెళ్ళు మార్గమున ఫణిగిరి గ్రామమున బౌద్ధస్థూప మున్నది. ఫణిగిరి, గాజులబండ, కొండాపురము బౌద్ధుల కావాస స్థలములు. కొండాపురము ఆంధ్రరాజులకాలమున అత్యంత వైభవముగా నున్న నగరము. హైదరాబాదు నగరమునకు 40 మైళ్ళ దూరమున మెదకుజిల్లాలోనున్న గ్రామము. ప్రస్తుతము ఖమ్మంజిల్లాలోనున్న నేలకొండపల్లిలో బౌద్ధులకు సంబంధించిన దిబ్బ యున్నది. ఖమ్మం, నల్లగొండ, మెదకు, హైదరాబాదు, మహబూబ్‌నగర్, కరీంనగర్‌జిల్లాలు నాడు విష్ణుకుండినులు మొట్టమొదట పాలించిన ప్రాంతములుగా యూహింపవచ్చును. ఇప్పటి కృష్ణాజిల్లా విష్ణుకుండినులు తొలుత పాలించిన ప్రాంతమే. జగ్గయ్యపేట రామిరెడ్డిపల్లి ప్రాంతమున ఇక్ష్వాకుల శాసనములు లభించినవి. కావున ఇక్ష్వాకుల కాలమున బౌద్ధ మవలంబించిన విష్ణుకుండినులు బౌద్ధమతానురక్తులై యుండిరని యూహింపవచ్చును.

విష్ణుకుండిన వంశీయులలో మహారాజేంద్ర వర్మ ఆతనిపుత్రుడు మాధవవర్మ పౌత్రుడు గోవిందవర్మ బౌద్ధమతానుయాయులు. బౌద్ధమతాభిమానులు. రెండవమాధవవర్మ దేవవర్మ మూడవ మాధవవర్మ వైదిక మతానుయాయులు. విక్రమేంద్ర వర్మ బౌద్ధుడు. ఇంద్రభట్టారకవర్మ, విక్రమేన్ద్ర భట్టారకవర్మ బౌద్ధమతాభిమానులు. గోవిందవర్మ మాధవవర్మ IV వైదిక మతానుయాయులు.

విష్ణుకుండినులు బౌద్ధమతానుయాయులు, మతాభిమానులనుటకు వారిశాసనములందుగల వర్ణనలే తార్కాణము. ఇంద్రపాలనగరశాసనము వలన ఈ విషయము తెలియుచున్నది. గోవిందవర్మ 'సకలదిగన్తరేణ భిక్షుద్విజానాథయాచకవ్యాధితదీనకృపణజనోపభుజ్యమాన న్యాయాధిగత విభవ ధన సముదయేనా...... మహాబోధివిత్తేన...' అని వర్ణింపబడినాడు. విక్రమేన్ద్ర భట్టారకవర్మ శాసనమున గోవిందవర్మ 'షడభిజ్ఞ ప్రతిపాద్య దర్శనానుగ్రహ జనిత సుగత శాసనాభిప్రసాదస్య విబుధ భవన ప్రతిస్పర్ధి శోభా సముదయానేక మహావిహార ప్రతిష్ఠాపనాధిగతానన్త బ్రాహ్మణ పుణ్య సంభారస్య' అని వర్ణింపబడినాడు. అట్లే విక్రమేన్ద్రవర్మ 'మహారాజశ్రీ మాధవ వర్మణః ప్రియపుత్రస్య వాకాటకమహాదేవీసుతస్య మహాకవేః పరమసౌగతస్య' అని పేర్కొనబడినాడు.

విష్ణుకుండినులలో రెండవమాధవవర్మ, మూడవమాధవవర్మ, నాలుగవమాధవవర్మ వైదిక మతానుయాయులు.

రెండవమాధవవర్మ, మూడవమాధవవర్మ వేయించిన ఈపూరు శాసనమున[4] 'ఏకాదశాశ్వమేధావభృతావధౌత జగత్కల్మశస్య స్విష్టోమసహస్రయాజినో నేకసామన్త మకుటమణిఖచిత చరణయుగళ కమలస్య మహారాజస్య శ్రీ మాధవవర్మణః' అనియు, విక్రమేన్ద్ర భట్టారకవర్మ ఇంద్రపాలనగర శాసనమున 'ఏకాదశాశ్వమేధ బహుసువర్ణ పౌణ్డరీక వాజపేయ క్రతుసహస్రసర్వమేధ రాజసూయ పురుషమేధాద్య హరహస్యమ్యగనుష్ఠిత శ్రుతివిహితాశేష దుష్కర కర్మణాకమార్మణానుష్ఠానస్య—' అని వర్ణింపబడినాడు. మూడవమాధవవర్మ తాను వేయించిన ఈపూరు శాసనమున 'భగవచ్ఛ్రీ పర్వతస్వామి పాదానుధ్యాతో' అని వర్ణింపబడినాడు.

నాలుగవమాధవవర్మ పొలమూరు శాసనమున 'క్రతుసహస్రయాజి హిరణ్యగర్భ ప్రసూతః ఏకాదశాశ్వమేధో వభృదస్నాత' అని వర్ణింపబడినాడు.

రాజులు బౌద్ధమతానుయాయులుగా నుండిరి. రెండవ మాధవవర్మ వాకాటక రాజకుమారిని వివాహమాడిన యనంతరము బౌద్ధమతమును వీడి, వైదికమత మవలంబించి వాకాటకరాజువలె యజ్ఞయాగాది క్రతువులు అశ్వమేధ పురుషమేధాది క్రతువు లాచరించి వైదిక మతోద్ధరణకు పాటుపడినాడు. బౌద్ధమత గురువుల యొక్కయు, సన్యాసినులయొక్క ప్రవర్తనలో మార్పు వచ్చినది. బౌద్ధ సంఘారామములు అవినీతికి నిలయములైనవి. వైదికమత ప్రాబల్యము అధికమగుట వలన మాధవవర్మ వైదికమత మవలంబించి యజ్ఞ

4. E. I. Vol XVII Page 337.

5. J. A. H. R. S. Vol VI Page. 17.

యాగాది క్రతువు లాచరించినాడు.

### 3. ఇంద్రపాలనగరము — బౌద్ధవిహారము.

ఇంద్రపాలనగరము మూసీనదియొడ్డున నున్నది. ఇంద్రపాల గుట్ట, కోట, శిథిలరూపముననున్న కట్టడములు, నాగవరము — తుమ్మలగూడెము, వలిగొండ ప్రాంతములందు కనిపించు శిథిలరూపములు, ఇండ్ల అడ్డుగులు, పునాదులు - పరిశీలించిచూడ, ఇంద్రపాల నగర ప్రాంతమున, శాసనములందు వర్ణింపబడినట్లు మహాద్భుతమైన కట్టడములతో బౌద్ధారామవిహారము లిచట వర్ధిల్లినట్లు తోచుచున్నది. అంతియేకాక, విజయపురిలో ఇక్ష్వాకువంశ మంతరించినపిమ్మట, పల్లవ, శాలంకాయన వంశీయుల ఏలుబడిలో కృష్ణకు దక్షిణముగానున్న గుంటూరు మున్నగు ప్రాంతము లందు బౌద్ధమతమునకు రాజాదరణము సన్నగిల్లుట వలన తెలంగాణప్రాంతమున బౌద్ధము వ్యాపించినట్లు భావింపవచ్చును. ఇంద్రపాలనగరముననున్న మహాదేవి విహారము ముఖ్యమైనదై యుండవచ్చును. ఈ విహారముననున్న బౌద్ధమతాచార్యుడు ఫణిగిరి, గాజులబండ, కొండపల్లి, మున్నగుప్రాంతములందున్న విహారములపై అధిపత్యము నెఱపి యుండవచ్చును. పురావస్తుశాఖవారి ప్రయత్నమువలన మహాదేవి విహారము బయల్పడవచ్చునని ఆశింపవచ్చును.

### 4. విష్ణుకుండినుల కాలనిర్ణయమునకు సంబంధించిన విక్రమేన్ద్ర భట్టారకవర్మ శాసనమున పేర్కొనబడిన శక సంవత్సరము 488.

విక్రమేన్ద్ర భట్టారకవర్మ శాసనమున 'సాష్టాశీతి చతుఃశ్శతే శకవతే సంవత్సరాణాంగతే' అని యుండుటవలన విష్ణుకుండినుల కాలనిర్ణయమునకీ శక సంవత్సరము 488 తోడ్పడుచున్నది.

ఇంతవరకు విష్ణుకుండినుల శాసనములందు విజయరాజ్య సంవత్సరములేతప్ప శక సంవత్సరములు పేర్కొనబడలేదు. కావున ఈ శాసనమున కెంతేని ప్రాముఖ్య మివ్వవలసి వచ్చుచున్నది. విష్ణుకుండినుల వంశ నిర్ణయముతోపాటు రాజుల పరిపాలనా కాలము కూడ నిచట పేర్కొని కాలనిర్ణయము చేయుట సముచితమని తలుతును.

మహారాజేంద్రవర్మ (388—390)
|
మాధవవర్మ I (390—398)
|
గోవిందవర్మ I (398—435)
|
మాధవవర్మ II (435—470)

దేవవర్మ (470—473)
|
మాధవవర్మ III (473—522)

విక్రమేంద్రవర్మ (522—528)
|
ఇంద్రభట్టారకవర్మ (528—556)
|
విక్రమేన్ద్ర భట్టారక వర్మ (556—570)

మాధవరాజు

గోవిందవర్మ II (570—573)
|
మాధవవర్మ IV (573—623)
|
మంచన భట్టారక (623—624)

సముద్రగుప్తుడు దక్షిణాపథముపై దండెత్తి వచ్చినపుడు దక్షిణభారతమున వివిధ వంశీయులు పాలించుచుండిరి. అలహాబాదు శాసనమున హరిసేనుడు సముద్రగుప్తుని దిగ్విజయము వర్ణించుచు దక్షిణాపథమున జయించిన రాజ్యములను రాజులను పేర్కొనినాడు.

'కౌసలక — మహేంద్ర; మహాకాంతారక — వ్యాఘ్రరాజ; కౌరాలక—మంత్రరాజ; పిష్టపురక—మహేంద్ర; గిరికొత్తూరక—స్వామిదత్త; అరింద పల్లవ-దమన; కాంచేయక-విష్ణుగోప; అవముక్తక-నీలరాజ; వైంగేయక-హస్తివర్మ; పాలక్కక—ఉగ్రసేన; దైవరాష్ట్రక-కుబేర; కౌస్థలపురక—ధనంజయ; ప్రభృతి సర్వదక్షిణాపథ రాజగ్రహణ మోక్షానుగ్రహజనిత ప్రతాపోన్మిశ్ర మహాభాగ్యస్య '6

సముద్రగుప్తుని దక్షిణదేశ దిగ్విజయానంతరము శాలంకాయన, పల్లవ, ఆనందగోత్రికుల బలము క్షీణించుచున్న సమయమున విష్ణుకుండినులు కృష్ణానదికి ఉత్తరమున రాజ్యము స్థాపించు ప్రయత్నములు చేయసాగిరి. విష్ణుకుండిన మహారాజేంద్రవర్మ ఏలేశ్వరము, మిర్యాలగూడ, నల్లగొండ, భువనగిరి ప్రాంతములను తన అధికారము క్రిందికి తెచ్చుకుని ఇంద్రపాలనగరమును రాజధానిగా క్రీ. శ. 388 ప్రాంతమున రాజ్యమును స్థాపించినట్లూహింపవచ్చును. అప్పటికి ఆనందగోత్రికులు బలహీనులై పల్లవ రాజాతో యుద్ధములు చేయుచుండిరి. కళింగులు—శాలంకాయనులు—పల్లవులు పరస్పరము కలహించుచుండుటవలన విష్ణుకుండినులు రాజ్యము స్థాపించి స్థిరపడుట కవకాశము కలిగినది.

శాలంకాయన హస్తివర్మ యనంతర మాతని తనయుడు నందివర్మ ఆంధ్రదేశాధీశు డయ్యెను. ఇతడు ధర్మప్రధానుడు. నందివర్మ యనంతరము చండవర్మ; చండవర్మ తరువాత విజయనందివర్మ రాజయ్యెను. ఈతని కాలమున శాలంకాయన రాజ్యము క్షీణింప మొదలిడెను. అప్పుడు విష్ణుకుండిన గోవిందవర్మ విజృంభించి కృష్ణకు దక్షిణమునున్న గుంటూరు మండలమును, క్రమముగా కృష్ణా గోదావరీ మధ్య భూభాగమును జయించి విష్ణుకుండిన స్రామాజ్యమును విస్తృతపరచెను. అటు కళింగమున సముద్రగుప్తుని దిగ్విజయానంతరము శాలంకాయన హస్తివర్మ సామంతులు స్వతంత్రరాజ్యముల నేర్పరచుకొనుచుండిరి. కళింగమున శక్తివర్మ రాజ్యవిస్తృతికి ప్రయత్నించుచుండెను. పల్లవులు కదంబులతో పోరాడుచుండిరి. ఇట్టి తరుణమందే విష్ణుకుండిన రాజ్యము వృద్ధిచెందుట కవకాశము కలిగెను. విష్ణుకుండినుల కాలనిర్ణయమునకు విక్రమేంద్ర భట్టారకవర్మ శాసనమున పేర్కొనబడిన శకసంవత్సరము 488 ప్రాతిపదికగా తీసుకొనిన ఎడల—

విక్రమేంద్ర భట్టారకవర్మ 11 వ రాజ్య సంవత్సరమున వేయించిన శాసనము కనుక అతడు రాజ్యమునకు వచ్చిన సంవత్సరము క్రీ. శ. 556. తుండి తామ్రశాసనము7 14 వ రాజ్య సంవత్సరపుది కావున విక్రమేంద్ర భట్టారకవర్మ కాలము 556–570 అని నిర్ణయించడమైనది. ఇతని కుమారుడు గోవిందవర్మ రాజ్యకాలము 570 · 573.

నాలుగవ మాధవవర్మ 48 వ రాజ్య సంవత్సరపు పొలమూరు శాసనమునుబట్టి అతని కాలము 573—623 అనియు, అతని పుత్రుడు మంచన భట్టారకు డొక సంవత్సరము మాత్రమే పాలించినాడని (623—624) అని తెలిపినాను. విక్రమేంద్ర భట్టారకవర్మ తండ్రి ఇంద్రభట్టారకుడు 27 వ రాజ్య సంవత్సరమున రామతీర్థ శాసనము వేయించినాడు. కావున అతని రాజ్యకాలము 528–556గా నిర్ణయించినాను. విక్రమేంద్రవర్మ వృద్ధాప్యమున రాజైనవాడు కావున అతడు 522–528 వరకు పాలించియుండవచ్చును. మూడవ మాధవవర్మ ఈపూరు శాసన మాతని 47 వ రాజ్య సంవత్సరమున వేయించినది. ఇతని పాలనాకాలము 473–522. రాజేంద్రవర్మ 388-390, మాధవవర్మ 390–398, గోవిందవర్మ 398—435, మాధవవర్మ435-470 దేవవర్మ 470—473 అని నిర్ణయించడమైనది. ఐన చాళుక్యుల రాజ్యస్థాపనము ఆంధ్రదేశమున క్రీ. శ. 610 నాటికే ఏర్పడినట్లు చారిత్రకు లంగీకరించినారు. అప్పటికి విష్ణుకుండిన వంశ మంత

6. సముద్రగుప్తుని అలహాబాదు శాసనము. Fleet – Gupta Inscriptions, C. i. i. Vol III No. 1.

7. Hyd. Arch. series No. 8.

రించినట్లు భావించుచున్నారు. రెండవ పులకేశి 609 వ రాజై దండయాత్రకు బయలుదేరెను. రెండవ పులకేశి మారుటూరు శాసనము[8] క్రీ. శ. 616 లో నీయబడినది. రెండవ పులకేశి కొప్పారపు శాసనము[9] వేయించుటకుముందు అనగా క్రీ శ. 631 నాటికి కుబ్జ విష్ణువర్ధనుడు ఆంధ్రదేశమునకు యువరాజుగా లేక ప్రతినిధిగా నియమింపబడినాడని భావింపవచ్చును.

కుబ్జవిష్ణువర్ధనుడు క్రీ. శ. 641 వరకు రెండవ పులకేశి మహారాజు ప్రతినిధిగా ఆంధ్రదేశమును పాలించెను. ఆతని మరణానంతరమే కుబ్జ విష్ణువర్ధనుడు మహారాజై చీపురుపల్లి శాసనమును వేయించెను. ఈతని కుమారుడు జయసింహవల్లభుడు. విష్ణుకుండిన నాలుగవ మాధవవర్మ పాలమూరు శాసనము[10], జయసింహవల్లభుని శాసనము ఒకేచోట కలిసి దొరికినవి.

| పాలమూరు శాసనము | జయసింహవల్లభుని శాసనము |
|---|---|
| గౌతమ గోత్రము | గౌతమ గోత్రము |
| \| | |
| రుద్రశర్మ | దామశర్మ |
| \| | \| |
| దామశర్మ | శివశర్మ |
| \| | \| |
| శివశర్మ (ప్రతిగ్రహీత) | రుద్రశర్మ (ప్రతిగ్రహీత) |

ఈ రెండు శాసనములలో పేర్కొనబడిన ప్రతిగ్రహీతల పేళ్ళు, వారి తాత, తండ్రుల పేళ్లను గుర్తించినయెడల, పాలమూరు శాసన ప్రతిగ్రహీత కుమారుడే జయసింహవల్లభుని శాసన ప్రతిగ్రహీతయని తెలియుచున్నది. మాధవవర్మ IV శివశర్మకు గుద్రవాడి విషయములోని పులుంచూరును దానమిచ్చి నట్లుండ, జయసింహవల్లభుడా గ్రామమునే శివశర్మ కుమారుడగు రుద్రశర్మకు స్థిరపరచినాడు. కావున మాధవవర్మ తన అవసానదశలో ఈ దాన మొసంగి యుండును. ఈ శాసనమును మాధవవర్మ ఫాల్గుణ పౌరమి చంద్రగహణ నిమిత్తము గావించినటు తెలియుచున్నది. చంద్రగహణము ఫాల్గుణమాసమున వచ్చు సంవత్సరములు క్రీ. శ. 575; 593; 594; 612; 621; బహ్మశ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు మాధవవర్మ పాలమూరు శాసనమును తన 48 వ రాజ్య సంవత్సరమున అనగా క్రీ. శ. 594 వ సంవత్సరము ఫిబ్రవరి 10 వ తేదీన వేయించినట్లు నిర్ణయించినారు.[11] కాని విక్రమేంద్ర భట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము ననుసరించి మాధవవర్మ IV రాజ్యమునకువచ్చిన కాలము 573 అగుచున్నది. అప్పుడు 48 వ రాజ్య సంవత్సరమున వేయించిన పాలమూరు శాసనము క్రీ. శ. 621 వ సంవత్సరమునకు సరిపోవును.

రెండవ పులకేశి కృష్ణానది దక్షిణ ప్రాంతమును జయించి తన రాజధానికి వెడలునపు డాంధ్రదేశమున తన ప్రతినిధిని నిలిపియుండెను. నాలుగవ మాధవవర్మ కాలము నాటికి విష్ణుకుండినుల రాజధని బెజవాడ. పులకేశి ప్రతిస్పర్థులు కాంచీపురాధీశులు కావున వారితో యుద్ధములు చేయుచు కృష్ణానదికి దక్షిణముననున్న గుంటూరు తదితర ప్రాంతములను జయించియుండును. మాధవవర్మ పులుంచూరు గ్రామ దానమునకు ప్రతిగృహీత శివశర్మ. జయసింహవల్లభుడు శివశర్మ కుమారుడగు రుద్రశర్మకు పులుంచూరు అగ్రహారము నొసంగి స్థిరపరచినాడు. ఇది ఆతని ఐదవ విజయరాజ్య సంవత్సరమున జరిగిన విషయము. ఈ అగ్రహారము నతడు విజయస్కంధావారమునుండి పునరుద్ధరించెను. జయసింహవల్లభుని కప్పటివరకు కృష్ణానది కుత్తరముననున్న ఇప్పటి గోదావరి మండలములోని రామచంద్రాపురము తాలూకాలోనున్న పాలమూరు ప్రాంతము వశము కాలేదని స్పష్టమగుచున్నది. విష్ణుకుండిన మాధవవర్మ IV కుమారుడగు మంచనభట్టారకుని యుద్ధమున జయించి విజయస్కంధావారమునుండి పులంచూరు శాసనమును పునరుద్ధరించినట్లూహింపవచ్చును. ఈ రెండు శాసనము లొకేచోట దొరుకుటనుబట్టియు, ఒకే వంశమునకుజెందిన వారును – రెండు శాసనములలోని ప్రతిగ్రహీతలు తండ్రికొడుకులు కాబట్టి మాధవవర్మ క్రీ. శ. 623 వరకు జీవించియుండ

8. C. P. Inscriptions of A. P. Govt. Museum. Hyd. Vol I. Page II.

9. E. I. Vol XVIII Page 257.

10. J. A. H. R. S. Vol. VI; P. 17.

11. భారతి. ప్రమోదూత – భాద్రపదము. P. 474.

వచ్చునమట కవకాశమున్నది. అంతియేగాక మాధవ వర్మ 623 వరకు జీవించియున్నట్లు మరియొక విధముగను భావింపవచ్చును. నల్లగొండ మండలము లోని దండపాడు గ్రామమున 1335 ఫసిలీలో నొక నాణెముల బిందె లభించినది. నాణెముల తూకము 4920 తులములు. ఈ నాణెములపై నోరు తెరచుకొని లంఘించుటకు సిద్ధముగానున్న భయంకర సింహరూపము, సింహముముందు అడ్డముగా విచ్చు కత్తియు, 'సత్యాశ్రయ విషమసిద్ధి' అను పేరును చెక్కియున్నవి. ఈ నాణెములు విష్ణుకుండినులవి. విష్ణుకుండినుల నాణెములపై లంఘించు సింహము, పూలతొట్టి చిహ్నములు కనిపించుచున్నవి. కుబ్జవిష్ణు వర్ధనుడు 624–631 మధ్య ఈ ప్రాంతము నాక్రమించుకొని యుండును. అప్పుడే విష్ణుకుండి నుల నాణెములపై తన విజయ చిహ్నముగ సింహము ముందు కత్తి—తన పేరును చెక్కించియుండును. కుబ్జవిష్ణువర్ధను డాంధ్రదేశమును పాలించుటకు, పులకేశి ప్రతినిధిగా క్రీ. శ 624 లో స్థిరపడి క్రమముగా తూర్పుచాళుక్య సామ్రాజ్య నిర్మాత య య్యెను.

కుబ్జవిష్ణువర్ధనుడు రెండవ పులకేశి వేయిం చిన మారుటూరు శాసనమున యువరాజుగా పేర్కొన బడలేదు. ఆ శాసనము క్రీ. శ. 616 లో వేయించి నది. కొప్పారము శాసనకాలము క్రీ. శ. 631. అనగా క్రీ. శ. 616 వరకు కుబ్జవిష్ణువర్ధను డాంధ్రదేశ మున ప్రతినిధిగా నియమింపబడలేదు. దక్షిణాపథ మున విష్ణుకుండినులు బలవంతులై యుండుటవల నను, తన ప్రతినిధి పరిపాలన బాగుగాలేకుండుటవలనను పులకేశి, సమరయోధుడైన తన తమ్ముడగు కుబ్జ విష్ణువర్ధనుని ఆంధ్రదేశమును పాలించుటకు ప్రతి నిధిగా పంపెను. కుబ్జవిష్ణువర్ధను డాంధ్రదేశము నకు క్రీ. శ. 620 ప్రాంతమున వచ్చి, క్రీ. శ. 620–623 వర కాంధ్రదేశమున సుస్థిరమైన ప్రభుత్వము నేర్పరచి క్రీ. శ. 623 లో విష్ణు కుండిన మాధవవర్మ నోడించి, బెజవాడ–జగ్గయ్య పేట, నల్లగొండ మున్నగు ప్రాంతములను జయిం చెను. కుబ్జవిష్ణువర్ధనునితో జరిగిన యుద్ధమున నాలుగవ మాధవవర్మ మరణించియుండును. మంచన భట్టారకుడు తండ్రి మరణానంతరము, తన యను చరులతో గోదావరి మండలమున రాజ్య మేర్పరచు కొని, జయసింహవల్లభుని కాలమువరకు చాళుక్యు లతో పోరాడుచు క్రీ. శ. 646 లో జరిగిన యుద్ధ మున మరణించియుండును.

5. విక్రమేన్ద్ర భట్టారకవర్మ శాసనమున పేర్కొనబడిన గోవిందవర్మ వాకాటక రాజ కుమారిని వివాహమాడిన మాధవవర్మ తండ్రి. విష్ణుకుండినులు బ్రహ్మక్షత్రతేజము కలవారు.

విక్రమేన్ద్ర భట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనమున విష్ణుకుండినులు 'బ్రహ్మక్షత్ర తేజో భృతాం...షడభిజ్ఞ ప్రతిపాద్య దర్శనానుగ్రహ...మహా రాజశ్రీ గోవిన్దవర్మణః పుత్ర స్యైకాదశాశ్వమేధ బహుసువర్ణ పౌణ్డరీక వాజపేయ......మహారాజశ్రీ మాధవవర్మణ ప్రియపుత్రస్య వాకాటక మహా దేవీ సుతస్య మహాకవే పరమ సౌగతస్య......' అని వర్ణింపబడుటవలన విష్ణుకుండినులు పల్లవులవలె బ్రాహ్మణులనియు, గోవిందవర్మ బౌద్ధమతావలంబియై, విహారముల నిర్మించెననియు, అతని పుత్రుఁడు ఏకా దశాశ్వమేధ పౌండరీక వాజపేయక్రతు సహస్ర పురుష మేధము లొనర్చిన మాధవవర్మయనియు, మాధవవర్మ కుమారుడు మహాకవియు, వాకాటక మహాదేవి సుతుడును, సుగత సిద్ధాంతావలంబియు నగు విక్రమేంద్రవర్మయని తెలియుటవలన—మాధవవర్మ తండ్రి గోవిందవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనమును తన 37 వ రాజ్య సంవత్సరమున వేయించిన వాడే యని భావింపవచ్చును.

6. విక్రమేన్ద్ర భట్టారకవర్మ కుమారుడు మాధవరాజు.

విక్రమేంద్ర భట్టారకవర్మ శాసనమువలన ఈ రాజుకు మాధవరాజను కుమారుడున్నట్లు తెలియు చున్నది. ఈ మాధవరాజు బలపరాక్రమ శౌర్య ధైర్య సంపన్నుడు. అందమైనవాడు. వంశాలంకారుడు. విక్ర మేంద్ర భట్టారకవర్మ జ్యేష్ఠపుత్రుఁడు. మాధవరాజు అకాలమృత్యువువాత బడుటవలననో లేక యుద్ధము అందు వీరస్వర్గ మలంకరించుటవలననో విక్రమేంద్ర భట్టారకవర్మ తదనంతర మాతని రెండవ కుమారు డగు 2 వ గోవిందవర్మ రాజయ్యెను.

7. విక్రమేంద్ర భట్టారకవర్మచే ఓడిపోయిన పల్లవ సింహవర్మ.

విక్రమేంద్ర భట్టారకవర్మ ఇంద్రపాలనగర శాసనమున 'కృత్వా పల్లవ భంగ పేలవబలం సింహోవ్వయం పల్లవం భూత్వా వృత్యయదాగతః ప్రథమ తక్షశక్రాభిధానం పురం ప్రాదాచ్ఛాసన ముత్తమాశ్రయ ఇతిఖ్యాతస్తదేవం నృపః సాష్టాశీతి చతుఃశ్శతే శక పతే సంవత్సరాణాం గతే' అని యుండుటవలన ఈ సింహవర్మ ఎవ్వ రను ప్రశ్న ముదయించును. డా. మారేమండ రామారావుగారు సెలవిచ్చినట్లు ఈ సింహవర్మ రెండవ కుమార విష్ణువు పుత్రుడనియే భావించ వలయును.

పల్లవ వంశ వృక్షము

సింహవర్మ (మంచికల్లు శిలాశాసనము) 290 A. D.

కుమారవిష్ణు

స్కందవర్మ I—310 A. D

బుద్ధవర్మ — వీరవర్మ

బుధ్యాంకుర — స్కందవర్మ II

సింహవర్మ II — యువమహారాజు విష్ణుగోపుడు—350 A. D

ఉగ్రవర్మ — సింహవర్మ III

విష్ణుగోప II

స్కందవర్మ III

సింహవర్మ IV

నందివర్మ — కుమారవిష్ణు I

బుద్ధవర్మ

కుమారవిష్ణు II

సింహవర్మ V. 550—566

సింహవిష్ణు

మహేంద్రవర్మ I. 600—630

కావున విక్రమేంద్ర భట్టారకవర్మచే ఓడి పోయిన పల్లవరాజు, ఆంధ్రదేశమునుకూడా పాలించిన మొదటి మహేంద్రవర్మ పితామహుడు. సింహవిష్ణువు తండ్రి మరియు రెండవ కుమార విష్ణువుయొక్క పుత్రుడునైన ఐదవ సింహవర్మయే.

8. విక్రమేన్ద్రభట్టారకవర్మ శాసనమున కాఙ్క్షప్తి సత్రపులలో ప్రముఖుడైన మూలరాజు.

ఈ శాసనమున 'యేనోద్ధృతా భత్తృ కులస్య లక్ష్మీ రథఙ్బుతన్త్రి నయవిక్రమాభ్యాం అజ్ఞాపనాఖ్యాత కులప్రసూతః శ్రీమూలరాజః సత్రపేషు ముఖ్యః' అని యుండుటవలన -- సత్రపులలో ప్రముఖుడైన శ్రీ మూలరాజు విక్రమేంద్ర భట్టారకునకు యుద్ధము లందు సహాయపడి ఎనలేని సహాయము చేసియుండును. ఇతని వంశీయులు పైతము విష్ణుకుండిన వంశీయుల కీర్తి ప్రతిష్ఠలను నిలబెట్టి సామ్రాజ్య నిర్మాణ మునకు దోహదము చేసియుందురు.

విష్ణుకుండినులకు సంబంధించిన పై విష యములను ఇంతకు పూర్వము ప్రకటింపబడిన శాస నముల నాధారముగా తెలిపినాను. విష్ణుకుండినుల కాలనిర్ణయమునకు సంబంధించినంతవర కీ వ్యాసము కొంతైనను తోడ్పడునని భావించుచున్నాను.



# ప ర్యా పి

## శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తి

ఓ ప్రభూ ! నీ వెచట నుంటివో
ఊహ కందిన చాలు నించుక
రసవదాశాలతలు నాలో
కిసలయించును పిసాళించును

చాలు నీ విట కడుగు సాచిన
గాలివార్త రవంత చాలును
నా మనోనందనవనమ్మున
నవ వసంతము కిలారించును

తొలకరించిన చాలు నొక స్మిత
కళిక నీ రుచిరాననమ్మున
నిండుపున్నమి పండువెన్నెల
నిండి గుండెలు పులకరించును

స్వామి ! నీ పదధూళి లేశము
పడిన చాలును నా శిరమ్మున
కప్పురమ్ములు కుప్పలై పడి
గుప్పుమను నా జీవితమ్మున

నా యెడద నీ భక్తితో నిం
డార నేర్చిన చాలు దేవా !
నాదు నిశ్వాసము జగత్ప్రా
ణము సదాగతియై రహించును

ఎట్టులో ఒక్కింత నీ మృదు
హృది గదల్చిన చాలు స్వామీ !
నాదు హీనవిదీనగానము
నవ్యతర సామగానమ్మగు

లీలగా దర్శింప జాలిన
చాలు నీ దివ్యస్వరూపము
చూఱలిచ్చును నా కనులు తే
జో విశేషము నర్కవిధులకు

నీ పదమ్ముల బట్టి విడువక
నిలువగలిగిన చాలు తండ్రీ !
నా కరమ్ములు కాల్వలై చె
న్నారు నీ కృప భువి స్రవింపగ

# మోతీ

## శ్రీమతి ఐ. వి. ఎస్. అచ్యుతవల్లి

నాకిప్పటికింకా బాగా జ్ఞాపకం వుంది. పది పన్నెండేళ్ల క్రితం సంగతయినా! ఇప్పటికి కూడా 'మోతీ' చిన్నప్పటి ముఖం, ముద్దులు మూట గట్టేట్టుండే, ఆ పసితనపు పాలనురుగులాంటి మృదుత్వంతో అమాయకత్వం తొణికిసలాడే, ఆ 'మోతీ' ముఖం కళ్లకి కట్టినట్లు కన్పించుతోంది! అసలు 'మోతీ' అనే పేరు నా కెందుకనో, చిన్నప్పట్నించీ అమిత ఇష్టంగా వుండేది. 'మోతీ' అంటే మంచిముత్యం! మంచిముత్యాలంటే నాకు, వజ్రాల కన్నా ఎక్కువ ఇష్టం! నా దుద్దులు, ముక్కుపుడకలు, మెళ్లో ఒంటిపరస హారం, అన్నీ మంచి ముత్యాలవే! పెళ్లిఅయినాక మా అత్తవారు ముత్యపు దుద్దులు, ముక్కుపుడకలు తీయించి, వజ్రాలవి పెట్టారు! ముత్యాన్ని హిందీలో 'మోతీ' అంటారు! ముత్యం, ముత్యాలమ్మ, ముత్తమ్మ - ఇల్లా పేరు పెట్టి పిలుచుకోటంకంటే, సున్నితంగా 'మోతీ' అని పిలుస్తుంటే ఎక్కువ శ్రావ్యంగా వినపడుతుంది. అంచేత నాకు మోతీ అనే పేరే 'ముత్యం' అనే దాని కన్న ఎక్కువ నాజూకుగా వినపడుతుంది. చిన్నప్పుడు నా గదిలో ఒక పిల్లికి మూడు పిల్లలు పుట్టాయి. రెండు పిల్లిపిల్లలకి నల్లనల్లని మచ్చలున్నాయి. మూడో పిల్లిపిల్ల మచ్చలు లేకుండా, తెల్లగా దూదిపింజల్లే వుంది. ముందస్తుగా దానికి 'మోతీ' అనే పేరుపెట్టాను. దానిచేత వెండిప్లేటులో చిక్కని గేదెపాలు తెచ్చి నాకించేదాన్ని. కొంచెం పెద్దయినాక, మెళ్లో సన్ననిబంగారు ఛాయగల పూసలు కట్టేను. అది ఎక్కడెక్కడికి తిరిగినా, రాత్రుళ్లు నా కాళ్ల వద్దకువచ్చి పడుకునేది. తెల్లవారి లేచేప్పుడు, కాళ్లు తీసుకోబోయేసరికి మ్యావ్‌మంటూ 'గుడ్ మార్నింగ్' చెప్పేది. లేవగానే పిల్లి ముఖం చూడకూడదని, మా అమ్మ కేకలేసేది. కాని మా 'మోతీ' ముఖం చూస్తే నాకేమీ అయ్యేదికాదు. 'మోతీ' పిల్లల్ని పెట్టకపోయినట్లయితే మా ఇంట్లోనే వుండేది. కాని కొన్నాళ్లయ్యేసరికి, అది పెద్దదయి, పిల్లల్ని పెట్టింది. వాటిని తీసుకుని ఎటో వెళ్లిపోయింది. నన్ను, నా ఆదరణనీ, ఆ పిల్లలకోసం వదులుకుని, వాట్ని రక్షించుకొని పెంచుకుందుకు, మా ఇంటినించి వెళ్లిపోయింది. అది వెళ్లిపోయిన వారం పదిరోజులుదాకా, నా కాళ్లదగ్గర రగ్గుక్రింద పడుకుని 'గుర్‌ర్' మంటోన్నట్లే నా కనిపించేది. కొన్నాళ్లుపోయేక, మా తమ్ముడు, చిన్నబొచ్చుకుక్కపిల్లని పట్టుకొచ్చేడు. తెల్లగా బొద్దుగావున్న ఆ కుక్కపిల్లకూడా చాలా ముద్దుగానే వుంది. దానికి 'మోతీ' అనే పేరు పెట్టమన్నాను నేను. 'ఛీ ఛీ! వెధవ పిల్లిపేరు నా కుక్కకి పెట్టటానికి వీల్లేదు' అన్నాడు వాడు. కాస్సేపు రాజా అనీ, మరో కాస్సేపు జిమ్మీ అనీ పిలిచేవాడు. నాకు ఆ కుక్కపిల్లన్నా సరదాగానే వుండేది. కాని నేను చెప్పినపేరు పెట్టలేదనే కోపంతో అటొచ్చి ఇటొచ్చి, కాళ్లతో తన్నుకుంటూ పోయేదాన్ని! అది మహ రాక్షసి! కొంచెం కాలు తగిలీ తగలకుండానే, కుంయి కుంయిమంటూ ఒక గంటదాకా అరుస్తూ ఇల్లంతా గీరుగారు మనిపించేసేది. దానితో మా తమ్ముడు, 'దానిపిల్లి ఎక్కడికో పోయిందని, నా కుక్కపిల్లని చంపేస్తోంది అక్కా!' అంటూ గోలచేసేవాడు. ఇంకొంచెం పెద్దయినాక, మా యింటి ప్రక్కన అద్దెకు దిగిన అరవవాళ్లింట్లో, రెండు తెల్లని కుందేళ్లు వుండేవి! వాటిపేర్లు, మోతీ, జోతీ! వాటిని వదలి నేను ఒక్కక్షణంకూడా వుండేదాన్ని కాదు! కాని అకస్మాత్తుగా ఆ కుందేళ్లని, ఎవరిదో కుక్కవచ్చి చంపిపోయింది. పాపం వాళ్ల పిల్లలుకూడా చాలా బెంగపెట్టుకున్నారు. నాకూ బెంగవేసింది! నేను పెరిగి పెద్దయ్యాక గృహిణిగాకూడా మారేక,

'మోతీ మోతీ' అనే సన్నటి పిలుపు మృదుమధురమైన సంగీతంలా విన్పించింది!

అది భాద్రపదమాసం! వర్షాలు జోరుగా కురిసి వెలిసిపోయే కాలం! కొత్తలో నాలుగు(పక్కలనించీ నీలి నీరదమేఘాలు ఆపసోపాలుపడుతూ ఆకాశాన్నంతా అలుముకునేవి! అంతలో చిటుకు, చిటుకుమంటూ సన్నసన్నటి జల్లులుగా మొదలయిన వర్షం, క్షణంలో కుంభవృష్టిగా కురిసిపోయేది! కురిసీ కురిసీ విసుగెత్తిపోయిన మేఘాలు, తమ మనస్సుల్లోని బరువునంతా కన్నీటితో క్షాళితం చేసుకున్న వ్యక్తుల్లా, తేలికగా, తెల్లబోయి, సూర్యకాంతి వెచ్చదనానికి కరిగిపోతూ చిన్నచిన్న దూదిపింజల్లా గాభరాగా అటూ ఇటూ ఆకాశాన్నిండా పరుగులెత్తుకునేవి! అంతక్రితంరోజు రాత్రి సినిమాచూసి రావటంనించి, ఉదయం ఏడుగంటలయినా, నేను ప్రక్కమీంచి లేవకుండా, అల్లానే దొర్లుతున్నాను. ఇంతలో 'మోతీ, మోతీ' అనే పిలుపు క్రింది వాటాలోంచి విన్పించింది! ఆ పిలుపు నా చెవిని సోకగానే, నా నిద్ర బద్ధకం అంతా ఒక్కక్షణంలో ఎగిరిపోయింది!

మేము వుండేది మేడమీద చివరిభాగంలో! మేడమీద మేముకాక, మా ఇంటియజమాన్లు కూడా వుంటున్నారు. మేడక్రింద వరసగా నాలుగయిదు వాటాలు వున్నాయి! నాలుగయిదు కుటుంబాలవారు అందులో వుంటున్నారు. సాధారణంగా అవి ఎప్పుడూ ఖాళీగా వుండవు! ఒక సంసారం ఖాళీచేస్తారని తెలియగానే ఇంకో కుటుంబంవచ్చి దిగిపోతూవుంటారు! అసలు ఖాళీచేయకుండానే ఎడ్వాన్సులు పుచ్చేసుకుంటూ ఆ ఇంటి వాటాలను, వాగ్దత్తం చేస్తూవుంటారు మా ఇంటివారు! మేము ఆ మేడలోకివచ్చి రెండేళ్లు దాటుతోంది! మేము అక్కడ వుంటూండగానే, ఆ క్రింది వాటాలలో అయిదారు కుటుంబాలు మారటం జరిగింది! ఆ మేడకి మేమే పాతకాపుల మయ్యాము అన్నమాట! 'మోతీ' అనే పేరు వినగానే, 'మళ్లీ' ఏదో కొత్తసంసారం, క్రింది వాటాలోనికి వచ్చివుంటుందని వూహించాము. లేచి మంచం నడుంగా కూర్చొనే కిటికీలోంచి క్రిందకు చూశాను. మేము వుండే మేడకి పెద్దకాంపౌండూ, గేటూ వున్నాయి. ఒకమూలగా రెండు కుళాయి లున్నాయి! కాంపౌండులంతా నాలుగయిదు బాదంచెట్లూ, నాలుగయిదు రాచవుసిరిచెట్లూ, రెండు పొన్నచెట్లూ వుండి నీడగా వుంటుంది. బాదంచెట్లు మానిండా ఎర్రని పెద్దచీమలు ఏకాలమూ పాకుతూ వుంటాయి! వానవచ్చి వెలిసినాక పొన్నపూలు అన్నీ తడిసి రెక్కలూడిపోయి క్రిందికి రాలిపోతాయి!

రాచ వుసిరి చెట్లమీద చేరిన కాకులూ, పిచ్చికలూ, ఒకటే రణగొణ ధ్వనిచేస్తూ, వసిరికాయలన్నీతెంపి క్రిందపోస్తూ వుంటాయి పెరడు అంతా ఎండిపోయి రాలిపోయిన బాదం, పొన్న ఆకులతో నిండిపోయి, గత్తరగా వుంటుంది. సాయంకాలాలు క్రింది వాటాల్లోని పిల్లలూ, వాళ్ల స్నేహితులయిన ఇరుగు పొరుగు ఇళ్లల్లోని పిల్లలూచేరి గోలగోలగా అరుస్తూ, ఆటలు ఆడుకుంటూ వుంటారు. అప్పుడప్పుడు, క్రింది వాటాల్లోని ఇల్లాళ్ళు, ఆ చెత్త ఆకుల్ని వూడ్చి కుప్ప పెట్టి అంటించి, దానిమీద ఒక కుండెడు నీళ్లు కాచుకొంటూ వుంటారు. గాలి వేసినప్పుడు ఆ బూడిదంతా ఎగిరి పెరడంతా పరుచుకుంటూ వుంటుంది. క్రితంరాత్రి చివరి ఝామునలో వర్షం కురిసినట్లుంది. ఆకాశం అంతా, స్వచ్ఛస్ఫటికంలా, నీలంగా నిగనిగలాడుతోంది! చెట్ల ఆకులన్నీ ముదురాకు పచ్చగా, చేయి తిరిగిన చిత్రకారుడు రచించిన ఓడియారని, వర్ణ ప్రకృతి చిత్రంలోలా పచ్చిగా కళ్లకి చల్లగా కన్పించుతోన్నాయి!

ఆ సుప్రభాత సమయాన్ని ఆ పెరట్లో ఒక మూలగా, కుళాయివద్ద ఇత్తడిబాల్చీతో నీళ్లుపట్టుకుంటోన్న—పది ఏళ్లపైగా వుండవచ్చు అనుకునే పిల్లమీద నా దృష్టి పడింది! ఆ పిల్ల గోధుమరంగుగా వున్న చిన్నలాగూ వేసుకుంది. అంతకన్న వేరేబట్ట ఆ పిల్లవంటిమీద లేదు. ఆ లాగూకూడా నీళ్లు జేరవేయటంనించి, తడిసిపోయి, పిక్కలకి అంటుకుపోయింది. పిల్ల చక్కగా గుండులాగుంది. చామనచాయలో గుండ్రటిముఖం! పెద్దపెద్ద కళ్ళు. తీరైన ముక్కు. బుల్లిమందార మొగ్గలాంటి నోరు. ముద్దుగా వుంది! గుండ్రంగా బలంగావున్న తొడలకి అంటిపెట్టుకునున్న ఆ లాగూ ఆ పిల్లకి నడుందాకా రాలేదు! బొడ్డుక్రిందకి మాత్రమే సరిపోయింది! ఆ పిల్ల బాల్చీ వింపుకుని, రెండు చేతులతో ఎత్తిదింపుతూ,

ఎత్తలేక దింపుతూ దింపుతూనే ఎల్లాగో చివరి వాటా లోనికి నీళ్లు జేరవేస్తోంది. అరగంట గడిచేసరికి ఆ పిల్లపేరే మోతీ అని నిర్ధారణ అయిపోయింది! నాకు ఆ పిల్లని చూస్తుంటే పారిపోయిన తెల్లపిల్లీ, తెల్లకుక్క జిమ్మీ, తెల్లని కుందేలు పిల్లలూ జ్ఞాపకానికి వచ్చాయి! చక్కగా ఆరోగ్యంగావున్న పిల్ల! అందమైన పేరు!

మోతీ నీళ్లు పట్టుకుంటూ వుండగా ఇంకా ముగ్గురు నలుగురు పిల్లలు, అంతకు మునుపు నేను చూడని పిల్లలు, మోతీవద్దకుచేరి కబుర్లు చెబుతున్నారు. మోతీ కళ్లు పెద్దగా గుండ్రంగా వుండి, చూసే వాళ్లకి జాలి చూపులు చూస్తున్నట్లు కనిపించేవి! మధ్యాహ్నం భోజనాలయినాక, నేను క్రిందికి వెళ్లి 'మోతీ'ని పలుకరించాను. మోతీ వాళ్లింట్లో నేను వెళ్లేసరికి పరిచయం చేసుకోదగ్గంత పెద్ద సభ్యులెవరూ లేరు! మోతీతో నలుగురు పిల్లలు మటుకు వున్నారు!

నలుగురు పిల్లలూ ఎనిమిదినించీ, మూడు ఏళ్ల వయసులో వున్నారు. మోతీ వాళ్లకి పెద్దదిక్కన్నమాట! ఆ పిల్లల తల్లి ఇందిరమ్మ, తండ్రి రాజారావూకూడా ఏవో ఆఫీసుల్లో ఉద్యోగాలు చేస్తున్నారట! ఇందిరమ్మకి 'మోతీ' ఎక్కడ్నో దూరపు వరస మేనకోడలు అవుతుందిట! మోతీ తండ్రి ఏదో ఆఫీసులో ప్యూన్‌గా వున్నాడట! ఎనమండుగురు పిల్లలున్న కుటుంబంలో 'మోతీ' ఆరో ఆడపిల్ల! కడం వాళ్లిద్దరే, మోతీ తల్లిదండ్రులకి మగపిల్లలు! 'మోతీ' చాలా కలుపుగోలుతనంగా వుండేది. ఇందిరమ్మ పిల్లలచేత శుభ్రంగా సబ్బుపెట్టి వళ్లు తోమి స్నానాలు చేయించేది. ఏ పూట కాపూట ఆ పిల్లల బట్టలన్నీ ఉతికి ఆరవేసేది! పిల్లల పోషణంతా మోతీయే చేసేది! ఇంట్లో అంట్లగిన్నెలు తోమటం, నీళ్లు జేరవెయ్యటం, కూరా నారా తరిగి ఇవ్వటం, భోజనాలయ్యాక ఎంగిలి పళ్లేలూ, గిన్నెలూ కడగటం—ఒక పనేమిటి? ఇల్లు సర్వమూ ఆ పిల్లే చక్కబెట్టేది! ఇందిరమ్మ సన్నగా పొడుగ్గా, రివటలాగుండేది! నూట యాభయి రూపాయిలు దాకావచ్చే వుద్యోగం ఏదో చేసేది! రాజారావుకికూడా రెండు వందలదాకా వచ్చేది! ఏవేవో కాంపులుండే వుద్యోగం చేసేవాడు! మనిషి పొడుగ్గా దృఢంగా పచ్చగా వుండేవాడు. ఆతని ముందు ఇందిరమ్మ ముక్కుతూ మూలుగుతూన్నట్లు, తోసిపడిపోయేట్లు వుండేది! అసలే చామనచాయరంగు ఇందిరమ్మది! ఆ పయిన సన్నటి నాజూకు వళ్లు! దృఢమైన రాజారావుముందు ఇందిరమ్మ తీసికట్టుగా వుండేది! పిల్లలూ నలుగురూ సామాన్యంగా వుండేవాళ్లు. అంత జనముద్దయిన పిల్లలు కారు! ఆ కుటుంబానికంతటికీ, మంచి బట్టలు ధరించలేకపోయినా కడిగిన ముత్యంలా, 'మోతీ'యే ఆకర్షణీయంగా కనిపించేది!

మోతీకి నా వద్ద బాగా చనువయిపోయింది. ఇందిరమ్మకూడా అప్పుడప్పుడు మేడమీదకువచ్చి నాతో నాలుగు కబుర్లుచెప్పిపోతూ వుండేది! ఇందిరమ్మకి అస్తమానూ 'మోతీ' గురించి పొగడటంతోనే సరిపోయేది!

'ఏదో చిన్న పిల్లది అయినా ఇల్లంతా సర్దుకుని వస్తున్నది వదినగారూ! అది వున్నది కనుక, నేను, నలుగురు పిల్లలున్నా, బయటికిపోయి వుద్యోగం చేసుకురావటానికి వీలవుతున్నది! అన్నిపనులూ నా చేతిలోవి అందుకుని చేసుకుపోతుంది!' అనేది.

ఇంకోసారి 'మోతీ పెళ్లి బాధ్యత మాదే వదినగారూ! ఇంతలా ఇల్లు దిద్దుకునే ఆడపిల్ల ఎవరున్నారు? ఈడేరగానే, రెండు మూడు వేలు ఖర్చుపెట్టి అయినా, నాలుగు డబ్బులు వెనక వేసుకున్న వాడికిచ్చి కట్టబెడతాం!' అనేది. 'మోతీ' మీద ఇందిరమ్మకి అపాయకరమైన వాత్సల్యమూ, నమ్మకమూ వుండేవి!

ఇందిరమ్మ ఇల్లా అస్తమానూ మోతీని పొగుడుకుంటూ కబుర్లు చెప్పేనా? మోతీమటుకు ఇందిరమ్మమీద ఏ మాత్రం మంచి కబుర్లు చెప్పేది కాదు! మోతీకి వున్నవి పదకొండేళ్లయినా పాతికేళ్లు పైబడిన పడుచు కబుర్లలా ముదిపాపసానిలా మాట్లాడేది!

'మా అమ్మతో నాకు పై చదువులు చెప్పిస్తానని చెప్పి తీసుకొచ్చింది! తీరా ఇక్కడకు వచ్చేక, వున్న పనిమనిషిని మానిపించేసి ఆ దాసీ పనులన్నీ నాకంట గట్టింది! తీరా వచ్చేక పనులు చేయలేనని, మొరా

యించుకు కూర్చుంటే బాగుంటుందా చెప్పండి!' అంది.

'నువ్వెంతవరకు చదువుకున్నావు?' అడిగాను.

'మా వూళ్ళో వీధిబడిలో అయిదో క్లాసు వరకూ చదువుకున్నాను. తనకి సాయితాగా ఒక పిల్ల కావాలనీ, నాకు ఎంతవరకు చదువుకోవాలనీ వుంటే అంతవరకూ తను చదువు చెప్పిస్తాననీ, మా అమ్మతో చెప్పింది! ఇక్కడికివచ్చి ఏడాదిపైన అయిందా? నా చదువు వూసే ఎత్తటం లేదు మా అత్త!' అంది మోతీ.

మోతీ జుట్టు వొత్తుగా ఎర్రగా వుండేది భుజాలమీదికి పడేట్లు కత్తిరించి వుండేది!

'ఎదగనిస్తే పొడుగాటి జడ అవుతుంది నీకు. అదేం అల్లా పొట్టిగా కత్తిరిం చేసుకుంటావు?' అన్నాను ఒకసారి.

'మా అత్త తలకు రాసుకుందుకు నూనె వారాని కోసారన్నా ఈయదు! జుట్టు పొడుగు పెరుగుతే నూనె ఎక్కువ పీలుస్తుందని జుట్టు పొట్టిగా కత్తిరించేసుకోమంటుంది! నేను కత్తిరించుకోక పోతే తనే కత్తిరించేస్తుంది! నాకు పెద్దజెడ వేసుకోవటం సరదా! మా అక్కలకయితే మోకాళ్ళ దాటేవరకూ పెద్దపెద్ద జడలున్నాయి!' అంది పాపం.

చిన్నపిల్లని చదువు చెప్పిస్తానని ఆశలుపెట్టి తీసుకువచ్చి, ఇంటి పనుల్లో రాచిరంపాన్న పెట్టటం నాకు అశాంతి కలిగించింది! విరియని గులాబీ మొగ్గలాంటి మోతీకి, అంట్లుతోమటం, బట్టలుతకటం లాంటి బండపనులు చెప్పగలిగిన దాక్షిణ్యం పీలగా రోగిష్టిలావుండే ఇందిరమ్మకి, నలుగురు పిల్లల్ని కన్న పిల్లల తల్లి ఇందిరమ్మకి ఎల్లా కలిగిందో నా కాశ్చర్యం కలిగించింది! మోతీ జాలి గొలిపే చక్రాల్లాంటి కళ్ళమాపులు, ఎప్పుడూ తడి ఆరకుండా అప్పుడే విచ్చుకున్న పారిజాతపు పూవులాంటి మృదువైన మోతీ లేత శరీరం, నా గుండెల్లో బలంగా చెరగని ముద్రవేసుకుని అహోరాత్రాలు నన్ను వెంటాడేవి! నాది ప్రయోజనంలేని సాను భూతి కాకూడదు! నా అంతట నేను మోతీకోసం, నా కిష్టమైన పేరుగల మో కోసం ఏదన్నా హాయం చేయగలగాలి అన్న పట్టుదల నా నరనరాల జ్వలించి పోయింది!

'ఇందిరమ్మ మన మనుకున్నంత మంచి మనిషి కాదు!' ఒకనాడు ఆయన భోజనం చేస్తుండగా నాందీ ప్రస్తావనగా అన్నాను.

'ఏం! వుద్యోగం చేస్తోందనా?' అన్నారు.

నాలాంటి, ఇంట్లో కూర్చునే ఇల్లాళ్లకి (ఆయన దృష్టిలో కూపస్థమండూకాలు) బయటకు వెళ్ళి నాలుగు డబ్బులు సంపాదించుకోగలిగిన చదువుకున్న ఇల్లాళ్లంటే జెలసీ వుట్టుతుందని, మా ఆయన అభిప్రాయం! (చాలామంది మగమహారాజుల కదే అభిప్రాయం కలగొచ్చును)

'ఛ! ఛ! అది కాదు. పాపం, మోతీని చూడండి! చదువు చెప్పిస్తానని తీసుకొచ్చిందిట! ఆ వంకతో ఆ పిల్లని తీసుకొచ్చి ఇక్కడ ఆమెగారు నేర్పిస్తోన్న విద్య ఏమిటో చూశారా? అంట్లు తోమటం, పిల్లల్ని కనిపెట్టుకుని వుండటం! చూడండి! ఎంత అన్యాయమో!' అన్నాను.

'అన్యాయ మేమిటి సింగినాదం! అదీ ఒక చదువే! హోంసైన్సు అన్నమాట! రేప్పొద్దున్న ఆ పిల్ల పెద్దదయితే పనిమనుషుల్ని భరాయించాల్సిన అవసరం లేకుండా ఇల్లంతా దిద్దుకోగలదు! ఇంటి విషయాలకి పనికిరాని చదువు లెందుకు? డిగ్రీ లెందుకు? స్క్వేర్‌వాచీలు, రెండు జడలూ, నైలాన్ చీరలూ కట్టుకుని తిరగటానికా! ఈ విషయంలో ఇందిరమ్మ గారిని అభినందిస్తున్నాను!' అన్నారు. నాకు చిరాకెత్తుకొచ్చిన మాట నిజం!

'తలకు రాసుకుందుకు నూనె కూడా ఈయదట! నూనె ఎక్కువ అవుతుందని, జుట్టు కత్తిరించేసుకోమంటుందిట! పాపం మోతీకి చదువుకోవాలని ఆశ! కాని ఆ పిల్లకి ఇంటిచాకిరే సరిపోయే! ఇంక చదువుకుందుకు తీరికెక్కడుంటుంది?' అన్నాను జాలిగా.

'భేష్! పొదుపుచేయటం ఇందిరమ్మ దగ్గరే నేర్చుకోవాలి! ఏ తలనూనె సీసా ఖరీదు చూసినా ఆరూ, ఏడూ రూపాయిలు పెడితేకాని రావటం లేదు! బాబ్డ్‌హెయిర్ అయితే, ఈ నూనె ఖర్చు తగ్గుతుంది! అప్‌టుడేటుగానూ వుంటుంది! ఏమి

ఐడియా! ఆమె తెలివితేటలకి అర్థిక మంత్రిణి అవ్వొచ్చును. కాని జాతకం కలిసిరావటం లేదు కాబోలు! నువ్వూ వున్నావు! వున్నజుట్టు చాలక, తెగబారెడు సవరానికి కూడా పూస్తూ వుంటావు నూనెని! నీ తలకి నూనె రాస్తే జుట్టు పెరుగు తుంది అనుకోవచ్చును! సవరానికికూడా నూనె పూస్తూవుంటావు దేనికి? ఆ జుట్టుకూడా పెరుగు తుందా! ఆహా! నాకు తెలీక అడుగుతున్నా!' ఆయన తీరు ఇది! ఆ వేళాకోళానికి నాకు ఏడుపు వచ్చినంతపని అయ్యింది. కాని కార్యార్థినైవున్నాను కనుక కళ్లమ్మట గిర్రుమని తిరగబోయే కన్నీరుని కళ్లల్లోనే ఇంకించుకొందుకు ప్రయాసపడి సాధిం చాను. ఒక్కక్షణం వూరుకుని మళ్లీ అన్నాను:

'పాపం! మోతీని చూస్తే జాలివేస్తూంది! హాయిగా ఆడుతూ పాడుతూ పెరగాల్సిన పిల్లకదా! ఆ వయస్సులోనే తన పొట్ట తాను పోషించుకుందుకు కష్టపడి పనిచేయాల్సివస్తోంది. నలుగురు పిల్లల్ని సరిదిద్దుకుంటూ, ఆ పిల్ల ఇంకేం చదువుకుంటుంది? అంచేత పోనీ మనింట్లో వుంచుకుందామనివుంది! మనింట్లో అయితే ఇద్దరమే కాబట్టి పని తక్కు వగా వుంటుంది! తీరికవేళల్లో చదువు నేనైనా చెబ్తాను. కొంచెం స్టాండర్డు పెరిగాక, ప్రయివేటుగా ఏ థర్డ్‌స్టాండర్డ్ పరీక్షకో కట్టించవచ్చును! అల్లా దాని భవిష్యత్తుకి ఒక బాట ఏర్పాటుచేయవచ్చును! ఏమంటారు?' బితుకు బితుకుమంటూ నా మనసు లోని మాట చెప్పాను. ఆయన ఫక్కుమని నవ్వారు.

'పిచ్చిదానా! నువ్వు వకర్తివీ ఎంతమందిని ఉద్ధరించగలవు? అంత దయగా తీసుకువచ్చి, తన పిల్లలతో సమానంగా పెంచుకొంటూన్న ఇందిరమ్మ మీదే అది చాడీలు చెప్పుకొచ్చింది! ఇప్పట్నించీకూడా ఆ పిల్లకి తన్నిచూచి అందరూ జాలిపడాలి అనే మనస్తత్వం బాగా పేరుకొంది! నీవయినా, నీ ఇంటి పనులు చేయించుకుని, ఇంత తిండి పడేయగలవుకాని, నీ ఐశ్వర్యానికి దత్తత చేసుకుంటావా? ఇందిరమ్మ మీద చాడీలు చెప్పినది, నీమీదమటుకు చెప్పదని రుజావు ఏమిటి! ఆ పిల్లకి యజమాని సానంలో వుండి నీవు చేయగల ఉపకారంకంటె, ఇల్లా పరోప కారంగా, సానుభూతిగా చేయగల ఉపకార మేదైనా వుంటే చేయి! యజమానిస్థానం నువ్వు తీసుకున్న మర్నాడు, ఆ పిల్ల మనసులో నీ పట్లవున్న కృత జ్ఞత మాసిపోతుంది! ఆ పిల్ల కళ్లకి నీవు మరొక ఇందిరమ్మలా కనిపించుతావు. అంతే!' అన్నారు. మోతీని మా ఇంట్లో వుంచుకోవటం ఆయనకి ఇష్టం లేదని తేలింది.

'రోజూ మధ్యాన్నంపూట వస్తూండు మోతీ! ఎక్కాలూ హిందీ నేర్చుకుందుకాని!' అన్నాను. అప్ప ట్నించీ మోతీ రోజూ మధ్యాన్నం మా ఇంటికి వచ్చేది. మొదట్లో ఒకటి రెండు రోజులపాటు, నాలుగోఎక్కం, హిందీలో క గుణింతం శ్రద్ధగా చదివి దిద్దుకునేది. రానురానూ తనకి అవి రావటంలేదని, ఇంట్లో పని తీరటంలేదనీ, చదువుకోవటం ఎగ గొట్టేది! మా ఇంట్లో ఏవన్నా ఫలహారాలు చేసు కుంటే పెట్టేదాన్ని! మేడ దిగకుండానే తినేసేది! నలుగురు చిన్నపిల్లలున్నారుకదా—వాళ్లకి కాస్తన్నా పెట్టేదికాదు!

'వాళ్లూ పసివాళ్లుకదా! వాళ్లని కూడా పిల్చిపెట్టు!' అనేదాన్ని.

'వాళ్లకేం మాయరోగమా! పీకనిండా అన్నం తిన్నారా? వాళ్లమ్మ వాళ్ల ఫలహారాలకోసమని అర్ధ రూపాయి ఇచ్చివెళ్తుంది రోజూనూ! నేను కావి పెడుతున్నాగా!' అనేది. నా అంతట నేను ఏదో ఒకటి చేసిపెడుతూనే వుండేదాన్ని! అదికాక రోజూ ఏదో వకటి అప్పులు పట్టుకెళ్తూ వుండేది. ఒక సావు మైదా అనీ, ఇంకో సావు శనగపిండి అనీ, ఒక గిన్నెడు డాల్డాఅనీ, ఇల్లా రోజూ ఏదో ఒకటి ఇందిరమ్మ ఇమ్మన్నదని అడిగి పట్టుకువెళ్తూవుండేది! కొన్నికొన్ని సామాన్లు తిరిగి ఇచ్చేది. కొన్నిసామాన్లు తిరిగి ఇచ్చేదికాదు!

'మోతీ' వాళ్లు ఆ ఇంటికి వచ్చేక, మేము ఆ వూళ్లో ఆరునెలలు మాత్రమే వున్నాము. మా వారికి ట్రాన్స్‌ఫర్ అవటంనించి మేము ఇంకో వూరు వెళ్లిపోయాము. మేము వెళ్లిపోతూంటే 'మోతీ' దిగాలుగా నించుంది. నేను అయిదు రూపాయలు ఆ పిల్లచేతిలో పెట్టాను!

రెండేళ్లు గడిచాక మా బంధువుల ఇంట్లో

పెళ్లి అయితే, ఆ వూరు వెళ్లటం తటస్థించింది. అప్పుడు మేము వుండే ఆ మేడకి కూడా వెళ్లేను. మా ఇంటావిడ నన్ను చాలా మర్యాద చేసింది. ఆమెని 'మోతీ' గురించి అడిగాను. ఇందిరమ్మ వుద్యోగం మానేసిందట! రాజారావుకి మంచి ప్రమోషన్ వచ్చిందిట! రెండునెలలు క్రితమే ఇంకో వూరు ట్రాన్స్ఫర్ అయి వెళ్లారుట! ఇంటావిడ చెప్పారు.

'మోతీ బాగా వుందా? బాగా ఎదిగివుంటుం దనుకుంటాను' అన్నాను.

'బాగా పాడుగెదిగింది! వోణీలు వేసుకుంటోంది! ఆ ఇందిరమ్మ ఎంత బాగా పెట్టినా, అదేం ఖర్మమోకాని, ఆ పిల్ల ఇరుగిళ్లకి పొరుగిళ్లకి వెళ్లి అవి లేవు, ఇవి లేవు అని అడిగితెచ్చుకోవటం మానేది కాదు! ఆ ఇందిరమ్మ ఎంతో దేవులాడేది పాపం!' అంది ఇంటావిడ!

'ఎదిగే పిల్లకదా! సహజంగా ఆరోగ్యవంత మయిన పిల్ల! ఆకలికి ఆగలేక అడిగివుంటుంది!' అన్నాను. ఏది పెట్టినా అవురావురుమంటూ తినేసే జాలికళ్ల మోతీ నా గుండెల్లోంచి ఒక్కసారి తొంగి చూసింది!

'ఇందిరమ్మ అంత కక్కూర్తి మనిషి కాదు ష్మండి! కడుపునిండా తన పిల్లంతో సమానంగా పెట్టేది భోజనం! అయిదు గురికీ సరిపడగా మధ్యాహ్నం ఫలహారాలకి డబ్బు లిచ్చేది! ఇది ఏంచేసేదో తెలుసునా! ఆ డబ్బులన్నీ పెట్టి తను కడుపునిండా, హోటల్లోపడి మెక్కేసేది! ఒక అణావో, బేడోపెట్టి కారపుశనగలో, వేరుశనక్కాయలో కొని, ఆ పిల్లల ముఖాన్న పడేసేది! ఆ కుర్రవెధవలు అవే నములుకుంటూ కూర్చునేవారు! పిల్లల్ని సినిమాలకి తీసుక వెళ్లమని డబ్బులిస్తే ఆ డబ్బులూ అల్లానే తను తినేసేది! సినిమా వదిలే టయిమయిందాకా ఏ పార్కులోనో పిల్లల్ని పెట్టుకుని కూర్చుని సినిమాహాలు లోంచి, జనం బయటకు రాంగానే తనూ పిల్లలని తీసుకునివచ్చేది! కొంచెం జ్ఞానం తెలిసిన పెద్ద పిల్లలు, అమ్మతో చెబ్తామనిఅంటే, వాళ్లని గిల్లి రక్కి హింసించేది! దానికి భయపడి, ఆ పిల్లవెధవలు కిక్కురుమనేవారుకారు! పైకి అల్లా వుంటుంది కానీ, 'మోతీ' వుత్త నాలిముచ్చుముండ!' అన్నారు. ఆవిడ. 'మోతీ'ని అల్లా విమర్శిస్తూంటే నాకు కష్టం తోచింది! 'మోతీ' అమాయకపు పిల్ల! రోజల్లా చాకిరీ చేసేది కనుక, కాస్త ఆకలి ఎక్కువగానే వుండి వుంటుంది! దానికి ఇంత కఠినమైన మాటలు పడాలా!

'అన్ని తెలివితేటలున్న పిల్లలా కన్పించేది కాదండి మోతీ!' అన్నాను బాధగా. కుర్రపిల్ల కడుపాకలికొద్దీ ఏదో తింటే, దానిని నీచబుద్ధి క్రింద జమచేస్తారా! ఆకలి ఎరుగని అజీర్తి వ్యక్తులు?

'అమ్మమ్మ! అది రావణాసురుడనుకోండి! దాని దెంత ఆకలో! దానిది కడుపో, కాలేగ మడుగో కాని, ఒక్కరోజన్నా ఆ పిల్లవెధవలకి సరయిన ఫలహారం తెచ్చిపెట్టేదికాదుకదా! ఆ పిల్లలు సరయిన పోషణలేక 'గిరుగారు'మంటూవుంటే, ఇది తెలివిని రోజురోజుకీ అడివిపందిలా బలిసిపోయేది! ఇంక ఈ ముండ ఎదిగాక, ఆ రాజారావు ఇందిరమ్మకన్న పెందరాళే ఆఫీసునించి ఇంటికి రావటం ప్రారంభించాడు! పెద్దజెడా, ఛాతీమీద కు సగానికి తక్కువ వెడల్పుగా వోణీ వేసుకుని, మామయ్యగారూ, మామయ్యగారూ అంటూ అతగాడి కూడా తిరుగుతూంటే నాకు మాచెడ్డ సిగ్గేసేది!'

'మీ కెందుకు మధ్యన సిగ్గు?' అందామను కుని నాలికని కట్టేసుకున్నాను.

'మా రాజాగాడు ఇంట్లో వున్నాడంటే చాలు! జడ ముందుకువేసుకుంటూ చకచకా మేడమీదకు వచ్చేసేది! వెధవకళ్లు జాలిగా త్రిప్పుకుంటూ మాట్లాడుతూంటే వయసులో మగపిల్లలు వలలో పడటం ఎంతసేపు చెప్పండి! అందులో ఈ సినిమాలు చూసారా! ఎంతసేపూ ప్రేమించుకోడాలూ, తోట లమ్మటా, దొడ్లమ్మటా ఒకళ్లవెంట ఒకళ్లు పరుగులు పెట్టుకుంటూ కెవ్వుమంటూ పాటలు పాడుకోడాలూతప్ప, కాస్త నీతీ నియమాయీ చెప్పేవి ఏమన్నా వున్నాయా! ఇందిరమ్మతో కచ్చితంగా చెప్పేసేను! 'నీ వుద్యోగం వూళ్లేలా! ముందు నీ భర్త సంగతి చూసుకోవే, పిచ్చిరండకానా! నాలుగు రోజులు గడిచాయంటే నువ్వూ,

పిల్లలూ, నా బొందో అంటూ రోడ్డట్టుకు బయటకు నడవ్వాలసిందే! ఏ సంసారం అంతా 'మోతీ మహల్' అయిపోతుంది, నువ్వు కానుకోకుంటేను.' అని చెప్పేను. దానితో ఇందిరమ్మ వుద్యోగానికి రిజైన్ ఇచ్చేసింది. ఇక్కడ్నించి వెళ్లేసరికి ఇంకా మోతీ వదలలేదు వాళ్ళని. ఇప్పు డింకా వుందో వెళ్ళిపోయిందో మరి!' అన్నారు ఇంటావిడ. నేను ఎంత గింజుకున్నా నా మనోయవనికమీద, ఆకలి చూపుల పెద్దకళ్ళు, పదకొండేళ్ల 'మోతీ'యే కాని, యవ్వనాన్ని నింపుకుంటూ, కోర్కెలవెంట పరుగులు తీసే చైతన్యమూర్తియైన 'మోతీ' వచ్చి నించో లేకపోయింది!

తర్వాత నాలుగైదు సంవత్సరాలు గడిచాయి. మేము ఈ లోగా రెండు మూడు వూళ్ళు మారేము. ఒకసారి మేము ఎక్కడ్నించో వస్తోండగా, బస్సు స్టాండ్‌లో కనిపించింది మోతీ. ఎర్రటి ఫౌకబారు ముతకచీరలోవున్న మోతీని నేను గుర్తుపట్టలేదు! తను నన్ను గుర్తుపట్టి పలకరించింది. 'బాగున్నారా రాధమ్మగారూ! నేను మోతీని! మర్చిపోయేరా?' అంది. నేను గుడ్లప్పగించి నిలబడ్డాను. 'మోతీ' జుట్టు వత్తుగా, మోకాలిమడతదాటి పెరిగింది. చెవులమీదకు కప్పేట్టు జుట్టుజార్చి, వదులుగా వాల్జడ వేసుకుంది. తలనిండుగా చామంతి పూలున్నాయి. అయిదడుగుల నాలుగంగుళాల పొడుగెదిగింది! గుండ్రటి జబ్బలతో, చేతికి కంటికి నిండుగావుంది మోతీ!

'కులాసాగా వున్నావా? మీ అత్తయ్యగారూ పిల్లలూ బాగున్నారా? ఇప్పు డేవూళ్లో వుంటున్నారు?' అని అడిగాను.

'ఆఁ! అంతా బాగున్నారు. పిల్లలంతా స్కూళ్ళల్లో జేరారు. ఇందిరమ్మ ఉద్యోగం మానేసింది! రాజారావుగారికి ప్రమోషన్ వచ్చింది! ఉద్యోగం మానేసి ఇంట్లో కూర్చున్నాక, మా అత్తయ్యకి భలే అనుమానం పిచ్చిపట్టుకుంది! ఈ చిత్రం చూడండి రాధమ్మగారూ! మా అత్తయ్యకి అనుమానం ఎక్కువయి నన్ను కూర్చున్నా నించున్నా ఒకటే సాధించిపోసేది! మా మావయ్యగారికి చూడబోతే షేవింగ్‌సెట్ దగ్గర్నించి, బూట్ల పాలిష్ వేయటంనించి, బాత్‌రూంలో సోపూ, టవలూ పెట్టటంనించి, అన్నీ నేనే చేయాల్సివచ్చేది! ఒక్క క్షణం, తను ఆఫీసునించి రాగానే నేను ఎదురుగ్గా కనపడకపోతే 'మోతీ ఏది?' అంటూ అడిగేసేవారు! పోనీ ఆయనకి కావాల్సిన పనులన్నీ ఇందిరమ్మత్త చేసుకోగలదా అంటే – మూడుకాళ్ల ముసలమ్మలా కూర్చున్నచోటినించి లేవలేకుండా వుండేది! చలాకీగా నాలుగు పనులూ చిన్నప్పట్నించీ చేసివున్నదాన్నికనుక, ఆయనకి ఏమి కావాల్సివచ్చినా, నన్ను పిలిచేవారు! దానితో మా అత్తమ్మ వూహ రుంజుకుపోయేది! చివరికి ఆ అనుమానం ఎక్కువయిపోయి, నన్ను పనిలోంచి తీసేసింది! చూడండి! ఆ ఇల్లాలు చదువు చెప్పిస్తానని కొన్నాళ్ళు, మంచిసంబంధం చూసి పెళ్లి చేస్తానని కొన్నాళ్ళు బులిబుచ్చికాలమాటలు చెప్పి, నాచేత అడవాచాకిరీ అంతా పైసా ఖర్చుచేసి పై మనిషిని పెట్టుకోనవసరంలేకుండా చేయించుకుంది. చివరికి ఇంట్లోంచి పైసాఅన్నా చేతులో పెట్టకుండా వెళ్లగొట్టేసారు!'. దీనంగా అంది మోతీ!

'మరి ఇప్పుడెక్కడుంటున్నావు? మీ వాళ్లింటికి వెళ్లిపోయేవా?' అన్నాను.

మోతీ నవ్వింది! ఆమె కళ్ళు తళతళా మెరిసాయి!

'మావాళ్లింటికి వెళ్లి ఏం బావుకుంటాము? నాపయిన అయిదుగురక్కలున్నారు! వాళ్లకే ఒకదారి చూపలేక మావాళ్ళు తంటాలు పడుతోంటారు! ఇక నేనుకూడా వెళ్లి వాళ్ల నెత్తిమీద కెక్కటం ఎందుకు? ఒకపూటవుంటే ఇంకోపూట పస్తులు పడుకుంటారు వాళ్ళు! మా నాన్న ప్యూన్ వుద్యోగంలోంచి రిటరయినాడుట! వాళ్లకి కడుపులు నిండటానికి రూపాయలు మూటలు కట్టుకుని కూర్చోలేదుకదా! మా అక్కలు ఎవరిళ్లల్లోనో పనికి కుదురుకునివుంటారు! ఇక్కడ నేనేదో చదువులు చదువుకుని వుద్యోగస్థురాలి నవుతానని, వాళ్ళు వూహించుకుంటారు. నా కిక్కడకు వచ్చినందువల్ల వంటబట్టిన విద్య అంట్లు తోమటం, బట్టలుతకటం! అలవాటు అయిన సంస్కారం, ఏదో ఒక విధంగా కడుపు నింపుకోటం! ఈ నిజ జీవితం

వాళ్ళకి తెలియపరిచి, నేనన్నా సుఖపడుతున్నానన్న వాళ్ల భ్రమని ఎందుకు మట్టి చేయాలి?' అంది మోతీ !

నిజంగానే మోతీ చాలా ఎదిగిపోయిందనిపించింది నాకు ! వాస్తవిక జీవనానికి ప్రతీక మోతీ !

'అయితే మరి ఎక్కడుంటున్నావ్ !' అన్నాను.

నల్లగా పొడుగ్గావున్న మనిషి ఒకడువచ్చి, అరటిపళ్లు చామంతిపూలూ వున్న ప్లాస్టిక్ వైర్ సంచీ ఒకటి మోతీ చేతికిచ్చి

'ఇంకా బస్సువచ్చేది కావడ్డం లేదా!' అంటూ నించున్న చోటనే తుపుక్కుమని నములుతూన్న కారాకిళ్లీని వుమ్మేశాడు. దుబ్బులాంటి క్రాఫింగ్! నల్ల కళ్లద్దాలు! చారల పైజామాలోనుంచి అల్లిక బనీను కన్పబడుతోన్న పల్చని, తెల్లని వాయిల్ లాల్చీ! అతని వేషం అంతా నాకు ఆదోలా అన్పించింది.

'ఇతనితో ఈ వూరు వచ్చేసాను! సినిమా హాల్లో గేటుకీపర్‌గా చేస్తున్నాడు ! మువ్వయ్ రూపాయి లిస్తారు. నేను హోటలు ఆడింతాలో పప్పు రుబ్బటానికి కుదిరాను. రోజుకి తిన్నంతా టిఫెన్లుపెట్టి రెండు రూపాయిలు ఇస్తారు!' అంది మోతీ !

'ఎక్కడికి వెళుతున్నారు?' అన్నాను.

'అతని చెల్లి పెళ్లి రాత్రికి ! ప్రక్కవూరే ! వెళుతున్నాం' అంది !

అనుకోకుండా తర్వాత నాలుగైదు సంవత్సరాలకి ఇందిరమ్మ కన్పించింది. ఆ మాటా ఈ మాటా అడిగాక, మోతీ గురించి అడిగాను. ఇందిరమ్మ బాధగా నిట్టూర్చింది !

'చూడండి వదినగారూ ! నా డబ్బు పాపిష్టి దయిపోయింది ! కన్నపిల్లలా చూసుకున్నాను. నా పిల్లలతో సమానంగా బట్టా పాతా కొని పడేసే దాన్ని ! అయినింటిపిల్లకదా! ఏదో దానికి తగ్గ సంబంధం చూసి ముడిపెట్టిద్దామనుకున్నాను. ఏదో నాకు చేతిక్రింద సాయతాగా వుంటుందని తీసుకొచ్చి పెంచాను! బుద్ధిః కర్మానుసారిణీ! అని దాని బుద్ధులన్నీ పాడుబుద్ధులయి కూర్చున్నాయి ! చదువు చెప్పిద్దామని మేష్టర్ని పెట్టాము! రెండు నెల్లు గడిచినా, 'అ,' దిద్దలేదుట! ఇంకేం చేస్తాను ? పోనీ కుట్టుపని నేర్చుకోకూడదా అంటే, నేను ఆ మిషన్ తొక్కలేను, నా కాళ్లు నొప్పులు పెడతాయి అనేది! పోనీ, ఏదయినా తగిన సంబంధం చూసి పెళ్ళి చేద్దామని, వాకబు చేస్తూనేవున్నా ! ఇంతలో హోటల్లో సర్వరుపనిచేసే 'చిన్నారావు'ని తీసుకుని చెప్పాపెట్టకుండా ఎటో వెళ్లిపోయింది! పోనీ అతన్నే పెళ్లి చేసుకుంటానని చెప్పితే మేము కాదంటామా! సంసారం పెట్టుకుందుకు, రెండు మూడు వందలు సద్దుదుము కదా! ఏం తిప్పలు పడుతోందో! నావి నాలుగయిదు చీరలు పట్టుకుపోయింది! అవి ఎన్నాళ్లు వస్తాయి చెప్పండి! మంచితనంగా చెప్పి వెళ్లిగే, ఏడాది కేదో విధంగా ఒక వందరూపాయిల సొమ్ము ముట్ట చెప్పుదుము! దొంగలాగా పారిపోయింది! ఇంక మళ్ళీ ముఖం ఎల్లా చూపెట్టుతుంది ? దాని ఖర్మ అది!' ఇందిరమ్మ కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి! నా కాశ్చర్యం వేసింది. 'మోతీ'ని అనుమానించి వెళ్ళగొట్టిన ఇందిరమ్మలా ఆమె మాట్లాడలేదు! ఈ విశాల ప్రపంచంలో యవ్వనంలోవున్న ఆడపిల్లపడే అవమానాలన్నీ తలుచుకుని కుమిలిపోయే మాతృమూర్తిలా మాట్లాడింది ఇందిరమ్మ!

'వాళ్ల కన్నవాళ్లదగ్గరకు వెళ్లిపోయిందేమో !' అన్నాను.

'దానికి ఈ లోకంలో నా అని చెప్పుకోగలిగే బంధువుని నేనే! దాని తల్లీ తండ్రీ చిన్నప్పుడే పోయేరు ! చనిపోతూ చనిపోతూ, దాన్ని పదేళ్లవరకూ పెంచిన అమ్మమ్మ నా చేతికి అప్పచెప్పింది , నా కర్తవ్యం నేను నిర్వహించలేకపోయేను, వదినగారూ ! మాలో ఎక్కడో లోపంవుంది ! అందుకనే మోతీ ఇల్లు వదిలి బీరువులా పారిపోయింది ! మేము ఎంత ప్రేమగా చూసినా 'మోతీ' మా ప్రేమని నమ్మలేక పోయింది !' అంది ఇందిరమ్మ !

తల్లితండ్రులులేని అనాథ మోతీ అని నాకిప్పుడే తెలిసింది !

'తనకి తల్లీతండ్రీ తోబుట్టువులూ వున్నారని చెప్పేది మాతో !' అన్నాను.

'ఏమిటో ! అందరికీ తలొక మాదిరిగానూ చెప్పేది. అమాయకురాలు !' అంది ఇందిరమ్మ.

ఆ రోజు బస్టాండ్‌లో కన్పించిన సంగతి, కూడావున్న యువకుని సంగతీ చెప్పాను.

'నల్లగావున్నతను అయితే చిన్నారావు కాదు! చిన్నారావు నాయుళ్లబ్బాయి! పచ్చగా వుండేవాడు!' అంది ఇందిరమ్మ.

'మోతీ' గురించి రోజురోజుకీ క్రొత్త విషయాలు తెలుస్తున్నాయే అనుకున్నాను. చివరికి మోతీ పదేళ్ల పిల్లప్పట్నించీ కట్టుకథలు చెప్పి, నలుగురి వల్లా సానుభూతి పొందటం అద్భుతంగా నేర్చుకుందన్నమాట! చిత్రమయిన పిల్ల అనుకున్నాను!

పన్నెండేళ్లు పూర్తిఅయినతర్వాత నిన్నసాయంకాలం ఎంపోరియంలో కన్పడింది! 'మోతీ'ని మర్చిపోదామని ప్రయత్నిస్తుండగానే మళ్లీ కన్పడుతూంటుంది మోతీ! చాలా ఫాషనబుల్‌గావుంది! నైలక్స్ చీర! రెండు జడలు! చెవులకి పెద్ద రింగులు, చేతికి స్క్వేర్‌వాచీ. నన్నుమటుకు మర్చిపోలేదు పాపం! నవ్వుతూ 'బాగున్నారా!' అంది.

'వూఁ!' అన్నాను. తన జీవితం ఎల్లా గడుస్తోందో నేను అడగదల్చుకోలేదు! కనపడుతోందిగా! ఇంకా అడగటం, అన్నీ చెప్పించటం దేనికి? ముంజేతి కంకణానికి అద్దం అవసరం ఎందుకు?

నాలుగయిదు చీరలు, జాకెటుపీసులూ తీసుకుని మూడువందలు రూపాయిలదాకా బిల్లు చెల్లించింది!

'ఈ వూరికి వచ్చేరా! ఎన్నాళ్లయిందివచ్చి! మేము ఈ వూళ్లోనే వుంటున్నాము! మావారు ఇక్కడ బిజినెస్‌చేస్తూ స్థిరపడిపోయేరు! గాంధీభవన్‌కి ఎదురుగ్గావున్న సందులో వుంది మా ఇల్లు. అటుకేసి ఎప్పుడన్నావస్తే మా ఇంటికి రండి!' అంది మోతీ!

'అల్లాగే' అన్నాను! ఇంతలో 'మోతీ'కోసం వాళ్లాయన వచ్చేడు! పొడుగ్గా బలంగా వున్నాడు! తుట్టపెదవులు! గుబురుమీసాలు! గోల్డుఫ్రేమ్ కళ్లజోడు! చేతికి ఖరీదయిన వాచీ! జరీపంచె లుంగీలా కట్టుకున్నాడు! పైన టెర్లిన్ షర్టు వేసుకున్నాడు. అతన్ని చూస్తూనే—

'హల్లో పొన్నూ!' అంటూ ఈయన సంతోషంతో కావిలించుకున్నంత పనిచేశారు.

'ఇతను నా బాల్యమిత్రుడు. క్లాస్‌మేటు. పొన్నుసామి! ఈమె నా భార్య రాధమ్మ!' అంటూ ఒకరికొకర్ని పరిచయం చేశారు!

'మోతీ' ఇతన్ని ఎల్లా వల్లో వేసుకుందా అని ఆలోచిస్తూనే ఇంటికి వెళ్ళిపోయేను.

'పొన్నుసామి కిదివరకు పెళ్ళి అయ్యిందా!' అన్నాను ఆయనతో!

'నా కన్న ముందే అయ్యింది వాడికి పెళ్లి! అయిదారుగురు పిల్లలుకూడా వున్నారు! మరి 'మోతీ' ఎలా దాపరించిందో వాడికి!' అన్నారు.

'పోనీలెండి! మోతీ గురించి ఏమీ చెప్పకండి ఆయనతో!' అన్నాను.

'మోతీ' పేరు నా కిష్టం! మోతి చిన్నప్పట్నించీ, అబద్ధాల కుప్పలా పెరిగింది! ఎందువల్ల మోతీకి అబద్ధాలు అలవాటు అయ్యేయి! దానికి మనం జవాబు చెప్పుకోలేమేమో! తనకి కావల్సినవి ఇందిరమ్మ సమకూర్చలేదనే అపనమ్మకం! తన్ని తనే నిలబెట్టుకోవాలనే అజ్ఞాతమైన ఆవేదనతో కూడుకున్న ఏకాకితనం, 'మోతీ'ని అబద్ధాల జీవితాలపాలు చేసేయి! గాలికి పుట్టి ధూళికి పెరిగే 'మోతీ' లాంటి స్త్రీలు ఈనాటి నాగరిక సమాజంలో వేలకు వేలు వున్నారు! కాని నాకు ఆ స్త్రీలందరి జీవితాలూ పరిశీలించేంత తీరుబాటు లేదు! నా క్కావల్సిన స్త్రీ 'మోతీ'! ఆ పేరు నా కిష్టం! స్వచ్ఛతకి, ధవళతకి చిహ్నం 'మోతీ'! తెల్లకుందేలుపిల్లా, తెల్లకుక్కపిల్లా, తెల్లపిల్లిపిల్లా—వీటన్నిటికంటే నేను జీవితాంతం మరువలేని రూపం నా చిన్నారి మోతీది!

నాకు బాగా జ్ఞాపకం వుంది ఇప్పటికీ! చామనచాయలో గుండ్రటి ముఖం! జాలిగొలిపే పెద్ద కళ్లు! తీర్చైన ముక్కు! బుల్లినోరు! అరటిదూట లాంటి వళ్లు! ఆ మోతీకీ,

'లిప్‌స్టిక్' పెదాలూ, వయ్యారాల వంపులు ప్రదర్శించే శరీరమూ, చమక్కుగాచూసే పెద్దకళ్లూ, ఎప్పుడూ బద్ధకంగావుండే సోమరితనమూ, ఈ మోతీకీ సహస్రం తేడా వుంది!

ఆ మోతీని మర్చిపోలేను!

ఈ మోతీని మర్చిపోవటానికి ప్రయత్నిస్తాను.

ఆ మోతీని అభిమానించకుండా వుండలేను.

ఈ 'మోతీ'ని అవమానించకుండా వుండగలందులకు ప్రయత్నిస్తాను!

ఆ మోతీ ఇక కన్పించదు!

ఈ మోతీ కన్పించకుండా వుండాలన్నావుండదు తన జ్ఞాపకాలను తవ్వుకుంటూ కన్పిస్తూనేవుంటుంది!

# బుచ్చిబాబు

శ్రీ రామమోహనరాయ్

తెలుగు సారస్వతానికి బుచ్చిబాబు ఏమిచ్చాడంటే ఎన్నో కథలు, కొన్నినాటికలు, మరెన్నో వ్యాసాలూ, ఒకేఒక్క నవల, చివరగా కొంత కవిత్వమూ ఇచ్చాడని సూక్ష్మదృష్టికి తోస్తుంది. బుచ్చిబాబు నవలా రచయితా? కథకుడా? లేకపోతే వ్యాస రచయితా? కవియా? అనే ప్రశ్నలొస్తే కవి యనే వాళ్ళెక్కువగా ఉండరేమోగాని మిగిలినవన్నీ ఎవరి అభిరుచు లనుబట్టి వాళ్ళు నిర్ణయిస్తారు. చింతనకు ప్రాధాన్యమిచ్చేవాళ్ళుమాత్రం బుచ్చిబాబు జిజ్ఞాసువు, సౌందర్యోపాసకుడు, వేదనాజీవి, సౌందర్యతీక్ష్ణత భరించలేని కళాజీవి, జీవిత స్వరూపాన్ని వివిధ కోణాల్లో దర్శించి, చిత్రించి ప్రదర్శించిన తత్త్వవేత్త అని అనుకోవచ్చు. అన్నింటినీ మించి బుచ్చిబాబు నవలా రచయిత. 'తెలుగులో ఉన్న ఉత్తమ నవలల్లో 'చివరకు మిగిలేది' ఒకటి. పాత్రలన్నీ జీవంతో నిండినవే. వర్ణనలు చెయ్యటంలో అతడి కతడే సాటి; పాత్ర చిత్రణ బుచ్చిబాబు ప్రత్యేకత. జీవితాన్నిగూర్చిన చిత్రమైన, తాత్త్వికమైన, చక్కని చిన్నవిర్వచనాలు చెయ్యటంలో అతనిది అందెవేసిన చెయ్యి'అనీ పాఠకు లనుకోవచ్చు. 'చివరకు మిగిలేది'లో అమృతాన్నీ నారయ్యనూ హఠాత్తుగా ఏ పల్లెటూళ్ళోనో చూస్తామనిపిస్తుంది' అంటారు శ్రీమతి ఆచంట శారదాదేవి. ఏ నవలా రచయితకైనా యింతకు మించిన కితాబు ఏం కావాలి?

నవల జీవితాన్ని సమగ్రంగా ప్రదర్శించటానికి అనువైన మంచి సాహిత్యప్రక్రియ. జగన్నాటకాన్ని చూపించటానికిది 'Pocket Theatre' అనుకుంటే 'చివరకు మిగిలేది' నాటకీయమైన సంభాషణలకు పెట్టింది పేరు. పాత్ర లందరినీ పాఠకుడు ఎతీ గున్నట్లుగానే భావించుకుంటాడు. మరీ కొంచెం Sentimental గా ఉండే పాఠకుడైతే నవలలో చెప్పిన, సృష్టి తాలూకు ప్రతిచిన్నదృశ్యమూ సౌందర్యమయమని బుచ్చిబాబు చెప్పే మాటలకు కన్నీళ్ళు పెట్టుకొంటాడు. ఏమాత్రం entimental గా ఉన్నా బుచ్చిబాబు రచనాశక్తి పాఠకుణ్ణి దయానిధిగా మార్చి ఏకాంతంలోకి పంపిస్తుంది. చింతనతో వ్యక్తిని అంతర్ముఖుణ్ణి చేస్తుంది. గతించిపోయిన యౌవనం, జాడ్యం, బీదతనం, మృత్యువు - ఇవేవీ జీవితంలో గుండె బాదుకోవల్సిన విషాదాలు కావనీ, నిజమైన విషాదం ప్రేమించలేకపోవడమనే నగ్న సత్యాన్ని మనస్సుకు హత్తుకుపోయేటట్లు చేస్తుంది.

జీవిత సంఘటనల వైవిధ్యాన్ని ప్రదర్శించేటందుకు మహారచయిత లెందరో ఎన్నో నవలలు వ్రాశారు. ఐతే ఒకే నవలతో జీవిత స్వరూపాన్ని ఏదో కొంత (లేకపోతే చాలవరకు) అర్థం చేసుకున్నమన్న సంతృప్తిని ఏ వొక్క తెలుగు రచయితా బుచ్చిబాబుకు మల్లే చేశారని నా · కనిపించదు. అందుకే నేమో బుచ్చిబాబు ఒకే నవల వ్రాసి విరమించాడు. చెప్పవలసినదంతా ఆ వొక్క నవలలోనే చెప్పాడని నా వలెనే అనుకునే పాఠకులు చాలమంది ఉంటారని అనుకుంటాను. 'ఆయన ఎన్నో నవలలు వ్రాస్తే బాగుండును. కనీసం మరొక్క నవలైనా వ్రాస్తే బాగుండును' అని నేనెప్పుడూ అనుకోను. సృష్టిలో పరిపూర్ణ సౌందర్యాన్ని మానవుడు భరించలేడని బుచ్చిబాబు అంటాడు. 'ఖజురాహోలో స్త్రీ శిల్పపు చన్మొన ఏమైంది'? అని గాజుమేడలో ప్రశ్నించాడు.' 'చివరకు మిగిలేది' మానవ జీవితపు పరిపూర్ణ చిత్రణం కాదు. కాకపోవటమే ఆ నవల గొప్పతనం.

'చివరకు మిగిలేది'లో అనుసరించిన తత్త్వం సజీవ వాదానికి (Existentialism) సంబంధించినట్టిది. 'ఎగ్జిస్టెన్షియలిజం'కి అస్తిత్వవాదం; సత్తావాదం అనే పేర్లు వ్యవహారంలో ఉన్నా బుచ్చిబాబు సజీవవాదమనే దాన్ని వ్యవహరించేవారు. సార్త్రే

భావాలపట్ల బుచ్చిబాబుకు సంపూర్ణాంగీకారం ఉన్నదని ధ్రువపరచలేంగాని స్కార్ట్ భావాలతో వైముఖ్యం కానరాదు. స్కార్ట్ ప్రకృతి వర్ణనలకు, జీవిత సంఘటనలకు సన్నిహిత సంబంధాన్ని కలుగజేసినట్లు కనిపించదు. బుచ్చిబాబుమాత్రం యీ విషయంలో మామ్‌కు ప్రియశిష్యుడు. కొన్నిచోట్ల అంతేవాసి కూడ. బుచ్చిబాబు మరణించినప్పుడు అభిమాను లొకరు 'మాకు చెప్పని కథల్ని చెప్పటానికి అవతరించావా' అంటూ వాపోయారు. ఈ విషయం బుచ్చిబాబు రచనాతత్వాన్ని వెల్లడిస్తుంది. కథకు కావలసిన వాతావరణాన్ని కల్పించటంలో బుచ్చిబాబు 'మామ్' శిల్పాన్ని ప్రదర్శిస్తారు. 'చివరకు మిగిలేది' నవలలో గడ్డిలోపడుకుని, సంధ్యకేసిచూస్తూ, ఏకాంతంగా అంతర్ముఖుడయ్యే దయానిధి, చివరకు మిగిలేదేమిటని ప్రశ్నించుకున్నప్పుడు గూడ కథతో విడదీయలేని ప్రకృతి వర్ణన పాఠకుణ్ణి పట్టుకుని విడువదు.

'దయానిధి'నికూడ హేమ్లెట్‌ని వేధించిన సమస్యవంటిదే బాధిస్తుంది. తనతల్లి తప్పు చేసిందనే లోకపు ఆరోపణను ఎదుర్కోలేడు. ఆ తల్లి రూపానికి ఎవరు కళంకం ఆపాదించినా సహించలేడు. వారిపైన పగబట్టి హతమార్చాలనీ అనుకోడు. హేమ్లెట్‌కూడ తనతల్లిని హతమార్చబోయే ముందెంతో సంఘర్షణకు గురియౌతాడు. షేక్‌స్పియర్ నాటకాలను, ఆ నాటకాల గురించి ప్రపంచమందంతటా వెలువడిన విమర్శనూ జీర్ణించుకున్నవాడు కావటం వలననే తన నవలలో ఆ సంఘర్షణకు ప్రతిరూప మివ్వగలిగాడు. ఈ విషయంలో బుచ్చిబాబే ఇలా అంటాడు. 'హేమ్‌లెట్ నాటకం గురించిన విమర్శలు చదివాక నాలుగైదేళ్ళు నేనూ ఈ సమస్యను గురించి ఆలోచించాను. ఆలోచించాక నాకూ ఒక సిద్ధాంతం తట్టింది. అదేమిటో చెప్పేస్తాను. కొందరు తల్లి పంచనే పెరుగుతారు. ఆ బిడ్డలకు తండ్రితోకంటె, తల్లితోనే ఎక్కువ చనువుంటుంది. తమకి ఏది కావల్సినా తల్లినే అడుగుతారు. తండ్రంటే భయం, దూరంగా వుంటారు. హేమ్లెట్‌కి తల్లి అంటే అమితమైన ప్రేమ. ఈ ప్రేమ ప్రధాన లక్షణం ఏమిటంటే మనం ప్రేమించిన వ్యక్తి సుఖంగా వుండాలని కోరుకోవటం, ఆ వ్యక్తి ఆనందంగా, సుఖంగా గడపాలి. కష్టాలకు గురికాకూడదు. గెర్‌ట్రూడ్ సుఖపడడం కోరుతాడు హేమ్లెట్. పినతండ్రి తండ్రిని చంపాడు. అందుకు ఆమె బాధ్యురాలు కాదు. ఆమె తప్పేదం ఏమిటి? భర్తని చంపిన వ్యక్తిని పెండ్లాడటమే. ఎందుకు పెండ్లాడింది? క్లాడియస్ తన భర్తను పోలియున్నాడు గావున; ఈ రెండో భర్తతో సుఖిస్తోంది. సుఖించనీ! ఆ భర్తని చంపితే ఆమె విధవ అవుతుంది. సుఖించదు. కష్టపడుతుంది. ఆమె పూర్తిగా సుఖించాలి. పెద్దదైపోతోంది. ఇంక ఎంతకాలమో సుఖించలేదు. ఆ కాస్త వాంఛా తీర్చుకోనీ. అప్పుడు చంపుతాను. అనుకొని హేమ్లెట్ క్లాడియస్‌ని చంపకుండ జాప్యం చేస్తాడు. అదీ నా సిద్ధాంతం.' గెర్‌ట్రూడ్ క్లాడియస్‌ను పెండ్లాడటానికి కారణం అతడు తన భర్తను పోలివుండటమేననే విషయంతో తెలుగు పాఠకు లేకీభవించకపోయినా, తల్లిమీద ప్రేమ హేమ్లెట్‌ని కార్యదూరుణ్ణి చేసిందన్న సిద్ధాంతంలోని నిజాన్ని గ్రహించగలరు. ఈ విషయంలో ఎన్నోవిమర్శలున్నా యింత స్ఫుటంగా హేమ్లెట్ జాప్యంపట్ల కారణాన్ని వెల్లడించిన ప్రతిభ నిరుపమానం. ఈ పరిశోధన బుచ్చిబాబు స్వంతమే. ఏ ఆంగ్ల విమర్శకుడినీ ప్రతిధ్వనించలేదు.

పై సంఘర్షణను పురస్కరించుకుని దయానిధి జీవితం ఎన్నో మలుపులు తిరుగుతుంది. అసలు దయానిధి రాయలసీమ ఎందుకుపోయాడు? అనేది యీ నవలలో ఆలోచించదగిన ప్రశ్న.

దయానిధి జీవితంలోకి ఎందరో స్త్రీలు ప్రవేశిస్తారు. ఏ ఒక్కరినీ దయానిధి ప్రేమించలేదనే చెప్పాలి. కోమలిపట్ల అతనికి ఆరాధనీయమైన భావం మొదట్నించీ ఉన్నది. 'కోమల్ని ఎవ్వరూ పెండ్లి చేసుకోకూడదు; ఏ మొగాడికీ చెందకూడదు. చంద్రుడు, నక్షత్రాలు, సముద్రం, తాజ్ మహల్—వీటిని అందరూ పూరికే చూసి ఆనందిస్తారు. ఏ ఒక్కరూ యివి నావి అనరు, అట్లాగే కోమలి. ఆమె పెండ్లాం కాకూడదు—ఆమె ఒక సామ్యవాదపు సౌందర్యసంస్థ' అనుకుంటాడు దయానిధి. ఒక స్త్రీనిగూర్చి స్వేచ్ఛగా యిటువంటి విశృంఖల భావాన్ని వెలువరించినా పాఠకు

లెవ్వరూ అనీతిని బోధిస్తున్నాడని బుచ్చిబాబుపై విరుచుకుపడలేదు. దానికి కారణం అతని రచనాశక్తి; అతడి ఊహలలోని నిప్పులాంటి పవిత్రత. కోమలితో దయానిధి శారీరక సంబంధాన్ని అపేక్షించడు. అందుకే 'చూడు కోమలీ—నాకు ప్రేమంటే ఏమిటో యింత వరకూ తెలిసిందికాదు. అందరిలాగ శరీరవాంఛనే ప్రేమనుకుని, నన్ను నేను దగా చేసుకోలేను. ఇత రులు ఎవ్వరితోనూ, ఏ వొక్కరితోనూ పంచుకో లేనిదే నా ప్రేమ.'

ముద్దిడు కోవటానికి ప్రయత్నిస్తున్న కోమలి నోటిమీద తన అరచేతిని నొక్కి 'వొద్దుకోమలీ—నా ప్రేమను పంచుకుని పాడుచెయ్యను. నాకు మిగి లింది ప్రేమ వొక్కటే' అన్నాడు. ఈ మాటలు దయానిధి స్వరూపాన్ని పూర్తిగా తెలియజేస్తాయి.

ఐతే శారీరక సంబంధం ఉన్న అమృతంతోనూ అతడు ప్రేమను పంచుకోలేదు. నిధి అమృతంచేత ప్రేమింపబడ్డాడు. నిధి కోరుకొనేదీ ప్రేమింప బడటమే. అమృతం ప్రాణమున్న పాత్ర. అందుకనే నేమో శ్రీ రావూరి భరద్వాజగారు తమ కథానికా సంపుటం వొకదాన్ని 'చివరకు మిగిలేది'లోని అమృ తానికి అంకితం చేశారు. అమృతం అనగానే పసుపు పచ్చరంగుపై ఆకుపచ్చ పువ్వుల ఖద్దరుచీర, జబ్బల్ని పట్టుకున్న అంగుళం వెడల్పు జరీగల నల్లరంగు ఖద్దరు రవిక దానిపై తెల్లపూలు—వీటితో ఓ మూర్తి కళ్లముందు మెదుల్తుంది. 'ఖద్దరు చీరలో నిద్రపట్టదు. సిల్కుచీర చలేస్తుంది ఎల్లా బావా' అని జాలిగా అడుగుతుంది. కోమలి అన్నట్లు అమృతం గుండ్రంగా, దర్జాగా, ఠీవిగా ఉంటుంది. మరొకరి భార్య నిధి నంతగా ప్రేమిస్తుందేమిటనే సందేహం రానే రాదు మనకు. మనిషి మనిషినెందుకు ప్రేమించాలో తెలియజెప్పే సంఘటనలను బుచ్చిబాబు అలా అల్లు కుంటూ వెళ్లగలరు. మరి కామం మాటేమిటి? శారీరక సంబంధంతో పవిత్రత మంటగలిసిపోదా? పోదనే బుచ్చిబాబు సమాధానం. సముద్రంలో కొట్టుకు పోయే వ్యక్తికి, రబ్బరుబంతి దొరికినట్లుగా, ఏదో శక్తి అతన్ని కిందికి నెట్టేసింది. భరింపరాని సౌంద ర్యపు వెలుగులో అతనికి స్పృహ తప్పింది. ఆలో చనా, విమర్శనా, తర్కం, చైతన్యం—అన్న ఉద్రేకాల ప్రవాహంలో కెరటంపై నురుగులా కొట్టుకు పోయ్యాయి. 'సర్వేంద్రియాలు విడిపోయి జీవకణాలుగా శరీరాన్ని మార్చే శరీరం అనుభవంతో ఆత్మైపోయింది' ఈ చివరి వాక్యాన్ని అర్థం చేసుకుంటే అమృతం, నిధి తప్పు చేశారనిపించదు. అది తప్పనే భావమే రాలేదు. అందుకే నవలలో ఎక్కడా వాళ్లల్లో ఏ వొక్కరూ పశ్చాత్తాప పడలేదు. అల్లా పశ్చాత్తాప పడటం వాళ్ల నైజంకాదు. ఇది సజీవవాదం (Existentialism) సమర్థిస్తున్న నైతికజీవనం. దీన్ని అర్థం చేసుకునే శక్తి, నవలలో ప్రవేశపెట్ట గలిగిన ధైర్యమూ ఉన్న కొద్దిమందిలో, బుచ్చిబాబు ప్రముఖులు. గోపీచంద్, భాస్కరభట్ల మరికొంతమంది ముఖ్యులు. అమృతం గురించి చెప్పేటప్పుడు బుచ్చిబాబు కవిత్వంలోకి దిగిపోతాడు. 'రాతి శిథిలాలమధ్య వుండ వల్సింది అమృతం. ఎక్కడో, ఏ హంపీలోనో, అన్నీ రాళ్లు—భగ్నప్రతిమలు వొంటరిగా నిల్చిపోయిన స్తంభాలు, ప్రేమకోసం గుండె రాయి చేసుకున్న రాకుమార్తెల విగ్రహాలు – అన్నీ శిథిలమైపోయి, ఏ అర్ధరాత్రో అడుగుల చప్పుడూ, నిట్టూర్పు విన బడితే కదులుతామేమో ననిపించే ప్రమాదస్థితిలో పడివుంటే వాటిమధ్య అమృతం కూచుని, విషాదంతో నవ్వుతుంది. ఆమె గడిచిపోయిన అనుభవపు వైభవా లను తల్చుకుని ఏడ్చి అతీతం ఐనప్పుడు కన్నీరు చుక్కలు చుక్కలుగా రొమ్ములమధ్యనుంచి జారి యీనాటికి నదిగా ప్రవహిస్తోంది. తన దుఃఖం నదులై పొంగిపొంగి దేశాన్ని ముంచివేస్తుంది. తప్పు! తను ఏడ్వకూడదు; విషాదంతో నవ్వుతుంది. అనాడు సౌందర్యం తన యాత్ర ముగించుకుని ఆమెను శిలగా మార్చివేస్తుంది. ఏ రాతిని నిట్టూర్పుతో కదిల్చినా అమృతం కలలో కార్చిన కన్నీరల్లే నీరైపోతుంది'—ఈ పంక్తులు తెలుగులోని ఉత్తమ కవితాఖండికలలో వొకటిగా యెంచుతాను నేను.

సుశీల, నాగుమణి, ఇందిర, శ్యామల, కాత్యా యని నిధి జీవితంలో సంచలనం కలిగించిన మరి కొందరు స్త్రీలు. సుశీలకు నిధి అంటే కసితో కూడిన ప్రేమే ఉన్నది. తన ఆధిక్యాన్ని గుర్తించ డని బాధ, ఇతర స్త్రీలతో అతని ఆత్మీయతను సహించలేని కసి ఆమెను నిధినుండి దూరంచేస్తాయి.

బ్రతుకుతో సమాధానపడి సాంసారిక ఆనందాన్ని పొందకుండానే ఆమె బిడ్డనుకని లోకాన్ని వీడిపోతుంది. నిధిలో ఉన్న లోపాన్ని సుశీల గుర్తించింది. గుర్తించటమేకాక కుండ బద్దలుకొట్టి చెప్పేసింది, 'సంగీతం, చదువు, ఆస్తి, చక్కదనం, యివన్నీ వుంటేనే నచ్చడం జరిగితే ఎంతమందికి వివాహా లవుతా యంటావు' అని నిధి అన్నప్పుడు సుశీల 'నువ్వేదో ప్రత్యేకమైన మనిషివి అనుకునేటట్లుగా మాట్లాడు తుంటావులే – అందుకన్నాను' అంటుంది. ఇదే నిధిలో లోపమైతే యీ లోపం బుచ్చిబాబులోనూ ఉన్నది.

ఇతరులతో తన ప్రత్యేకతను నిరూపించుకున్నట్లు తెలుగు రచయితలలో బుచ్చిబాబు చిత్రకారుడు. ఆంగ్లభాషా వైదుష్యంతో తనదైన వాక్య విన్యాసాన్ని ప్రత్యేకించుకున్నాడు. అది మరెవ్వరికీ అనుకరణ కాదు. బహుశః రాబోయే రచయితల కది అనుసరణీయం కావొచ్చు. ప్రకృతిపట్ల ప్రగాఢమైన ప్రేమ అతని మరో ప్రత్యేకత. సంధ్యచేసిన ఆఖరి ఆక్రందనం, గడ్డిపోచ ఆర్తనాదం, వరిమళపుబరువు, శిథిలాల గాంభీర్యము, ప్రవాహంలో గడ్డిపోచ ప్రయాణం — యివన్నీ బుచ్చిబాబే చూడగలరు. చూపించగలరు. ఆయన ప్రక్కతిలో వొకరు. ఐతే మరొకరుగూడ యీ పని చెయ్యగలరు. అతడు జగన్నాథం. గోదావరొడ్డున పాకవేసుకుని, ప్రకృతిలోని ప్రశాంతతను పొందుతూ జీవితాన్ని పూర్ణంగా అనుభవించిన ఘనుడు. అమృతం తర్వాత జగన్నాథమే నవలలో విశిష్టమైన పాత్ర అని నేననుకొంటాను. 'గిరీశం' ప్రభావం జగన్నాథం పాత్రచిత్రణలో ఉపయోగపడిందని బుచ్చిబాబే అంటారు. జగన్నాథం 'జగ్గూ' అంటే ఊరుకోడు. మామ్మూలుగా మాట్లాడటం జగన్నాథానికి చేతకాని పని. గిరీశం మాట్లాడినంత చురుగ్గా, అర్థవంతంగా మాట్లాడతాడు. ప్రతిమాటలోనూ చమత్కారం ఉట్టిపడుతుంది. ఎవ్వరివేపు సూటిగా చూడలేడు. ఏదో కొంటెగా మాట్లాడి నవ్విస్తాడు. తాను నవ్వేటప్పుడు మెడపక్కకు వాల్చి మరీ నవ్వుతాడు. జీవితమంటే తగనిప్రేమ. సన్యాసమంటే తగని వెగటున్నూ. అతడి మాటలు కొంటెగా ఉన్నా అందులో గంభీరమైన సత్యం దాగుంటుంది. థోరో Walden ప్రభావం జగన్నాథం ఆశ్రమాన్ని వర్ణించటంలో ఉపయోగపడింది.

నిధి treat చెయ్య పూనుకొన్న రోగి శ్యామల. సౌందర్య రాహిత్యం ఆమె జబ్బు. జీవితమంటే మక్కువనూ, సౌందర్యంయొక్క నిజస్వరూపాన్ని తెలియజెప్పి బ్రతుకుపట్ల ఆమెకు గాఢవిశ్వాసమూ, అభిమానాన్నీ ఏర్పరచటంలో నిధి కృతకృత్యుడు కాలేకపోతాడు. లోకం అపనిందతో శ్యామలను దూరం చేస్తుంది. ఆమె మానసిక జాడ్యం కుదర్చగలననే విశ్వాసం ఉన్నా లోకాన్ని ఎదుర్కోలేక బాధతో చిలుకలేని ఖాళీ పంజరంగా తన హృదయావేదనను అణచుకుంటాడు.

కాత్యాయని మనోహరమైన సంజకిరణం లాంటిది. ముగ్ధ; అమాయికంగా కన్పిస్తుంది. అమాయికంగా మాట్లాడుతుంది. పెండ్లిమాట వినగానే సిగ్గుపడుతుంది. దయానిధిని వెఱ్ఱిగా అభిమానిస్తుంది. కాత్యాయనితో సంబంధాన్ని గూర్చిన అభాండాన్ని నిధి తట్టుకోలేక పోతాడు. కోమలితో నిధి సాహచర్యాన్ని చోద్యంగా చూస్తుందేతప్ప ద్వేషించదు.

రాజభూషణం బుచ్చిబాబు అభిప్రాయాలకు నిలువుటద్దంగా కన్పిస్తాడు. వాదంలో ఉన్న పస రాజభూషణం చిత్రణలో లేదు. నవలలో ఆ నాటి రాజకీయ, సాంఘిక జీవితాన్ని, చెడకుండానే రచయిత గడుసుగా కథ కనుగుణంగా మలచుకోగలిగారు.

'చివరకు మిగిలేది' ముగింపు, నవలకే మకుటాయమానం. ఏ వ్యక్తి జీవితంలోనైనా కలకాలం జ్ఞాపకముంచుకోదగిన గంభీర తాత్త్వికి పరిశీలన యిది. ఇట్టే తేలిపోతుంది; మళ్ళీ మరపురాదు— 'చివరకు మిగిలింది – దాని సమాధానం కాదు; సమాధానం తెల్సుకునేటందుకు తను చేసిన యత్నాల— జ్ఞాపకాలు; తనలో తాను సమాధానపడటం—అది మిగిలింది.'

క థ లు :

ఎన్నోకథలు వ్రాసినా ఒక కథకు ఇంకొక కథకు ఎక్కడా సామ్యం ఉండదు. వస్తువైవిధ్యం

ఆ కథలను వేటికవే వేర్వేరు కళాఖండాలుగా మార్చి వేస్తుంది. ఏ కథలో చూసినా ఒకేవిధమైన వైచిత్రితో కూడుకొన్న వర్ణనలే చేస్తాడని బుచ్చిబాబుపై ఒక ఆరోపణ ఉన్నది. కథలోని వాక్యాలను ఆంగ్లంలో ఆలోచించి తెలుగులో వ్రాయటంవలన వాక్యవిన్యాసంలో వైచిత్రి గోచరిస్తుందంటారు. కథలో వైచిత్రి కిచ్చిన ప్రాముఖ్యం వాస్తవికత కివ్వడనికూడ ఆరోపణ చేస్తారు. ఈ విషయం పూర్తిగా సత్యమనటానికి వీల్లేదు. తన కథల కేవిధమైన వచనరచ సరిపడుతుందో బుచ్చిబాబే నిర్ణయించుకున్నాడు. కథలలో సౌందర్యానికి విచిత్రతకు యిచ్చిన ప్రాముఖ్యం వాస్తవికతకు యివ్వకపోవటం అతని అభిరుచినిబట్టి నిర్ణయమౌతుంది. అంతేగాని ఆకలి, దారిద్ర్యం, ధరల పెరుగుదలే కథావస్తువులని శాసించే అధికారం ఎవ్వరికీలేదు. బుచ్చిబాబు ప్రత్యేకత కథలకు శీర్షికలను నిర్ణయించుకోవటంలోనూ వ్యక్తమౌతుంది. మల్లాది రామకృష్ణ శాస్త్రిగారి విధంగానే శీర్షికతోనే పాఠకుణ్ని ఆకట్టుకొనేవారు. మల్లాదివారికి బుచ్చిబాబు శీర్షిక అనుకరణమేమీ కావు. తన ప్రత్యేకత తనదే. 'కలలో జారిన కన్నీరు; దిగజారిన మాలిన్యం; అరుకులోయలో కూలిన శిఖరం; దేశం నాకిచ్చిన సందేశం; ఎల్లోరాలో ఏకాంతసేవ; నన్నుగురించి వ్రాయవూ; అడవికాచిన వెన్నెల: 'బీ'; తడిమంటకు పొడినీళ్ళు;' అన్నవి అన్నీ ఆలోచింపచేసే శీర్షికలే. ఒక్కకథ చదివినతరువాత చాల కాలంవరకు ఆ అనుభూతి దూరంకాదు. పత్రికలు వెలువడగానే బుచ్చిబాబు కథకోసం ఆతురతగా వెదికే పాఠకుల్ని అసంఖ్యాకంగా సంపాదించుకున్నాడు. పాఠకుల నాలోచనాపరులుగాకూడ చేశాడు. కథాశిల్ప నైపుణ్యంలో బుచ్చిబాబు ఏ ఆధునిక, ఏ పాశ్చాత్య కథారచయితకీ తీసిపోడు. మామ్ ముద్ర బుచ్చిబాబు కథల్లో కొట్టొచ్చినట్లు కన్పించినా అవి మామ్ కథల కనువాదాలు కావు. మామ్‌ను గురుతుల్యునిగా స్వీకరించటంవలన ఏర్పడిన ముద్రలు.

బుచ్చిబాబు ఆషామాషీగా కాలక్షేపాని కెన్నడూ కథలు వ్రాయడు. చెప్పదలచుకున్న విషయమేదో ఉంటేనే కథకు శ్రీకారం చుడ్తాడు. మరి ఆ కథలు సాంఘిక ప్రయోజనాన్ని సాధించలేకపోవచ్చు. దారిద్ర్యాన్ని తొలగించటానికో, సాంఘిక సంస్కరణకో కథకులు పూనుకోవాలనటం వెఱ్ఱిమాట. ఏ ఉత్తమ కళాకారుడుకూడ కళ నందుకోసమే వినియోగించడు. ఓ కళాఖండం సాంఘిక ప్రయోజనాన్నికూడా సాధించిందంటే అది మంచి విషయమే. ఏ విషయాన్నైతే చెప్పదలచుకున్నాడో ఆ విషయాన్నిగూర్చి కూలంకషంగా, పరిశోధన చేసినంతగా తెలుసుకునిగాని కథ కుపక్రమించడు. వైద్యంగురించి వ్రాస్తే ఏవైద్యునికీగూడ అతనికి వైద్యశాస్త్రం గురించి తెలియదనిపించదు. ఆటవిక జీవితానికీ, భూగర్భ శాస్త్రానికీ, శిల్పానికీ చిత్రలేఖనానికీ, 'ఇంజనీరింగ్'కీ వేటికి సంబంధించిన వైనాసరే ఆ విషయాలు కథకునికి కూలంకషంగా తెలుసుననిపిస్తాయి. ఇంతటి విషయ పరిశీలనాసక్తి సహనమూ ఎందరు కథకులకుంటాయి? అసలెందుకు యీ విషయాలన్నీ తెలుసుకోవాలి? అని ప్రశ్నిస్తే బుచ్చిబాబు యిలా అంటాడు. ఈ రకం వైజ్ఞానిక విషయాల సమీకరణ పాండిత్యం. నవలకి అవసరం. కాని కథానికకి అక్కర్లేదు. ఈయన హడావిడి చేస్తున్నాడు— అనుకోవచ్చు కొందరు. అక్కర్లేదు, నిజమే. నేను తెలుసుకున్న వాటిని ఒకటి రెండు తప్ప కథలో వాడకపోవచ్చు...భోగట్టా అంతా తెలుసుకున్నాక మనస్సులో వస్తువు కనువైన మానసిక స్థితి ఏర్పడుతుంది. ఒక వాతావరణం ప్రబలుతుంది. దానికి సరిహద్దు లేర్పడతాయి. అందులోంచి ఒక తీక్షణమైన పరిశీలనాశక్తి, దీక్షతో ఆకళింపు చేసుకొని, ఆ చేసుకున్న దాన్ని సూటిగా, శక్తివంతంగా పాఠకుడితో పంచుకోవాలన్న కళాతృష్ణ ప్రత్యక్షమవుతాయి.'

'రచయిత ప్రతిదీ జాగ్రత్తగా వినాలి, చూడాలి, తెలుసుకోవాలి. కాని ఉద్రేకంతో దానికి లొంగిపోకూడదు. ఆ విషయాన్ని మనస్సులో ఒక మూలపడేసి వుంచాలి. ఎప్పుడో దాని అవసరం రావొచ్చు. అదొక మంచికథ అవొచ్చు.' ఇది వర్ధమాన కథకులకి బుచ్చిబాబిచ్చే సందేశం. జీవితంలోని ఒడిదుడుకులు, ఎదురుదెబ్బలు కథావస్తువులుగా ఉపయోగపడవచ్చునంటాడు. అందుకు తార్కాణగా పద్మరాజుగారి 'గాలివాన' కథ చూడమంటాడు. గాలివానవల్ల పద్మరాజుగా రుంటున్న ఇల్లు కూలింది.

అతని భార్యకు తీవ్రమైన గాయాలు తగిలాయి. ఈ అనుభవాలే తర్వాత కాలంలో 'గాలివాన' అనేగొప్ప కథగా మారాయంటాడు. 'మళ్ళీ మళ్ళీ చదివే ఖండ కావ్యంలా కొవపాగాలంటాను కథానిక' అంటాడు.

దేశం నాకిచ్చిన సందేశం; ఎల్లోరాలో ఏకాంతసేవ; దిగజారిన మాలిన్యం; ఆరుకులోయలో కూలిన శిఖరం; నన్ను గురించి కథ వ్రాయవూ; ఆరుగురు కథకులూ—ఒకే వాయిక; కొత్తనైతెన - పాతనీరు; మొదలైనవన్నీ ఖండకావ్యంలా మళ్ళీ మళ్ళీ చదవాలనిపించేవే.

ఉద్యోగం చేస్తున్న వారెవరైనా 'దేశం నాకిచ్చిన సందేశం' కథలోని సమస్య నేదుర్కొంటారు. 'మీకెం తిస్తారు'? అని అడగకుండావుంటే మనిషిని సామాన్యంగా ఏ ఉద్యోగీ ఎదుర్కోడు! అడిగి ఊరుకుంటే ఫరవాలేదు. జీతమెంతో చెప్పగానే అతడి సాంఘిక విలువల్ని నిర్ణయించి పారేస్తారు. ఎదుటి వ్యక్తి జీతమెంతో తెలుసుకోవాలని ప్రయత్నించే తహతహను, అందమైన కోణంలో పట్టుకున్నాడు బుచ్చిబాబు. జీతమెంతో చెప్పకుండానే మరపిద్దామని కథకుడు ప్రయత్నించడమూ, ఎదుటి వ్యక్తి హఠాత్తుగా ఆ మాట అడిగెయ్యటమూ చిత్రంగా కన్పిస్తాయి. ఎన్నిసార్లైనా యీ కథలో సంభాషణలు చదవాలనిపిస్తుంది.

'ఎల్లోరాలో ఏకాంతసేవ'లో అజంతా ఎల్లోరా గుహలలో కళానైపుణ్యమూ, ఆ అందాలకు రూపం కల్పించాలని ఉవ్విళ్ళూరే 'జీయాలజిస్టు' ప్రయత్నమూ, ఉద్విగ్నమైన అతడి వాంఛలకు భార్య అక్కయ్య Model గా ఉపయోగపడటమూ, శ్రమించి అతడు తయారుచేసిన శిల్పపు ప్రతిరూపాన్ని భార్య అనుమానించి, తన అక్కయ్యనే నిందించి, నిందవేసి శిల్పాన్ని భగ్నంచేస్తుంది. ఐతే అసలు చిత్రాన్ని (స్వేచ్ఛ అనేది) అతడు పోటీకి పంపి బహుమతి గెలుచుకోవటమూ జరుగుతూంది. ప్రకృతినీ, సృష్టి రహస్యాల్ని తెలుసుకోవటానికి శిల్పి తాపత్రయాన్ని. బాలవితంతువులో అందచందాలను గూర్చిన ఆలోచనలను, మనస్సులోని మారుమూలలను వెలికితీసి కథారూపాన్నిచ్చాడు బుచ్చిబాబు.

ఈ విధంగా చెప్పుకుపోతే బుచ్చిబాబు వ్రాసిన ప్రతికథా విశిష్టమైనదే. అన్నికథలూ ఒక యెత్తు— అతడు వ్రాసిన ఉహాచిత్రం 'నా గాజుమేడ' ఒక యెత్తు. ఇది చదివితే అతడి తత్త్వం బాగా తెలుస్తుంది. ఎవరేనా పెదవి విరిచి బుచ్చిబాబు 'గాజుమేడవాసి' అనేయవచ్చు. ఆ మాటలో యథార్థం ఉండొచ్చు. ఐతే అతడు కళాజీవి; సౌందర్యోపాసకుడు, వ్యుత్పన్నుడు; ప్రతిభాశాలి అని ఒప్పుకుతీరాలి.

'సెక్స్' సమస్యల్ని చర్చించటంలో బుచ్చిబాబు స్వేచ్ఛ నవలంబిస్తాడు. ప్రేమనూ, కామాన్ని, తుదకు సంభోగాన్నికూడ వివరంగా వ్రాస్తాడు. లోకం ఆక్షేపించే ఎన్నోసంబంధాలను కథావస్తువులుగా స్వీకరించాడు. ఐతే బుచ్చిబాబు చలానికి మల్లే దూషణకు గురికాలేదు. ఆక్షేపించిన వాళ్ళున్నప్పటికీ అసహ్యించుకునే వాళ్ళుండరేమో! దానికి కారణం అతడి రచనాశక్తి—అంటే భాష అని కాదు. భాష చలాన్ని మించి మరెవ్వరు వ్రాయగలరు? సంభోగాన్ని ప్రేరేపించటానికి కావలసిన సంఘటనల నల్లటంలో బుచ్చిబాబుకున్న చాకచక్యం పాఠకుల్ని ఆకట్టుకొంటుంది. విమర్శించనివ్వదు. నిధి, అమృతం కలయిక సహృదయుడెవ్వడూ అసహ్యించుకోడు.

శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మగా రొకచోట 'బుచ్చిబాబు కథ బట్ట విప్పుకొంది' అన్నారు. ఐనప్పటికీ వారి కథలోని శిల్పనైపుణ్యాన్ని, మానసిక జగత్తును పరిశీలించి చెప్పే వాస్తవాలను త్రోసివేయలేరనుకొంటాను. అవినీతిని ఆకర్షవంతంగా బుచ్చిబాబెనాడూ చిత్రించలేదు.

బుచ్చిబాబు కథలలో ఏ కథ చదివినా అతడి తత్త్వం తెలుస్తుంది. ఏ ఒక్క కథనూ యిది అంతమంచికథకాదని త్రోసివేయలేదు. ఉత్తమ కథానికా రచయిత కింతకన్న సార్థకత మరేముంది? వ్రాసిన అన్ని కథలూ మంచి కథలుగా పేరొందాయి. అన్నీ మంచి కథలు వ్రాసిన కొద్దిమందిలో ఆయనొకరు.

నాటకాలు; నాటికలు:

తిష్యరక్షిత; రాయల కరుణకృత్యం; ఉమర్ ఖయ్యాం; ఒకే నిద్ర—ఎన్నో కలలు; ఆద్యంతాలు

మధ్యరాధ; ఉత్తమా యిల్లాలు; ఆత్మవంచన; దారిన పోయే దానయ్య; గొలుసు – ఇవి సుప్రసిద్ధమైన బుచ్చిబాబు నాటికలు. వీటిల్లో చాలవరకు ప్రదర్శన యోగ్యాలూ, లేదా శ్రవ్యయోగ్యాలున్నూ. అన్నింటిలోను అంతరంగ పరిశీలనం ప్రధాన అంశం. తిష్య రక్షిత చిత్రాంగివంటిదే. రచయిత తిష్య పక్షమే వహిస్తాడు. శ్రీ వేలూరి చంద్రశేఖరంగారి 'కాంచనమాల' నాటకం వొడుపు వీరి యీ నాటికలో కన్పిస్తుంది. 'ఉమర్ ఖయ్యామ్' ఖయ్యాం తత్వాన్ని కాచివడపోసింది. సాక్షీ మరపురాని పాత్ర. 'రాయల కరుణ కృత్యం'లో తిమ్మరుసు పాఠకులందరిచేత కన్నీళ్లు పెట్టిస్తాడు. 'ఒకే నిద్ర – ఎన్నో కలలు' దేశసమైక్యతను చాటిస్తుంది. అలాగని ప్రచారంకోసమే వ్రాసింది కాదు. బుచ్చిబాబు మనస్సులోని స్నేహభావం భారతీయులందరినీ ఏకం కమ్మనే ప్రబోధిస్తుంది. ద్వేషాన్ని విడనాడంది ముక్తి లేదంటా డీ నాటకంలో. ఇది బహుమతి పొందింది. 'ఉత్తమా యిల్లాలు'లో ఎంకి పాటలను రమణీయంగా రూపొందించారు. చలంగారి తర్వాత ఎంకిపాటల సౌందర్యాన్ని బుచ్చిబాబులా మరొకరు అనుభవించారని నా కనిపించదు. 'దారినపోయే దానయ్య' విలక్షణమైన సాంఘిక నాటకం. ప్రదర్శనలో అద్భుతమైన విజయాలను సాధించింది.

బుచ్చిబాబు నాటక రచయితగానేగాక ప్రయోక్తగాను మిక్కిలి సమర్థుడు. నాటికను నేపథ్యంలో ధ్వనులను అందంగా సమకూర్చగలడుకూడ.

వ్యా సా లు:

'నన్నుమార్చిన పుస్తకం' అనేది బుచ్చిబాబు వ్రాసిన వ్యాస సంపుటి. ఇదిగాక అప్పుడప్పుడు 'భారతిలో' ప్రచురించిన బెర్ట్రాండ్ రసెల్ భావ ప్రపంచం సోమర్‌సెట్‌మామ్: ఆల్డస్ హక్స్లీ; జీన్‌పాల్‌సార్త్రే రచనలు భావాలపట్ల సుదీర్ఘమైన వ్యాసాలు ఉన్నాయి. మరికొన్ని మన స్తత్వ శాస్త్రానికి సంబంధించిన 'మనస్సులో మారుమూలాలు'; నవలాకారుడి నాలుగో పరిణామం మొదలైనవి వ్రాశాడు. అన్నింటిలోనూ బుచ్చిబాబు నిష్పాక్షికమైన పరిశీలనా ధోరణిని, విజ్ఞానువుగా ఆయా రచయితల నర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తున్న రీతిని వెల్లడిస్తాడు. ఏ రచయితపట్ల ద్వేషాన్నీ, కసినీ ప్రదర్శించడు. కసి అంటే జ్ఞాపకం వొచ్చింది. 'కసిత్వం'; 'మహామహుల మొదటి మాటలు' మొదలైనవికూడ మంచి వ్యాసాలు. అన్నివ్యాసాలలోను సోమర్‌సెట్‌మామ్‌గురించి, రసెల్‌గురించి వ్రాసినవి ఎక్కువ బాగున్నాయి. కారణం బుచ్చిబాబుకు మామ్ అన్నా, రసెల్ అన్నా అపరిమితమైన అభిమానం. వారి అడుగుజాడల్లో నడవటానికి ప్రయత్నించాడు. వారి తత్వాన్ని వొంట పట్టించుకున్నాడు. బుచ్చిబాబు వ్యాసాలు ఆయన కథలకు తీసిపోవు. విశ్వసాహిత్యంలో ప్రసిద్ధులైన ఆ మహారచయితల భావప్రపంచాన్ని పరిచయంచేసిన ఖ్యాతి బుచ్చిబాబుదే.

క వి త్వ ం :

బుచ్చిబాబు చాల ఆలస్యంగా కవిత్వాన్ని ప్రారంభించాడు. కవిత్వపు లోతుల్ని చూడకుండానే మరణించాడు. కవిగా శిఖరాన్ని అధిరోహించనేలేదు. వ్రాసింది వచన కవిత్వం – ఆయన వ్రాసిన కవిత్వాంశం ఎల్లెడలా కన్పించినా కవిత్వంలో ఆయన వ్యక్తిత్వం స్ఫుటంగా కన్పించదు ఆ కవితలు బుచ్చిబాబును కవిగా తెలుగు సాహిత్యంలో నిలబెట్టలేవు.

చి త్ర క ళ :

బుచ్చిబాబు గొప్పచిత్రకారుడైనట్లు ఆయన రచనలు చదివినవారికి అనిపిస్తుంది. ఆయన పద చిత్రాలు అంత బాగుంటాయి. ఆయన స్వయంగా గీచిన తైలవర్ణచిత్రాలు ఎన్నో ఉన్నాయి. అవి చాల వరకు మిత్రబృందానికే పరిమితాలు. ఆయన చిత్రాలు అచ్చయితేగాని వాటి విలువ అందరికీ అర్థంకాదు. రంగుల మేళనంలో ఆయన నైపుణ్యం చిత్రాలదాకా రచనలే చాలు.

మహారచయితల ప్రభావం :

షేక్‌స్పియర్, సోమర్‌సెట్‌మామ్, బెర్ట్రాండ్ రసెల్, జీన్‌పాల్‌సార్త్రే, భారతీయులలో వాల్మీకి, భవభూతి బుచ్చిబాబు కిష్టమైన రచయితలు. షేక్‌స్పియర్ హేమ్లెట్ ప్రభావం 'చివరకు మిగిలేది'లో నిధి సంఘర్షణలో కన్పిస్తుంది. నవలకది అనావశ్యకమైన పెంపుదల అనుకోకుండ హేమ్లెట్ నాటకాన్ని గురించి సుదీర్ఘంగా చర్చించారు. షేక్

స్పియర్ 'సాహితీ పరామర్శ' అనే గ్రంథానికి బహుమతి పొందారు. ఇంతవరకూ తెలుగులో వెలువడిన షేక్‌స్పియర్‌ను గూర్చిన రచనలలో యిది అత్యుత్తమ మైనదనటం అతిశయోక్తి కాదు.

సోమర్‌సెట్ మామ్ ముద్ర బుచ్చిబాబు కథల్లో అడుగడుగునా కన్పిస్తుంది. బుచ్చిబాబు కథలనే ఆంగ్లంలోకి సమర్థులెవరైనా అనువదిస్తే అవి మామ్ కథలని భ్రాంతి పొందేటంతగా ఉంటాయి. మామ్ కథల ననువదించకపోయినా, అతడుపయోగించుకున్న కథావస్తువులనే మరొక విధంగా మరి కొన్ని కథలలో మంచుకొన్నాడు. 'మామ్ చెప్పేది కథల్ని చెప్పటానికి వచ్చావా' అన్నమాటలో ఎంతో అర్థం ఉన్నది.

రసెల్ కంకితమిచ్చిన కథలు చదివితే బుచ్చిబాబుకు రసెల్ తత్వంపట్లగల గాఢాభిమానం విశదమౌతుంది. 'బెర్ట్రాండ్ రసెల్ భావ ప్రపంచం' అనే వ్యాసం తెలుగు వ్యాసాలలోనే మణిమకుటం. అటువంటి వ్యాసాలు ఆయన మరెన్నో వ్రాస్తాడన్న ఆశల్ని త్రుంచేసి వెళ్ళిపోయాడు. రసెల్ ఎక్కడో చెప్పిన సూక్తుల్ని ఆయన చమత్కారంగా కథావస్తువులుగా వినియోగించుకున్నాడు.

సార్త్రే సజీవవాదం(Existentialism) బుచ్చిబాబు రచనల మూలతత్త్వం. నీతి అవినీతుల కుహనా అడ్డుగోడలను, పాపపుణ్యాలపట్లగల మూఢనమ్మకాలను సార్త్రే స్థాపించిన నూతన భావ విప్లవ పంథాలో బుచ్చిబాబు బ్రద్దలు కొట్టాడు. ఆత్మానుభూతికిచ్చిన ప్రాధాన్యం ఆయన పశ్చాత్తాపాలకు, స్వర్గనరకాలకు యివ్వనే లేదు.

వర్ణనలు చెయ్యటంలో బుచ్చిబాబు పాశ్చాత్యుడనే అపప్రథను తొలగిస్తూ ఆయన తన వర్ణనలెన్నో వాల్మీకి రామాయణంలోంచి, భవభూతి ఉత్తరరామచరితలోంచి గైకొన్నట్లు చెప్పాడు. రామాయణం బుచ్చిబాబుకు ప్రాణప్రియమైన కావ్యం. కొన్ని వర్ణనలను తాను స్వతంత్రించి చేశాననుకోగా అవి రామాయణంలో ఉన్నట్లు తెలుసుకొని తాను దిగ్భ్రమ చెందానన్నారు.

ఆధునిక రచయితలలో నండూరి, కృష్ణశాస్త్రి, చలం, గోపీచంద్, మల్లాది వారలు బుచ్చిబాబు అభిమానపాత్రులు. నండూరి 'యెంకి పాట'లను సర్వాత్మనా అనుభవించాడు. కృష్ణశాస్త్రి సౌందర్య దాహాన్ని తనలో నింపుకొన్నాడు. భాషా సౌందర్యమూ, భావ విప్లవమూ చలంగారి ఆస్తి అయితే బుచ్చిబాబు పాలు పంచుకొన్నాడు. గోపీచంద్‌లాగే నవ్యమానవవాదంపట్ల తన మనస్సు నిల్పాడు. చివరకు మిగిలేదిలోని Existentialism వంటిదే, గోపీచంద్ 'మెరపుల మరకలు'లో అనుసరించాడు. గోపీచంద్ బుచ్చిబాబు లిరువురూ ప్రాచ్యపాశ్చాత్య తత్వశాస్త్రాలను కాచి వడపోసిన ధీమంతులు. గోపీచంద్ ముఖ్యంగా మధ్య తరగతి జీవితాన్ని చిత్రించే వాస్తవికవాదికాగా, బుచ్చిబాబు సౌందర్యోపాసకుడైన కళాజీవి. గోపీచంద్‌ను గూర్చి బుచ్చిబాబు 'నే నెరిగిన గోపీచంద్' అనే రచనలో తెలియజేశాడు. వీ రిరువురు గూడ సెక్సు సమస్యలను

చర్చించటంలో వెనుదీయలేదు. కామో౽్రేకాలను రెచ్చ గొట్టే దుస్సంకల్పం వీరి రచనలలో లేనేలేదు.

**ఇచ్చిందేమిటి :**

రచయితగా బుచ్చిబాబు యిచ్చిపోయిందేమిటి? అతని వ్యక్తిత్వమే ఆదర్శప్రాయమైన అడుగుజాడలను నెలకొల్పింది. బుచ్చిబాబు సిగ్గరి. గంభీరోపన్యాసాలు చెయ్యడు. సన్మానసభలకు బహుదూరంగా ఉంటాడు. తనని ంబాసుతో విమర్శించేవారి నెప్పడూ ఎదుర్కోలేదు. పెద్దగా హోరుమనే నవ్వుతో మిత్రబృందాన్ని ఉత్సాహపరచే నిత్యసంతోషి. వ్యాధిపీడితుడై కూడ తన జబ్బు వివరాలతో యితరులను బాధించని యోగి. చెణుకులను రచనలలోనూ, జీవితంలోనూ కురిపించటం ఆయనకు బాగా చేతనవును.

మహాకావ్యంలా రసానుభూతి నిచ్చే గొప్ప నవల నిచ్చాడు. ఏదో వ్రాసి తన భావాల నన్నింటినీ వెల్లడించాలనే తాపత్రయం ఆయనలో లేదు. అందుకే మరో నవల వ్రాయలేదు. జీవనకోణాలను కిరణాలుగా ప్రసరిస్తూ ఎన్నో కథల నిచ్చాడు. కవిగా ఆయన రాణించకపోయినా 'నీకూ నాకూ మధ్య నిశీధిలా నీ జుట్టు'వంటి పంక్తు లెన్నో కవులు, కవితాభిమానులు కళ్ల కద్దుకొంటారు.

'నా కథ వ్రాయవూ' అనే కథను వ్రాసిన బుచ్చిబాబు తన 'అంతరంగ కథనం' ప్రారంభించి ముగించనేలేదు. రచయిత జీవితానికీ, రచనల ప్రేరణకూ సంబంధాన్ని వివరిస్తూవచ్చిన ఆత్మకథ తెలుగులో ఏ రచయితా యింతకుముందు వ్రాయలేదు. బుచ్చిబాబుకూడ అసంపూర్ణంగానే వదిలివేశాడు. ఏమిచ్చాడు? అనే ప్రశ్నకు జవాబుగా 'ముగింపు మీకు తెలుసు' అంటారు రారచయిత! అవును ఆయన వ్రాసిన ప్రతి రచనా ఆలోచనాత్మకమే, సౌందర్యమయమే, రసభరితమే.



# దశకుమార చరిత్రము

"భాస్కర్"

పై శీర్షికతో సెప్టెంబరు 67 భారతి సంచికలో ప్రకటితమైన వ్యాసమును జూచుట తటస్థించి నది. పై వ్యాసమును బురస్కరించికొనియు, ఎకాడమీ వారు ప్రచురించిన 'దశకుమార చరిత్ర' ముద్రణ మును గూర్చియు నాకుఁ దోచిన కొన్ని యంశముల నిట ప్రస్తావించుచున్నాను. విజ్ఞులు పరిశీలింతురు గాక!

కేతన కృతిని యాంధ్రలోకమున కందించిన కీర్తి నవయుగవైతాళికుఁడైన కందుకూరి వీరేశ లింగం పంతులుగారిది. వారు దశకుమార చరిత్ర మును 1888 లో చింతామణి పత్రికయందు నాల్గా శ్వాసములు మాత్రమే ముద్రించిరి. అప్పటి కాపత్రిక ఆగిపోయెను. 1901 వ సంవత్సరమున మద్రాసు చింతామణి ముద్రణాలయములో ద్వాదశాశ్వాసముల పూర్తిగ్రంథమును మానవల్లి రామకృష్ణ కవిగారి సహా యముతో సంస్కరించి ప్రకటించిరి.

1925 లో వావిళ్లవారు దీనిని శేషాద్రిరమణ కవుల పీఠిక (తొలిపలుకు)తో ముద్రించిరి. దీని పరిష్కరణ భారమును శ్రీ మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వహించిరి. ఈ సంవత్సరము ననే దీనిని 'Telugu classics popular Edition series'—అను శీర్షిక క్రింద శ్రీ బెల్లంకొండ చంద్ర మౌళి శాస్త్రిగారి సంపాదకత్వమున వెలయించిరి.

1901 వ ముద్రణమునకు, 1925 వ ముద్రణమునకు నడుమ నెవరో ద. కు. చ.ను ముద్రించి నట్లు 10-6-1915 వ తేదీన వీరేశలింగం పంతులుగారు ఆంధ్రపత్రికలో వ్రాసిన లేఖనుబట్టి తెలియుచున్నది. కాని వారు వివరము లియ్యరైరి. ఆ లేఖ తేదీ 7-7-'15. అది యిది.

'అయ్యా!

దశకుమార చరిత్రమును గూర్చి వీరా యైదవ తేదీ పత్రికలో రాజమండ్రి విద్యార్థి వ్రాసిన దానిని జదివితిని. ఎంతో కష్టపడి పురాతన తాళపత్ర పుస్త కములను సంపాదించి సాహిత్యమును చక్కఁబఱచి వ్యయప్రయాసలకోర్చి పూర్వకవి ప్రణీత గ్రంథము లను నేను ముద్రింపించి ప్రకటింపఁగా నితరులు వాని ననాయాసముగ మరల ముద్రింపించి ప్రకటిం చుచు వచ్చినందున నేనట్టి పుస్తకముల పునర్ముద్రణ మును మానుకొంటిని. అట్టి పుస్తకములలో దశ. కు. చ. యొకటి. ఆ పుస్తకము లొక్క ఫారము తక్కువగా నూఱుప్రతులు నా యొద్దనున్నవి. ఆ పుస్త కము మిగిలిన ఫారమును నాలుగుదినములలో ముద్రిం పించి పుస్తకమును సిద్ధపఱచెదను.

(పుస్తకము వెల పోస్టేజికాక పండ్రెండణాలు)

7—7—'15 కందుకూరి వీరేశలింగము

రాజమహేంద్రవరము'

పంతులుగారు వాగ్దానము చేసినట్లు ముద్రిం చిరో లేదో తెలియదు. ఎకాడమీ సంపాదకులకు వీరేశ లింగం పంతులుగారి ప్రతి దొరకలేదు. నాయొద్దనున్న ప్రతినుండి వారి పీఠికను యథాతథముగా నాంధ్రలోక మున కందించుచున్నాను.

* * *

## ఉపోద్ఘాతము

పూర్వకవు లనేకులు సంస్కృతమునుండి పురా ణేతిహాసములను దెలిఁగించిన రీతిగానే 'యభినవదండి' యను బిరుదనామముగల కేతనార్యుఁడు దండికృత మయిన దశకుమార చరిత్రమును సంస్కృతమునుండి

తెనిఁగించినవాఁడు. ఈ దండికృత వచనకావ్యమును బద్యకావ్యముగాఁ దెనిఁగించుటచేతనే యీతని 'కభినవ దండి'యన్న బిరుదు వచ్చినది. ఇత రాంధ్రకవులవలెనే యితఁడును సంస్కృత కావ్యమును సరిగా నాంధ్రీకరింపక కథాంశమును మాత్రము గైకొని వర్ణనాంశములను విశేషముగా విడిచియు మార్చియుఁ జేర్చియు యథేచ్ఛముగా రచన చేసియున్నాఁడు. ఈతని కవిత్వము కదళీపాకమయి సలక్షణమయి మనోహరముగా నున్నది. ఆంధ్రమునందుఁ గవిబ్రహ్మయని పేరొందిన తిక్కన సోమయాజియే దీనిని మెచ్చుకొన్నప్పుడు నావంటివాఁడు దీనిని శ్లాఘింపబూనుట వృథాయాసము. ఈ దశకుమార చరిత్రమును గూర్చి కవియే తన 'యాంధ్రభాషాభూషణము' నందిట్లు వ్రాసికొనియున్నాఁడు.

ఆ. కవిత చెప్పి యుభయకవిమిత్రు మెప్పింప
నరిది బ్రహ్మకైన నతఁడు మెచ్చఁ
బరగ దశకుమార చరితంబుఁ జెప్పిన
ప్రోడ నన్ను వేఱ పొగడనేల.

దశకుమార చరిత్రము తిక్కన సోమయాజి కంకితము చేయఁబడినది. కాఁబట్టి కేతన, తిక్కన సోమయాజితో సమకాలీనుఁ డగుటచేత నితఁడు పదమూఁడవ శతాబ్దముయొక్క యుత్తరార్థమునందుండిన వాఁడనుట స్పష్టము.

మనదేశమునందలి లిఖిత పుస్తకస్వాములు తమ యొద్దనున్న పుస్తకములను దాము ప్రచురింపక ప్రచురింపఁ దలచుఁకొన్నవారికి వ్రాసికొనుటకైన నియ్యకపోయెడి దురాగతమువలన నీ యుత్తమకావ్యమించుమించుగా నామమాత్రావశేషము కావలసిన గతిని పొందెను. కొన్నిసంవత్సరముల క్రిందట నాంధ్ర దశకుమార చరిత్రము తంజావూరిలోని సరస్వతీ భాండాగారము నందున్నట్లు విని నే నచ్చటికిఁ బోయి చూచి పుస్తకమును వ్రాయించి తెప్పించితిని. ఆ ప్రతి యందుఁ గొన్నిభాగములు శిథిలము లయియున్నవి. సరిచూచుటకయి ప్రత్యంతర మెంత ప్రయత్నము చేసినను నాకు దొరికినదికాదు. అందుచేత నింకను నుపేక్షించినయెడల నీయున్న పుస్తకము కూడ నశింపవచ్చునని భావించి నాచేతనైనట్లుగా లేఖక ప్రమాద జనిత దోషములను సంస్కరించి నాలుగాశ్వాసములు చింతామణి పత్రికలో మూఁడు సంవత్సరముల క్రిందటఁ బ్రకటించినాను. అప్పుడు చింతామణి పత్రిక నిలిచిపోయినందున నిటీవల మిగిలిన భాగమును గూడ సమగ్రముగా వేఱుగా ముద్రింపఁబూనియు నాకుఁ దీఱిక లేకయు దేహారోగ్యము చక్కగా నుండకయు నాలస్యమగుచు వచ్చెను. ఇట్లుండగా నిచ్చట నా పరిచితులైన బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణయ్యగారు నన్నుఁ జూడవచ్చినపుడు తామా గ్రంథమును ముద్రింపించుట కనుకూలముగా వ్రాసి యిచ్చెదమని వాగ్దానముచేసి యెంతో శ్రమచేసి నాయొద్దనున్న ప్రతినను సరించి* పూర్ణముగా వ్రాసి యిచ్చినారు. ఆయన యీ సాయమును చేసి యుండని యెడలఁ బుస్తక ప్రచురమగుట కింకను నాలస్యమయి యుండును. ఈ సాహాయ్యమునకుఁ గృతజ్ఞత గంవాఁడనయి యాయన క నేక వందనములు చేయుచున్నాను. వ్రాత ప్రతియందుఁ గొన్నిచోట్లఁ గొన్ని యక్షరములును, గొన్నిచోట్లఁ గొన్ని పదములును, గొన్ని చోట్లఁ బాద భాగములును, గొన్నిచోట్లఁ బద్యములును బోయియున్నవి. చదువు వారికిఁ గథా సందర్భము తేటపడుటకయి పోయిన భాగములను నేను బూరించినాఁడను. అక్షరములను, జిన్న పదములును, గ్రొత్తగా వేసినచోట గుఱుతులేవియు వేయలేదుగాని రెండు మూఁడు పదములను, పాదభాగములను బూరించిన చోట నా మాటలకు '(          )'కుండలీకరణము చేసియున్నాను.

పంచమాశ్వాసములో 59 వ పుటయందు 19వ పద్యములో నుత్తరార్ధములో మున్పాతిక భాగమును, 20వ పద్యమంతయు, 21 వ పద్యములో 'వింత తథ్యము సువిప్ర' యున్నది తప్పఁ దక్కినదంతయు నాచేఁ జేయబడినది. ఈ ప్రకారముగనే దశమాశ్వాసములో 135వ పుటలో 97 వ పద్యమునందుత్తరార్థమును, 98 వ

* పి. పంతులుగారిట్లు వ్రాసినను 1924 రక్తాక్షి జ్యేష్ఠ మాసపు పత్రికయందు (పుటలు 1–6) ద. కు. చ. లో 'నైదవ యాశ్వాసమునుండియుఁ గడపటికుఁ దన్ముద్రాపకులకు యథాశక్తి మేము మాత్ర కను ముద్రణమునకు సవరించి యిచ్చియుంటిమి.'

పద్యమునందుఁ బూర్వార్ధమును నాచేఁ బూరింపఁబడి నవి. ఏకాదశాశ్వాసములో 151 వ పుటలో 70 వ పద్యమునందర్ధ భాగము, 71 వ పద్యమునం దర్ధ భాగమును నాచే రచయింపఁబడినవి.

గత్యంతరము లేకపోవుటచే నీ ప్రకారముగా నిస్సారములైన మాటలతో, బాధ, పద్య పూరణములు చేయసాహసించిన నా చాపలమును దీనిం జదువువారు మన్నింతురని వేఁడుచున్నాను.

ఇప్పుడయినను దశకుమార చరిత్రము సమగ్ర ముగాఁ దమయొద్ద నున్నవారు నా యందనుగ్రహించి తమ ప్రతిని దయచేసినచో ముద్రితములైన పద్యిపతు లను వెంటనే పంపుటయేకాక ప్రక్షిప్త భాగములను మరల ముద్రింపించినపుడు పద్యిపతులను గూడ వారికిఁ గృతజ్ఞతా పూర్వకముగాఁ బంపెదనని యిందుమూల మున వాగ్దానము చేయుచున్నాను.

చెన్నపురి, పరశువాకము కందుకూరి వీరేశలింగము.
20, వెళ్లాళవీధి.
20 నవంబరు 1901 వ సం.

లక్షలకొలది ద్రవ్యమును సాహిత్య సేవకై వెచ్చించుచు ఏకాడమీవంటి సంస్థవారు పై ప్రతి కోసము గవేషణము చేయకపోవుట యత్యంత విషాద కరము. ప్రాచీనాంధ్ర గ్రంథములను శ్రమపడి సంపా దించి ప్రకటించిన కీర్తిమూర్తులలో బ్రౌనుదొర తరు వాత వీరేశలింగంపంతులుగా రెన్నదగినవారు. మన కోసమై మహనీయుడైన వీరేశలింగంపంతులుగారు గ్రంథ ప్రకటన విషయమై యెట్టి యిడుములఁ బడిరో తెలిసికొని శ్రద్ధాంజలి సమర్పించుటకు బదులు వాంధ్రవిద్వల్లోకమును ఏకాడమీవారు కృతఘ్నతా బద్ధులను గావించినారు.

ఇక నేటి ముద్రణ సంపాదకత్వ విషయమును గూర్చి:—

1. దశకుమార చరిత్రకు ఒకేఒక తాళపత్ర ప్రతి నేటివరకు లభ్యమైనది. అది తంజావూరు పుస్తకశాలలో గలదు. దాని ననుసరించి వ్రాయించిన వ్రాతప్రతి కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్ కార్యా లయమున గలదు.

2. 1901 ముద్రితప్రతి తంజావూరు ప్రతికి ప్రతిక. తాళపత్ర గ్రంథములోని లుప్తభాగ ములను కం. వీ. పంతులుగారు పూరించిరి. కాని సప్తమాశ్వాసాంతమాలినిని గాని గ్రంథాంత పద్యము లనుగాని వీ. పం.గారు పూరించక వదలిరి.

3. 1925 లో ముద్రించిన ప్రతికి 1901 ముద్రిత ప్రతి ఆం. సా. ప. కాకినాడ వ్రాతప్రతి యాధారములు. మూలతాళపత్రప్రతికి వ్రాత ప్రతి ప్రతిక గాన రెంటియందును లుప్తభాగములు సమాన ములు. వావిళ్లవారికి శ్రీ మద్దులపల్లివారు స్వయముగా లుప్తభాగములను పూరించుటయేగాక నాశ్వాసాంత పద్యములనుకూడ వ్రాసి జేర్చియుందురు. వావిళ్లవారి ముద్రణమునకు ముందు అనగా 1924 భారతి పత్రికలో శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు దశ కుమార చరిత్ర పాఠములను (ముద్రిత ప్రతి - 1901 లోని) విమర్శించిరి. వీ. వ. ప్రతిలో లేని రెండు పద్యములనుగూడ చూపిరి. బహుశః దీనిని బట్టియే వావిళ్లవారు ద. చ. పునర్ముద్రణావశ్యకతను గుర్తించి శ్రీ మద్దులపల్లివారిచే పరిష్కరింపచేసి ప్రక టించిరి.

4. ఏకాడమీ సంపాదకులకు 1901 వ ముద్రణము లభించని కారణమున 1925 వావిళ్ల ముద్రణమునే (అధోజ్ఞాపికలతోసహా) ముద్రణమున కిచ్చిరి. వీరి సంపాదకత్వ మిందేమియు గోచరించుట లేదు. సంవీక్షాకర్తల కొన్ని వాక్యములిట విమర్శనీయ ములు—

(i) 'శ్రీ మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు విద్వాంసులు— పరిష్కారానుభవముకలవారు ఈ గ్రంథాన్ని తాళపత్ర ప్రతితోను................ పూరించినవారు శ్రీ శాస్త్రిగారే' పుట (పుట—51. ఏకా. ము. 1967) అనియున్నది. కాని 50 వ పుటలో (1901) అముద్రితప్రతినీ, ఆంధ్రసాహిత్య పరి షత్తులోని వ్రాతప్రతినీ ఆధారముగా తీసికొని బ్ర. శ్రీ.

మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు.........
పరిష్కరించి యిచ్చినట్లున్నూ' కలదు. శ్రీ మద్దుల
పల్లివారు పరిశీలించినది వ్రాతప్రతిగాని తాళపత్రప్రతి
గాదని శేషాద్రిరమణ కవుల 'తొలిపలుకు' (1925)
వల్లనే స్పష్టమగుచుండగా సంపీక్షాకర్తలెట్లు పైవాక్య
ములను సమన్వయింతురో!! ఈ సందిగ్ధము శ్రీమద్దుల
పల్లివారే స్వయముగా పత్రికా ముఖముననే తెల్పినచో
కృతజ్ఞుడను.

(ii) ప్ర. ఆ. 73 వ పద్యము:-

''ఇమ్మడి మనుమని తమ్ముఁడు......ముల్లో
కములన్!'

ఈ పద్యము శ్రీ వీ. వం. గారి ప్రతిలో
కానరాదని 'అథోజ్ఞాపిక'. సంపీక్షాకర్తలకు 1901 వ
ముద్రణము (కం. వీ) దొరకలేదు గదా! లేదని
యెట్లు వ్రాయుదురు? ఈ విషయము 1925
ప్రతిలో (వావిళ్ల) 73 వ పద్యము (ఇమ్మడి) వద్ద
లేదుగదా!! ఇక్కడి కెట్లు వచ్చినది? దీనికి సమా
ధానమును సంపీక్షాకర్త లివ్వవలసిన బాధ తగలదు.
వాస్తవమునకు పై పద్యము 1901 (కం. వీ)
ప్రతిలో గలదు.

నాకు తోచిన విషయములు విద్వల్లోకమునకు
వెల్లడించితిని. ఇందలి బాగోగులమ పరీక్షించుటకు
వారే సమర్థులు. ప్రాచీనాంధ్ర గ్రంథముద్రణ, పరి
ష్కరణల విషయమై మానవల్లి వారి వాక్యము నిట
నుదహరించుచు నీ వ్యాసమును ముగించుచున్నాను.

'ప్రాచీనాంధ్ర గ్రంథములలో నొకటి రెండు
మాతృకలతో ముద్రింపబడియుండి సమస్త గ్రంథ
ములను శుద్ధములు కావని మా యభిప్రాయము...
ఎఱ్ఱాప్రెగ్గడ నృసింహ పురాణము, కేయూరబాహు
చరిత్ర, ఉత్తర హరివంశము, దశకుమార చరిత్రము,
క్రీడాభిరామము, భీమఖండము మున్నగునవి యబద్ధ
పాఠ పూరితము లనుటలో సందేహము లేదు. (1924
జూన్ భారతి.)



# గా ట పి

శ్రీ సోమసుందర్

మండిసరుకువంటి సౌందర్యం
ముస్తాబయి నిల్చున్నది బజారులో
ఉరోజ మధ్యస్థమైన కలుగులోంచి
బుభుక్షోరగం పడగెత్తి ఆడుతోంది.

అన్యాయం తాలింఖానాలో
వ్యాయామం చేస్తోంది న్యాయం
గానం కడుపు గడవక
ధ్యానం పణంగా పెడుతోంది.

బాధలతో నిండిన బ్రతుకు
వానలో తడిసిన గొంగళీపురుగు
భారంగా నడుస్తోంది; పొంగిన నురుగు
ప్రమాతీత పదార్థంలా సాక్షాత్కరిస్తోంది.

నా జాతి స్వప్నాలు పరిపక్వం కాకుండా
చిట్లిపోయిన పక్షిగుడ్లు
ప్రగతీపథంనిండా పరపీడకులు
పరచిన పీడకలల నీడలు.

ద్యూతవ్యసనంలో చిక్కుకున్న
నేటి ప్రజాపాలకుడైన నలుడ్ని
అధికార వ్యామోహ వ్యాజమనే
కర్కోటకుడు కాటు వేశాడు!

రూపు చెడి
పచ్చిభౌతిక వాదంలా
వికారంగా మిగిలి
దురాశా వ్యాఘ్రవ్యాళ గండభేరుండ

నిరంతరోగ్రాటవీ వ్యగ్రుడై
త్యాగాల పూర్వసువాసనల్ని
ప్రసారం చేస్తున్నాడు—
స్వార్థలోభగ్రస్తుడైన బాహుకుడు!

# శ్రీ మరింగంటి వేంకటనృసింహాచార్యులు వారి

# తాలాంకనందనీ పరిణయము

## శ్రీ శేషం రామానుజాచార్యులు

త్తమ ప్రబంధ వర్ణన ధోరణిలో కవిత్వము నడిపి సరస హాస్యచతురోక్తులంగూడి చిత్రకవిత్వరీతులను సర్వంకష ప్రౌఢిమచే జతపరచి నిగూఢ తత్త్వభావములు పామరులకు సైతము అర్థమగుటకై హృద్యములగు సందర్భముల కలిమి నడిపిన రీతులు సహజత్వమును స్ఫురింపజేయు మహాకవీశులు మరింగంటి వారి వంశమం దుద్భవిల్లిరి. అందు శతఘంటావధానులు, శతాధిక గ్రంథకర్తలు, చిత్రకవిత్వ ప్రబంధ నిర్మాతలు గలరు. వీరి వంశము సుకృతమైనది. శ్రీ రంగేశ్వరుని వాక్యమువలన ఈ వంశీయులు మరింగంటివారైరట. ప్రౌఢరచనాధురీణుడగు 'తాలాంక నందనీ పరిణయము' కర్తయైన మరింగంటి నరసింహాచార్యులు వారి వంశముగూర్చి నుడివిన యొక చిన్న కథ నిట యుదాహరింతును. శ్రీ రామానుజాచార్యుల వారును కురుశేఖర సాధుభట్టారకులవారును శ్రీరంగములోని రంగనాధుని సేవించుటకై వెళ్ళిరట. అప్పుడా రంగేశుడు యతిరాజును జూచి యిట్లు పలికెనట.

'కంటిమి మిము కూరేశుల
గంటిమి మీవెంట వచ్చు ఘను లెవరో మరిం
గంటిమని పల్కినది మా
కింటికి పేరుంట నా మహిన్ రహికెక్కెన్.

అని తన స్వీకృతమయిన 'తాలాంకనందినీ పరిణయము'లో పేర్కొన్నాడు. ఈ గ్రంథము సంస్కృత సమాసభూయిష్టము. ఇది సుమారు క్రీ. శ. 1872 ప్రాంతమున ముగింపబడినదని 'గోలకొండ కవుల సంచిక'ద్వారా పేర్కొనవచ్చును. శశిరేఖ, అభిమన్యుల వివాహకథ యిందు చక్కగ గూర్పబడినది. మేనరికపు వివాహవ్యవస్థల నిందు చక్కగా చూపించినారు. తాలాంకనందిని యనగా శశిరేఖ. తాలాంకుడు బలరాముడు.

'నీలాంబరో రౌహిణేయస్తాలాంకో ముసలీహలీ' అని అమరము. ఇందు అన్న కుమార్తెను తన కొడుకునకు చేసుకొనవలెనని సుభద్ర యభిలషించును. ఇట్టి సంబంధములెల్ల ఆంధ్ర కుటుంబీకులకు పరిచితమే. ఈ కథ నాధారముగా జేసికొని గ్రంథకర్త షష్ఠ్యాశ్వాస ప్రబంధము నిర్మించెను. ఇతని కవిత్వమం దనేక యమక శ్లేషాలంకారములు ప్రయోగములు కానబడును. అర్థాంతరన్యాసములు కన్పించును. యమకమన్న ప్రీతి మెండితనికి. నారద పాత్రను బహు చమత్కృతిగా వర్ణించినారు పాండవు లైశ్వర్యహీనులని దుర్యోధనుని సంబంధము కోరవగినదనియు నచ్చజెప్పి బలరాముని మనస్సు త్రిప్పెను. శశిరేఖను లక్ష్మణ కుమారున కిచ్చి పెండ్లిచేయుటకు సర్వ సన్నాహములు జరుగుచుండగా, అభిమానవతియైన సుభద్ర సోదరునితో నిష్ఠురములాడి 'పుట్టిల్లు' విడిచి కుమారునితో పాండవులున్న అడవికి బయలుదేరుట— ఇత్యాది ఘట్టముల ఆంధ్ర గృహస్థుల యిండ్లలో జరుగు సన్నివేశముల మనమునం దుంచుకొని యీ భాగమును కవి మిక్కిలి హృదయంగముగా చిత్రించెను. లక్ష్మణ కుమారుని వ్యంగ్యచిత్రీకరణ అతిసహజముగా గూర్చినారు. 'లక్ష్మణుడు గాడు వీ డవలక్షణుండ'ని చమత్కారముగా నుడివిరి. ఘటోత్కచునకు ఈ ప్రణయవృత్తాంతము తెలిసి తన మాయాశక్తిచే శశిరేఖ నెత్తుకొనివచ్చి యభిమన్యుని పెండ్లి చేయించును. గౌరవభంగముకాకుండ ఘటోత్కచుని పాత్రకు వన్నె చేకూర్చుటకై యాతని మాయాబలముచే 'మరదలు ముట్టకూడ'దని మంచము

తోడనె లేవనెత్తినాడట. ఎంత రాక్షస సంభూతు డైనా, పాండవ సాంగత్యముచే కలిగిన నైతికవర్తన యందు ద్యోతకమగుచున్నది.

వచన రచనలోను, వీ రేవబంధకవికి తీసిపోరు. ఘటోత్కచుని మాయాజాల యుద్ధవర్ణన ఫక్కీ, ఎల్లన రణరంగమును స్ఫురింపజేయును. ప్రాసక్తిక ముగా యమక శ్లేషాలంకార ప్రయోగము నడిచినది.

విరహవర్ణనలలో చంద్ర, మన్మథ దూషణలు కన్పించును. సౌభద్రుని రాక లేమిచే నైరాశ్యము చెందిన శశిరేఖ కుసుమాస్త్రుని బాధల తాళజాలక, మన్మధుని దూషించును. 'తుంటలైన నీ విల్లు ధూళి లోన నణంగె' అను పద్యము ఉదాహృతము. ముద్దు లొలికెడి సుకుమారమైన రచనకూడ వీరు సాగింతురు.

ఎండకన్నును నీడ కన్నెరుగకుండ
పాదముల ముద్దరాలొత్త బరగు సతికి
ఎండకన్నును నీడ కన్నేకమగుచు
పాదముల ముద్దరాలొత్త పధిగమించె.

ఘోరదుర్గాటవిలో సుభద్రాభిమన్యులు పయ నించుచు చూచిన దృశ్యముల నించుక నెట్లు చిత్రిం చెనో పరిశీలింతుము.

ఈ రీతి నర్ధరాత్రిని
ఘోరాటవిలోన జొచ్చి కొడుకుం దాన
య్యేరులు, పల్లేరులు, న
ల్లేరులు పాదలెల్ల గడిచె యేగటవేళన్.

ఇట్లు గడచి నొక కొంత విశ్రాంతిపొంది, యీ రాకుమారుడు గాంచిన దృశ్యములను చిత్రీకరణ మొనర్చిన విధమున ట్లే చూతము. ఉత్సాహవృత్తములో వారిట ప్రదర్శించిన ఔచిత్యము ప్రశంసనీయమే. ఇందలి వస్తువులన్నియు చతుష్పధములవే.

ఉ. 'రాకుమార శేఖరుం డరణ్య భూమిగాంచె
భల్లూకముల్ వనౌకముల్,
జలూకముల్, బలాకముల్ ఘూకముల్,
మహాకులోగ్రకూకముల్, బలాకముల్
దాకి మూకలై చికాకు
జకొనంగ చె కొనెన్.

జీవజంతువులేకాక ఆతడు చూచిన వవావళుల నించుక చిత్రిత మొనర్చి దృశ్యమానమోద మొనర్చు చున్నాడు.

చనిచని కాంచె ముందట
రసాలతమాల విశాలసాల
చందన కృతమాల కౌశుకర
ద్రుధుకపిత్థ కురంట కాభయార్జున
వకుళామ్ల పీత నఖరోచన
తాల కదంబ నింబ కాంచన
కరవీర...జలజైత్ర వట
ప్రముఖద్రుమావళుల్.

ఈ రీతిగా జనగా జనగా తూరుపు తెల్లవారిన దట. పద్మములు వికసించినవట. శరము లమ్ములు ధరించి వీరవిక్రమ సాహసముతో విపినములు, శైల ములు, వాహినులు దాటి ఘటోత్కచా శ్రమము చేరినాడట. రమణీయ మందిరారామ సౌఖ్యములు పొందుతల్లి ఘోరాటవిలో సంచరించవలసివచ్చె, సరో వర క్రీడాసుఖము వీడి బురదలో తిరుగాడవలసె, కమనీయతరతూలికాతల్పముల సుఖించు జనని చేటుల దర్భల సెజ్జపై శయనించగలిగె, కాంచన మయడోలికా నిద్రలు తొలగి కంటకస్థలిపై నిద్రించ సాగె, మంజుల మనోహరమైన శుక పిక శారికావళుల తీయందనపు పాటలు వినవేర్చిన, యింతి కఠినతర శరభ శార్దూల ఘోషణముల వినవాయె గదా, విధికృత మేమందు నంచు తన మామచేసిన యపకృతి మరువ రాదు గదా యనుచు చింతాక్రాంతుడై దూరపిల్లుచు అమిత మార్గాయాస మూహించి, తల్లికడ శయనించిన శశిరేఖను మనమునందు తలంచుచు, పిన్నతనంబు నుండి అధికమైన ప్రేమచే ముచ్చటలాడి తిరుగాడి తిమిగదా; కన్నెతనంబువీడి వయసెన్నడువచ్చి మన్నన తోడ గైకొందునో, నను కన్నునెడ సేయ న్యాయమా! యని మదనాయాసము కల్గి కుందిపోవును.

అభిమన్యునియెడ కవి ప్రవర్శించిన మనోభావ వ్యక్తీకరణము, విరహతాపాతిశయము మేళవించి,యాతని యెడ నాటకీకరణము ప్రదర్శ నౌచిత్యము నాపాదించి చక్కని రసపుష్టి కలిగించినాడు.

వీరి రచనలో కొన్ని కొన్ని 'విజయ విలాసము' కళాపూర్ణోదయ మందలి పద్యముల స్ఫురించుచుండును.

గొప్పనీలవుకుప్ప లప్పుమోపరితెప్ప
అప్పడంతుక...కప్పుకొప్పు
మరువాలుగమివోలు మరివాలుగలిసేలు
కళకీలు చెలివాలు గనులడాలు
కంబు బింకంబు పోగంబు పొక్కంబు ని
క్కంబు బింబోష్ఠి కంఠంబు .డంబు
కల్కిచిల్కలికుల్కు మెల్క క్రపవుపల్కు
కుల్కుతేనియ...బల్కుచిల్కు
తమ్ములద్దమ్ములను గ్రమ్మ నెమ్మొగంబు
మించు క్రొమ్మెరాచు మించు నెమ్మెనిసంచు
జక్కవలకెక్కు నుతికెక్కు చన్నుదోయి

శృంగార అహల్యా సంక్రందనమందలి ప్రథమ, తృతీయా శ్వాసములలోని 'కన్నులు జేరలన్ గొలు వగా' అనునది, 'ఏల సృజించె' అనునవి సామ్యములు— ఇట్లే అనేక తెనుగు ప్రబంధములతోడి సామ్యముగల దీ చక్కని ప్రబంధము.

ఈ ప్రబంధమందలి చతుర్థాశ్వాసము ప్రాణము వంటిది. ముఖ్యమైన కథ, పాత్రలు, వర్ణనలు అన్నీ యిందులోనే కూర్పబడినవి. ఘటోత్కచుని మాయ, మాయా శశిరేఖ, వివాహ ఘట్టములు మొదలగునవి వర్ణితములు. బలరాముని కూతురగు శశిరేఖ ఈ కవి గారికి నోముగన్న మాత్రనే నామము శశిరేఖ యనుచు దోచెనని యనుట ఎంతయు సమయస్ఫూర్తి సూచి తము. వీరి కవితయందు సమసోక్తులు, జాతీయ ములు హితబోధ అంతటా నిండియుండును. ప్రబంధ నాయికలకు ప్రియుని సమాగమ నిరీక్షణయందు, ప్రియభావనలు వ్యక్త మొనర్చుటకు, తెల్పుటకు యొక దూత్యవస్తువు కావలెను. ఇందు ఈ శశిరేఖకు చిలుక యుపకరించును. హృద్యమైన రచనా ధోర ణిలో సాగిన 'శుకదూత్యము' యందలి చక్కని ఘట్టము. అభిమన్యుడు పంపిన సందేశములో, 'తను నెడబాసిన మొదల్......తదేక విలోకన జృంభణ మున నున్నవాడ ననుమా అనుమానములేక కీరమా' అని విన్నవించిన తీరు ఏ రసికునకైనను మనస్సు చలింపక పోదు. అమరప్రేమానుభూతి వారి సొత్తు. వీరు తెలుగు పలుకుబడులలో గమసరి రచనల యందు సిద్ధహస్తులు. కౌరవ పాండవుల మధ్య వియ్యమునకు పురికొన్న తాలాంకుని రాధారమణుడు సుభద్ర యెంత వారించినను వినడు వారి నెయ్యమే గొప్పది. సామ్రాజ్యాధిపత్యము, యిష్టభోగ సంపద కలిమిచెలిమి గలవాడు రారాజు అని విఱ్ఱవీగును. నయోక్తుల చెల్లెలిమాట చెవి పెట్టడు. కౌరవులు మాత్రము చుట్టములు గారా, అని ఎత్తిపొడుచును. సుభద్ర కమలనాభుని చెంతకు వెళ్లి పాండవుల బాధ్యత యొక్కనాటితో తీరునదికాదుకదా; అన్నా! 'తగునా, భవద్రగజాడి ట్లాగు నాయము దప్పి కన్య నన్యుల కిడ మేలగునా, నేటికి మీ కున్, తెగునా పాండవులతో నధికబాంధవ్య ముల్' అని బ్రతిమాలను అయినను కృష్ణుని మాటయు సైతము తాలాంకుడు తిరస్కరించును. పైగా దురుసుగా మాటలాడును.

'నిష్కారణ భక్ష్యభోజ్యములుకై నెడ ద్రోయుచు చేదుకాయలున్, గోరి భుజించునట్లు లొసగూడిన'దట పాండవుల బాంధవ్యము. ఇకను 'దుర్వార గహనవన్యాగ్రచరు'లట పాండవులు. కావున వారికి నా కూతు నివ్వనని నిష్కర్షగా చెప్పినాడు. ఇట్లు ఆంధ్ర కుటుంబినుల యిండ్లలో జరుగు వివాహ వ్యవస్థ యందలి అగచాట్లు సంభాషణరీతిలో చక్కగా తెలియ జేసినాడు. సంభాషణలయందు నిగూఢ తత్త్వమును స్ఫురింపజేయును. ఈ విధముగా హలాయుధుచే నిరా కరింపబడిన సుభద్ర దురంతచింతిత స్వాంతయై పాయంతనమున అలుకచెంది, యొక చీకటింట; 'శుద్ధాంతము జేరి యొక్క కఠినావని కంకటిశయ్యపైని, మేనంతయు జేర్చి, లోవెతల నేరికి దెల్పక' బాధ బడినదట. లోగ సిలి చీకటింటికడ కంకటి పైన శయినించి పొందిన విషాదవేదనాభరితయైన సత్యభామ యిందు స్ఫురింపకపోదు.

### శుకదూత్యము :

పంచమాశ్వాసములో మాయాశశిరేఖ వివా హము, కౌరవుల శృంగభంగము, ఘటోత్కచుని

ఇంద్రజాలిక విద్యా ప్రదర్శనము చాలా చక్కగా చిత్రించబడినది. ఇందు మరియొక్క ముఖ్యమైన ఘట్టము శుకదూత్యము: శశిరేఖ తాను పెంచిన చిలుకతో, ఎచ్చటనైన గంటివా! అర్జును సుతుని, కన్నచో తనికి నా విరహబాధను గూర్చి చెప్పుమని అట్లు చెప్పిన, 'పానకంబును వడపప్పు పంచదార కలిపి బంతి సాగించి విందొన రింతు చిలుక' అని ఫలకాంక్ష తెలియజేయును. అట్లే అది రివ్వున యెగసి, ఘటోత్కచు నాశ్రమములో నున్న అభిమన్యుని చూచి తిన్నగ ముచ్చటించి శశిరేఖ బాధల తెలియజేయును. విరహభ్రాంతయై విప్రలంభ శృంగారము పొందిన తీరును, లక్షణము లను తెలియజేయును.

'అంగన నిన్ను చిత్రపట
మందు లిఖించు, లిఖించి కోర్కెలు
ప్పొంగగ జూచు, జూచి వలపుం
గొని మెచ్చును, మెచ్చి నీ పరి
ష్వంగము కోరు, కోరి వల
పంతల జింతిలు, చింతిలన్ మన
స్సంగతి నూర్చు, నూర్చి సర
సంబు విరంబుగ దాన నూగొనన్.'

ఇది విని అభిమన్యుడు గూడ 'నేనట్లే బాధ పడుచున్నాను. ఇదిగో నేడే లగ్నమనగా నే వత్తునని' సందేశమంపును. ఈ సందేశము గొని చిలుక కఠిన శిలా వృత భూస్థలి శయనించియున్న ప్రియుని మనోవేదనను శశిరేఖకు వ్యక్తీకరించును.'నిద్దురలేకతపించుచు ఎప్పుడు నీ రూపమునే తలంచుచు, సౌఖ్యముల త్యజించుచు వియోగసాగరమునబడి నిను బోలు సతినెందు గాన వంచు నీరు నించిన కను లప్పళించి, నీకొరకె తపించు చున్నాడని' అతని సందేశము గొనివచ్చును. ఈ విధ ముగా ప్రియులవద్ద రాయబారము నెరపిన 'చిలుక' పాత్ర నతిసమర్థముగా ప్రవేశపెట్టి ఫలవంతముం జేసినాడు.

ఇంతేకాక ఆ చిలుక సర్వజ్ఞమట. బంగరు చిలుకా నీ వలె నింగితము లెరుంగ జాణలెవ్వరు? నీ వాక్సంగతుల నేర్పు దనరకురంగాక్షికి దెల్పు పోయిరమ్మని పంపగా రివ్వున నెగసి యవ్వనజాక్షి సౌధమందు డిగ్గినదట. అత్యంత కుతూహల సంజనితాంతరంగయై యా కురంగనయన, ఓయి! శుకరాజ వచ్చితివా, యెచ్చట గంటి వర్జునాత్మజు నీవున్, బోయిన కార్యమెల్ల కాయో పండో వచింపుమని వేడుకొనినది. ఘటోత్కచు మందిరమున నిద్రించుచున్నవాడు ఎప్పుడు నీ హృదయ మందే లగ్నమయి యున్నవాడు—అని శుకము చెప్పి నది. అంతేగాక విరహభ్రాంతి సూచించినది. విప్రలంభ శృంగారముకూడ ద్యోతకమగును. 'కనునిద్దుర లేక తపించువాడు, సౌఖ్యముం త్యజించును. నిను బోలు సతిన్ గననంచు నీరునించిన కనులప్పళించు చిత్తరువందునిల్చి నిన్నే తలంచు' నని విన్నవించినది. ఇట్లే రాయబారములు అనేక ప్రబంధములందు కన్పించును. హంస, చిలుక, తుమ్మెద, మేఘములు దూతలు. వుణికి పుచ్చుకొన్న ప్రబంధ రచన వీరిది.

రౌద్రరసము నందలి వీరి ప్రతిభ నన్నయగారి భీముని స్ఫురింపజేయును. ప్రకటిత కోపవేగమున అను పద్యము రౌద్రావేశమున దంత్య ప్రస్ఫుట మగును.

'పెటపెట పండ్లు గీటుచును
భీమ పరాక్రమ కంఠకాహళా
ర్భటి దశదిక్తటుల్ బెటిలి
బద్దలుగాగ హుటాహుటిన్ స్వదో
స్తటి పటుఘాటనల్ సెలగ
తర్జన భర్త్సన నూపుచున్నట
న్నిటలతటాక్షు నింబలెను
విర్భయుడై చనుదెంచి యిట్లనున్.'

కోప భయ ప్రకట సూచితమగు ట కార ప్రయోగమువలనను దంత్యముల ఉచ్చారణ వలన కోప స్ఫురణమగును.

కవి విశ్వశ్రేయోభిలాషి. స్వల్పాంశమునైనను భావానుసరణముగను సమయోచితముగను వర్ణించి [illegible]ధక శైలిలో తన రచన కావించును. కావ్య

ములతో హితబోధ కావించును. ఇతడు నైజాము రాష్ట్ర వాసులగుటచే ప్రాసక్తికముగా, ఉర్దూ భాషాపదములు ప్రయోగించెను.

అచటచ్చట జాతీయము లుపయోగించి కావ్యమున ఔచిత్యము కాపాడిరి. 'వేళకు కూర లేక పలవించెడి వానికి వంటయింటి కుందేలును గాంచినట్లురుగుదెంచి'నాడట భీమసుతుడు. అభిమన్యు ఘటోత్కచుల యుద్ధవర్ణనము చక్కగా చిత్రీకరింపబడినది. ఇతడు భారత కవులను అనుసరించియు స్వయముగా ప్రతిభనుగూడ చూపినాడు. వారిరువురును సమముగా దేహము జల్లెడయగునట్లు శరాసనముల వేసికొనిరట. 'నరచాపప్రవిముక్త దారుణ బృహన్నారాచ ధారల'ను పద్యమునకు చక్కగా ప్రతిబింబించునట్లు 'ఈ రనముల్ దొలంగక' అనుపద్యము చిత్రించినారు. రణరంగమున భుజపరాక్రమోన్నతిచే యిరువురు సములు కాగా, శరఘాటి కెరలిన శోణితాంచితశరీరములు 'భూరి వసంతకాలమున పూచిన మోదుగుపూవులతో' యునట్లున్నవట. చక్కని యుపమానము. దేహమంతయు రక్తసిక్తము. ఇదియుగాక వారిరువురు వ్యాయామకర్కశ స్థిరకాయులు. నన్నయగారి మల్లయుద్ధ వర్ణనము నిందు స్ఫురింపకపోదు. భీమజరాసంధులు, సింహ గజేంద్రములట్లు వజ్ర పర్వతముల యట్లు పోరాటము సలుపగా, ఇచట విజయనందనుడు, భీమసుతుడు.

పొరి పొరి బెబ్బులు లట్టుల
నిరువురు బలములను దక్కువెక్కువలేకన్—
కరికరియున్ గిరిగిరియున్
హరిహరియున్ బెనగినట్లు వాహవమయ్యెన్.

(చ— ఆ - 287 పద్యము).

వారిరువురి ఘోర సమరము నానాటికి హెచ్చుచుండగా ప్రళయ ఝంఝా మారుతముతో, లయకాయ దండధరుని అట్టహాసముతో యనునట్లు పోరాడిరట.

'ధరణితలంబు దద్దరిలె
తారలుగూలె నభంబు దిర్దిరన్
దిరిగె సుధాంశు భాస్కరుల
దీధితి క్రుంగెను బర్దలై దిశల్
దెరిచెను పచ్చిగోడల గ
తిన్ జతురంబుధు లింకె సంద్రులున్
మొరసె నభంబునున్ సురస
మూహము లార్చె విమాన పంక్తిత
త్తరమున దుల్లె వాయువు భ్రమ
వంబణగెన్ ప్రళయాంత సూచనన్'

ఇతని కవితలో ఎన్నియో ప్రత్యేకకూర్పులు కన్పించును. బంధకవితలు, గర్భమధ కవిత లున్నవి. తమ సహజపాండితీ గరిమచే 'సోష్ఠ్య త్ర్యక్షర కందము' రచించి ప్రతిభ వెలయించెను.

మాపో (పా) భూభామామా
మాపై ప్రేమ బాము మాపుమి ప్రాపై
మీ ప్రేమ బాప మీపై
మా పాపపు మోపు బాపుమా మా బాపూ!

శశిరేఖ ప్రియు నెడబాసిన ఘట్టమున విరహ భ్రాంతి సూచించుచు, చంద్రమన్మథ దూషణలు కావించిన సందర్భమున గూర్చిన పద్యములు చాలా చక్కగా నున్నవి. ఇందు వంశక్రమానుక్రమణిక, ఋతువర్ణనలు, వచన రచన, ఫలశ్రుతి మున్నగున వన్నియు గూర్పబడినవి. ఇది చక్కని రసవత్ప్రబంధము.

ఈ కవి ఆశ్వాసాంతమున వేంకటాచలపతి వరప్రసాద కరుణాలబ్ధుడనని-భావాచార్యుల పుత్రుడనని-మౌద్గల్యగోత్రుడనని తెలిపియున్నాడు. ఈ ప్రబంధముదు గూర్చి యింకను ఎన్నో అంశములను వ్యాసవిస్తరణ భీతిచే స్పృశించలేదు. ఆశ్వాసాంతమున వివిధవృత్తముల నుపయోగించినాడు తమను గురించి

'ఇది శ్రీశేషకుభృచ్ఛిరస్తటకుటీ
రేచ్ఛానువర్తి ప్రథా
మృదు శ్రీవాసగురుప్రసాద కలనా
మేయాఢ్య మౌద్గల్య వం

శ్రీ దయా సంయుత భావనార్యజని శ
శ్వచ్ఛీ నృసింహార్య మో
హద తాలాంక సునందనోద్వహ చతు
ర్థాశ్వాస మొప్పున్ భువిన్'

(చ - ఆ - 353 - ప)

అని చతుర్థాశ్వాసాంతమున తెలుపుకున్నాడు

ఇట్టి అత్యంతప్రామాణికమైన ప్రబంధమును గుర్తించి ఆంధ్ర సారస్వతపరిషత్తు లేక సాహిత్య అకాడెమీలాంటి సంస్థలు గైకొని ప్రాచుర్యభాగ్యము కల్పించి మన (మా జిల్లా) ప్రాచీన తాళపత్ర గ్రంథాల దుస్థితి తొలగించి, వాని పునరుజ్జీవనమునకు పూను కొనిన సాహితీసేవ యొనర్చి ఆదర్శవంతులగుదురని విశ్వసించుచున్నాను.



# గ్రంథ విమర్శలు

## వేద సమీక్షా

సంపాదకులు : డాక్టరు ఇ. ఆర్. శ్రీకృష్ణశర్మ ప్రకటన కర్తలు : శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ, తిరుపతి. రాయలు 1/4 సైజు, పేజీలు 176 హాఫ్ కాలికో. వెల రు. 6—00.

ఇది 1964 ఫిబ్రవరిలో తిరుపతిలో జరిపిన వేదసంబంధమైన సెమినార్‌లో చదివిన వ్యాసముల సంకలన గ్రంథము. వ్యాసకర్త లందరును వేదవిద్వాంసులు. వారిలో కొందరు ప్రాచీనపద్ధతి వారు, మరి కొందరు పాశ్చాత్యరీతులను అవగాహనము చేసికున్న ఆధునిక పద్ధతి విద్వాంసులు. ప్రాచీన విద్వాంసుల వ్యాసములు సంస్కృతభాషలో దేవనాగరలిపిలో 44 పేజీలలోనను, ఆధునిక విద్వాంసులవి ఆంగ్లభాషలో తక్కినభాగమందును గలవు. ఈ రెండింటి సమ్మేళనము వలన ప్రాచీన పద్ధతులును నవీన పద్ధతులును ఏ ఏ మార్గములలో ఉపయోగపడునో, రెండిటి అవగాహనము వేదస్వరూపము పరిపూర్ణముగా గ్రహించుటకు ఎంత యవసరమో బోధపడును. వేదమందు శ్రద్ధాభక్తులు కలవారందరును ఈ గ్రంథరాజము ఆమూలాగ్రముగా పఠించి మననము చేయదగినది. ఆంధ్ర, మదరాసు, కేరళ, మైసూరు రాష్ట్రములలోని కళాశాలలనుండియు విశ్వవిద్యాలయములనుండియు ఉద్దండ వేద పండితులు సమావేశములో పాల్గొని కృతార్థులైరి. అందుచే ఈ వ్యాసములో వైవిధ్యమెంతయో ప్రదర్శింపబడినది. డాక్టరు కె. సంపాతిరావుగారు ప్రారంభోపన్యాసములో 'మనము చూడదలచుకొన్నది ఏదైనను వేదములో చూడవచ్చును. కెమిస్ట్రీ, ఆర్థిక జ్ఞానము, తత్త్వవిచారము - అన్నియు చూడదగును.' అనుచు కొంత హాస్య ధోరణితో ప్రారంభించిరి కాని ఆయా వ్యాసములు పఠించినప్పుడు, వ్యాసకర్తలు తాము చూడదలచినది వేదములో చూచుటకు ప్రయత్నింపలేదనియు, దేనినైనను వేదములో ఉన్నంతమాత్రమే శాస్త్రీయ దృక్పథముతో ప్రదర్శించిరనియు స్పష్టపడగలదు.

వేదోచ్చారణము అంతట నొకరీతిగానే ఉండునను ప్రతీతి కలదు. కాని ఈ సమావేశములో వేద మంత్రోచ్చారణములో గూడ గోదావరీ మండలము ఇత్యాది ప్రాంతములలోనివారి పద్ధతికిని, కేరళ విద్వాంసుల పద్ధతికిని ఎంతో తారతమ్య మున్నదని స్పష్టపడినది. అందులో ముఖ్యముగా సామవేద పాఠములో కేరళ విద్వాంసులకును తక్కిన ప్రాంతముల విద్వాంసులకును ఎంతో భేదము వ్యక్తమయినది. ఆ విషయమునే 'కేరళేషు వేదాధ్యయన సంప్రదాయః' అను వ్యాసములో శ్రీ ఇట్టిరవి నంబూతిరి స్పష్టముగా వివరించిరి. వారు సామవేదము జైమినీయశాఖలో పండితాగ్రేసరులేకాక శ్రౌతమర్యాదలు నేర్చిన అరుదైన విద్వాంసులు. సామవేద ప్రచారము ఇప్పటికి కొలది కాలము క్రిందటివరకు కేరళలో విస్తారముగా ఉండెడిది. తమశాఖ వేదమును అధ్యయనము చేయనిది ఇతర శాస్త్రములు అధ్యయనము చేసెడివారు కాదు. వారి వ్యాసములో ఋగ్వేదము, యజుర్వేదము విషయములో కేరళ పాఠమునకును ఇతర ప్రాంతములవారి పాఠమునకును ఎక్కువ భేదము కనుపింపలేదు కాని సామపాఠమందు మహదంతరము గోచరించినదని వక్కాణించిరి. సామపాఠములో కేరళీయులలో కంపము అధికతరమై యుండగా, ఇతర ప్రాంతీయుల పాఠములో గీతస్వరములైన షడ్జాదుల కెక్కువ ప్రాధాన్యము చూపబడినది. కేరళీయులు కేవలము మధ్యమస్వరము నే ఆశ్రయింతురుగాని సప్తమమగు నిషాదమును ఉపయోగింపనే ఉపయోగింపరు. అన్యదేశీయుల సామపాఠములో అర్వాచీనమైన సంగీత సంప్రదాయ ప్రభావము గోచరించినదని వారు ఉద్ఘాటించిరి. ఇది ముఖ్యముగా సామవేదాధ్యాయకులందరు గుర్తించి గమనింపదగిన అపూర్వ విషయముగా గోచరించుచున్నది. అనేక కారణములచేత కేరళ ప్రాంతములో ప్రాచీనతర సంప్ర

# గ్రంథ విమర్శలు

దాయము విష్కలంకముగా నిలిచి యున్నదని భావింప దగును.

అట్లే 'శౌనకీయా శిక్షా' అను వ్యాసములో శ్రీ వే. వెంకటరామశర్మగారు ఋగ్వేదమునకు అన్వయించు ఆ శిక్షలోని విశేషములలో వీరకరణము, రంగము, సంయుక్త వర్ణోచ్చారణము ఇత్యాదులలోని మెళకువలు కొన్ని వివరించిరి. వారు కూడక్షేవేదోచ్చారణమందు కేరళీయుల కున్నంత శ్రద్ధ ఇతర ప్రాంతముల పండితులలో కనబడలేదని ఉద్ఘాటించుట గమనింపదగినది. ఈ వ్యాసకర్త ప్రాతిశాఖ్యలలోనను శిక్షలలోనను అసాధారణ విద్వాంసులైనందున వారి వాక్యములు వేదవిదులందరును గాఢముగా ఆలోచింపవలసినవై యున్నవి.

శ్రీ ప్ర. భ. అణ్ణంగరాచార్యులుగారు 'పదపాఠ పరిశుద్ధిః' అను వ్యాసములో, తైత్తిరీయ సంహితలో 1,09,287 పదములు కలవని లెక్కింపబడినవనియు, అందులో ఏకాక్షరములు, ద్వ్యక్షరములు, బహ్వక్షరములు కలవనియు, ఒకేపదము స్థలాంతరములలో భిన్నస్వరములతో నుచ్చరించుటకు కారణమేమని ప్రశ్నించుకొని, 'అది వేదపురుషుని ఉచ్చారణ విశేషమే' అని కేవల ప్రామాణిక దృష్టితో భావించు వారి మాట ఏ మాత్రము సరికాదనుచు వేదపురుషుడట్లు భిన్నరూపములతో నుచ్చరించుటకు హేతువులు ప్రధానముగా దశవిధములని వానిని వివరించిరి.

ఇక శ్రీ వే. వేంకటరామశర్మగారు 'వైదికః ప్రకృతిపాఠః' అను వ్యాసము నేటి వేదాధ్యయనపరులే కాక వేదమందు అభిమానముకల వారందరును గమనింపదగినది. అందులో వేదపాఠము ప్రకృతి వికృతి భేదముచే ద్వివిధమనియు, వానిలో ప్రకృతి పాఠము సంహిత, పదము, క్రమము, అని మూడుగా అంతర్భాగములు కలదనియు, వికృతిపాఠము ఘనజటాది రూపముగా అష్టవిధమనియు ఉపక్రమించిరి. వికృతి పాఠమును వ్యాడ్యాచార్యులు 'వికృతివల్లి' యను గ్రంథమున వివరించిరి. వ్యాడి పాణిని మేనమామ కుమారుడట ఆయన లక్షశ్లోక పరిమితిగల పాణినీయమును ప్రపంచించు గ్రంథము కూడ రచించెనట. ఈ వ్యాసము పసంహరించుచు యజ్ఞమందుగావి స్వాధ్యాయ మందుగావి సంబంధముండుటచే సంహితార్థ పరిజ్ఞానమునకు పదాధ్యయనమునకు ప్రయోజనము కలదనుట ప్రసిద్ధమవియు, క్రమపాఠమున కట్టి ప్రసిద్ధి లేకున్నను, స్మృతి ప్రయోజనము కలదని సమర్థించి క్రమముకూడ నార్షమే యనుచు, అందువల్లనే వ్యాకరణ శాస్త్రమందు, 'తదధీతే తద్వేద' అని ఉపక్రమించి 'క్రమాదిభ్యో వున్' అను చో క్రమాధ్యయనము చేసినవారు 'క్రమకు' అనియు, పదాధ్యయనము చేసినవారు 'పదకు' అనియు శబ్దసిద్ధి కలుగునని ప్రదర్శింపబడుటచే క్రమపాఠము అంగీకృతమైనదని ఉపపత్తి చూపిరి. ఈ సందర్భములో వారు వాచ్యముగా చెప్పకున్నను, ఘన జటాది వికృతి పాఠములు యజ్ఞమందుగాని అధ్యయనమందుగాని నిష్ప్రయోజనము లనియు, అనార్షములనియు సూచించిరి. వేద స్వరూప ప్రయోజనములు తెలియక, ఘనపాఠులు 'ఘనస్వస్తి' చెప్పుచున్నామని ప్రకటించుకొనుటయు, ఘనపాఠము రానివారు కూడ, ఒకటి రెండు పనసలకు ఘనవల్లించి వానితో ఆశీర్వచనమున కుపక్రమించుటయు ఆంధ్రదేశములో ఇటీవల ఆచారమగుచున్నది. ఇది ఎంతవరకు ఆదరింపదగినదో వేదవిదులును వేద ప్రామాణ్యము గలవారును గాఢముగా ఆలోచింపదగినది. రసస్పర్శలేని చిత్రకవిత్వమే కవిత్వమని విని చదివి పొంగిపోవు కాలములలో, యజ్ఞములందును, స్వాధ్యాయ మందును ప్రయోజనములేని ఘనజటాది వికృతులకు ఎక్కువ వ్యాప్తి కలుగుట సహజమేవో యని బుద్ధిమంతులకు సంశయము కలుగకపోదు.

శ్రీ మ. రామనాథ దీక్షితులుగారు 'సామవేదః లౌకికో వ్యవహారశ్చ' అను వ్యాసములో 'వేదానాం సామవేదోఽస్మి' అని గీతలోను 'సామగానప్రియా' అని లలితారహస్య నామమునను గల వచనాదులతో సామవేద విశిష్టత నుగ్గడించి, అందలి బ్రాహ్మణాదులను నిర్వచించి, అదృష్టములైన స్వర్గాదులకేకాక, దృష్టప్రయోజనములుగల లౌకికసిద్ధులకు గూడ సామ మంత్ర ప్రయోగము ఏయేవిధములుగా ఉపయోగించునో సూచించిరి.

'శుక్లయజుర్వేద విమాంసా' అను వ్యాసములో శ్రీ వే. జగదీశ్వరశాస్త్రిగారు శుక్లయజుర్వే

తముయొక్కయు, ప్రథమాచార్యులయిన యాజ్ఞవల్క్యులయు అతిశయమును కొంత అభినివేశముతో ప్రశంసించి, ' అందలి శాఖాభేదములను, శతపథ బ్రాహ్మణాదికముల విశేషములను విస్తరించి, ఈ సంహితకు భాష్యకారులను తెలిపి, యాజ్ఞవల్క్యుల సంక్షేప చరిత్రతో ముగించిరి. ఈ వ్యాసము శుక్ల యజుస్సంహితను గూర్చిన విషయముల నెన్నిటినో సంక్షేపముగా ప్రస్తావించినది. సందర్భవశాత్తుగా, మంత్రభాగము మాత్రమే వేదపదవాచ్య మను కొంద రాధునికుల వాదమును ఖండించి, మంత్ర బ్రాహ్మణములు రెండును వేదపదవాచ్యములని సప్రమాణముగా నిరూపించిరి

'వేదేషు రాజనీతిః' అను వ్యాసమునందు శ్రీ సూర్యప్రకాశశాస్త్రిగారు, సందర్భవశమున వేదభాగములలోగల వాక్యములను సూత్రప్రాయముగా గ్రహించి మన్వాదిస్మృతులను, పురాణములను కౌటిల్యుని అర్థశాస్త్రమును ఎట్లు విస్తరించినవో చక్కగా వివరించిరి. వేద విధానములో రాజసూయ ప్రకరణమునుబట్టి భరతరాజులకు ప్రజాపరిపాలనము ధర్మముగా నిరూపితమైనదనుచు, క్షత్రియులకే రాజ్యాధికారమున్నను, వారిలో విద్యావినయాది సద్గుణములు కలవారికే రాజ్యాభిషేకము చేయవలెననియు, వారు మంత్రి పురోహితాదులను నియమించి వారి యాజ్ఞలను పాలింపవలెననుచు తెలిపిరి. అందులో పురోహితుడు మంత్రులందెల్ల నగ్రగణ్యుడు. ఆత డుత్తమ కులశీలవంతుడై వేదవేదాంగములందును దైవనిమిత్తములందును దండనీతియందును నిష్ణాతుడై, దైవ మానుషోప ద్రవములకు ప్రతిక్రియ చేయగల సమర్థుడుగా గూడ నుండవలెను. రాజు తన పురోహితుని, శిష్యు డాచార్యుని, పుత్రుడు తండ్రిని, భృత్యుడు స్వామినివలె అవశ్య మనువర్తింపవలెనని విశదీకరించిరి. యుద్ధము, ఆత్మరక్షణము, కరములు (పన్నులు) గ్రహించుట ఎట్లెట్లు జరుపవలెనో కూడ సంగ్రహముగా వ్యాసములో ప్రస్తావింపబడినవి.

'వేదలక్షణమ్' అను వ్యాసములో శ్రీ రా. కృష్ణస్వామి ఘనపాఠిగారు ప్రాతిశాఖ్యల ప్రయోజనమును సంగ్రహముగా ప్రశంసించిరి.

'దర్శనానాం లోకన్యాయానాంచ మూలభూతా వేదభాగాః' అను వ్యాసము శ్రీ చతుర్వేది రామచంద్రాచార్యులుగారు వ్రాసినది ఏడు పేజీల విస్తృతి కలది. దర్శనములు ఆరనియు, పదియనియు మతభేదములున్నవని తెలిపి, షోడశ దర్శనములను పేర్కొన్న 'సర్వదర్శన సంగ్రహము' నాధారముగా చేసికొని, ఆయా మతములకు మూలభూతములైన వేదవచనముల నుదాహరించిరి. అవి ఎక్కువ భాగము ప్రసిద్ధములైన ఉపనిషత్తులలోనివే కాని తక్కిన వేదభాగములలోనివి కావు. ఋగ్వేద సంహితలోనివి రెండు మూడు వాక్యములు మాత్రమున్నవి. ఈ వ్యాసములో ఉదాహృతమైన భాగములు కొన్ని పూర్వపక్షవాక్యముల లోనివి. కాని యవి ఏ సందర్భములో చెప్పినవో వ్యాసకర్త వివరింపనందున చార్వాకాదికములగు వేద విరుద్ధ దర్శనములు కూడ వేదమూలములను భ్రాంతి సాధారణ పాఠకులకు కలిగించునట్లున్నది. అది వ్యాసకర్తకు సమ్మత మనుకొనము. దర్శనములకువలెనే లోక న్యాయములను, లోకానుభవమును గూడ సూచించు వేదవాక్యములు కూడ వ్యాసకర్త ఉదాహరించెను. ఏమైనను ఈ వ్యాసము మాత్రము సమన్వయ రహితమై, సామాన్య పాఠకుల మనస్సులను అపమార్గము పట్టించుటకు వీలుగా నున్నదని మేము చింతించుచున్నాము.

ఇక ఆంగ్లములో నున్నవ్యాసములు ఎంతో వైవిధ్యము కలిగి వేదవేదాంగ విషయములను ఎన్నిటినో ఆంగ్ల భాషావిదులకు ప్రదర్శించుచున్నవి. ప్రస్తావించిన ప్రతివిషయమునకును వేదవాక్యప్రమాణ ముదాహరించుట వీని విశిష్టత.

శ్రీ సి. యస్. వెంకటేశ్వరన్‌గారు 'ఋగ్వేదములో బృహస్పతి, బ్రహ్మణస్పతి' అను వ్యాసములో బృహస్పతి బ్రహ్మణస్పతి శబ్దముల విచారణచేసి, రెండును ఒకే దేవత పేర్లని నిరూపించిరి.

శ్రీమతి అంబాబాయి పురాణిగారు 'శ్రీ అరవిందుల వేదపరిశీలనము' అను వ్యాసములో, అరవిందులు ప్రప్రథమములో వేదమును గూర్చి పాశ్చాత్య విద్వాంసుల యభిప్రాయములనే కలిగియుండినను కాలక్రమమున వారి యభిప్రాయములలో ఎట్టి మార్పులు కలిగినవో వివరించిరి. యోగరీత్యా ఆత్మసాధన చేయుచు వారును అప్రయ

త్నముగా వేదర్షుల మార్గమునే అవలంబించిరి. సాయనభాష్యముపై నాధారపడక వేదములను స్వతంత్రముగా పరిశీలన చేయగా, అందలి యంతస్సాక్ష్యమును బట్టి, అవి ఏకార్థమునే బోధించుచున్నవనియు, విజ్ఞాన విషయమున నెంతో ముందడుగువేసిన సంఘమునుండి వేదము లుద్భవించినట్లును అరవిందులు గ్రహించిరని తెలిపిరి.

శ్రీ ఇ. అనంతాచార్యులుగారి 'ఆపోవిషయిక వేదభావన' అను వ్యాసములో వేదమునందు ఆపోభావన ఎంత విశిష్టమైనదో విపులీకరించి ఈ క్రింది వాక్యములతో ముచ్చటగా తమ వ్యాసము ముగించినారు:

"It is from the flow of the ocean of universal consciousness that our human hearts too receive the flood of universal consciousness. The waters are therefore said to contain the Powers of immortality and rectitude and the Devas alone are capable of declaring the Powers of the waters"

మీమాంసా శాస్త్రములో గొప్పపండితులైన శ్రీ డి. టి. తాతాచార్యులుగారు 'శ్రౌతసూత్రములు' అను వ్యాసమున క్లుప్తముగా సూత్రలక్షణమును, యజ్ఞస్వరూపమును, కర్మవైవిధ్యమును తెలిపి, వేదకర్మలు ప్రధానముగా ఇష్టి, పశు, సోమ - అను మూడు విధములైనవని వివరించి, ఋఙ్మంత్రోచ్చారణము స్తోత్రము, శస్త్రము అను రెండు భేదములతో నుండునని చెప్పి, ఏఏవేదశాఖకు ఏఏశ్రౌతసూత్రములు పుట్టినవో, వానిలో నేవేవి నేడు ఉపలబ్ధ మవుచున్నవో చక్కగా నిర్వచించిరి. యజ్ఞకర్మలు కర్తకేకాక దేశమునకును విశ్వమునకును గూడ మహాప్రయోజనము సమకూర్పగలవని వేదశాస్త్రము లుద్ఘోషించుచున్నను, నేటి కాలమున నా సంగతి విస్మృతప్రాయ మవుచున్నందుకు విచారపడిరి. ఈ వ్యాసము స్పష్టతకు, క్రమవిన్యాసమునకు, సంక్షేపముగా అనేక విషయములు ప్రపంచించుటకును ఉత్తమోదాహరణముగా నున్నది.

శ్రీ వి. వరదాచార్యులుగారి 'గృహ్యసూత్రములు' అను వ్యాసముకూడ ఎంతో బాగున్నది. బహువిధములైన గృహ్యసూత్రములను తెలిపి, నేటి యాచారము లెన్నియో వానిలో కనబడవని సందర్భవశమున కొన్ని ఉదాహరించిరి. ఈ వ్యాసమునుబట్టి స్మార్తకర్మలలో ఎంత వైవిధ్యము, మార్పుకల్గెనో ఊహింప వీలగుచున్నది.

శ్రీ యస్. భాస్కరరావుగారు 'వైదికచ్ఛందస్సు' మీద వ్రాసిన వ్యాసము ఎంతో మననమునకు దోహదము కలిగించునట్లున్నది. శ్రీ డి. అర్కసోమయాజిగారు 'వేదములలో జ్యోతిశ్శాస్త్ర స్మరణము' అను వ్యాసములో సంధ్యావందనము మొదలు పిండ పితృయజ్ఞమువరకును, యజ్ఞవేదికలు నిర్మించుటకును కాలజ్ఞానము ఎంత సున్నితముగా తెలిసి ఉండవలెనో సూచించిరి. శ్రీ పి. నాగరాజరావుగారు 'వేదములలో తత్త్వశాస్త్రము' అను వ్యాసములో మాధ్వ రామానుజమతములందు తమకున్న అభిమానము ప్రకటించిరి. 'సామవేదములో సంగీతము' అను వ్యాసములో శ్రీ బృందా వరదరాజన్‌గారు అమూల్య విషయముల ననేకము వివరించిరి.

శ్రీ కె. మహాదేవశాస్త్రిగారు 'వైదిక సంస్కృతము లౌకిక సంస్కృతము' అను వ్యాసములో లౌకిక సంస్కృతములోని కొన్ని లక్షణములు ద్రావిడభాషాదికములతో సంపర్కమువలనవచ్చి యుండవచ్చునని సూచించిరి.

శ్రీ అగ్నిహోత్రము రామానుజతాతాచార్యులుగారు 'వేదములలో రాజకీయ భావనలు' అను చిన్న వ్యాసములో వేదములో సభా, సమితి, గణములు ఇత్యాది శబ్దములవలన ప్రజాతంత్ర రాజ్యములు కలవనియు, రాజసూయ ప్రకరణమునుబట్టి రాజు ఎన్నుకొనబడి అభిషేకింపబడుచుండెననియు, సమ్రాట్, విరాట్, ఏకరాట్, అధిరాట్—ఇత్యాది శబ్దములనుబట్టి చక్రవర్తిత్వ భావనకూడ కలదనియు అనేక విషయములు సూచించిరి.

శ్రీ వి. సుబ్బారావుగారు 'వేదములలో ఖగోళ విషయములు' అను వ్యాసములో ఇండో ఆర్యనులు, ఏఏ భూములను ఏవరుసలో నివాస స్థానములు కావించుకొనిరో, వానిని సూచించు ఋక్కులను గూర్చియు, వారెరిగిన వృక్షములు, పంటలు ఇత్యాదులు ఎట్లు అనుమేయింపవచ్చునో సూచించిరి.

శ్రీ ఎస్. యస్. ప్రసాదరావుగారు 'వేద మందలి ఆర్థిక సంపద' అను వ్యాసములో వేద కాలములో ఆర్థికస్థితి గోసంపదావస్థనుండి వ్యావసాయిక స్థితికి, పారిశ్రామిక స్థితికి వాణిజ్య స్థితికి ఎట్లు క్రమపరిణామము పొందినదో నిర్వర్తించిరి ఋగ్వేదములోనే సముద్ర శబ్దముతో పాటు శతారిత్ర శబ్దము (నూరుతెడ్లు కల నౌక) తరుచుగా వినబడుచుండుటవలన సముద్ర వ్యాపారము కూడ కలదని స్పష్టమవుచున్నదని నిరూపించిరి. ఈ విధముగా రెండు వేల సంవత్సరముల కాలములో జరిగిన పరిణామమును దిగ్దర్శనము చేసిరి.

'వేదములలో రసాయన శాస్త్రము' అను వ్యాసములో శ్రీ వి. ఆర్. కృష్ణన్‌గారు వేదకాలములో ఎంతవరకు రసాయన విజ్ఞాన మున్నదో వివరించుచు, రసాయన శబ్దము అథర్వవేదములో కలదనియు బంగారము, సీసము, ఇనుము వారికి వాడుకలో నుండెననియు, సోమము, యవలనుండి తీయు మద్యము వారెరుగుదురనియు అనేకములైన ఓషధుల పరిజ్ఞానము సూత్రప్రాయముగా నుండెననియు, దానిపైన తర్వాతి కాలములో చరకుడు, సుశ్రుతుడువంటి మహాత్ములు ఆయుర్వేదమును శాస్త్రముగా రూపొందించిరనియు తెలిపిరి.

శ్రీ కుంజున్ని రాజాగారు 'వేదకాలములో క్రీడలు వినోదములు' అను వ్యాసములో ఎక్కువగా ద్యూతమును గురించి వివరించి తక్కిన క్రీడా వినోదములు సూచించిరి.

శ్రీ టి. కె. గోపాలస్వామి అయ్యంగారు 'వేదములలో కృషి' అను వ్యాసములో ధాన్యములు - ఆరణ్యములు, గ్రామ్యములు - అని రెండు విధములుగా నుండెనని ఏ ఏ సస్యము లేయే కాలములలో ఎక్కడ లభించుచుండెనో సమీక్ష చేసిరి. శ్రీ బి. ఆర్. శర్మగారు 'వేదకాలపు ఆర్యులు—సముద్రయానము' అను వ్యాసములో ఋగ్వేదార్యులు సముద్రమే యెరుగరని కొందరు పాశ్చాత్య విద్వాంసుల నిర్ణయములను సప్రమాణముగా ఖండించిరి

శ్రీ యస్. సుబ్బురెడ్డిగారు 'సంగము వాఙ్మయములో వేదములు' అను వ్యాసములో సంగకాలపు వాఙ్మయమునుబట్టి అప్పటికే తమిళ దేశములో వైదిక విజ్ఞానము విస్తరించి స్థానిక విజ్ఞానముతో కలసిపోయినదనియు, ఆ రెండిటిని వేరుచేసి తెలిసికొన యత్నించుట అవసరమని సూచించిరి. వీరి వ్యాసము ముగింపులోగల ఈ క్రింది వాక్యముల వలన ఈ విషయ విచారణము వారెంత జాగరూకతతో కావించిరో విదితము కాగలదు.

"For one thing the Aryanisation of the Tamils was not the same as civilising a primitive people... There was already a culture that was nothing inferior to the new culture... Therefore, when the Aryan influence came into the Tamil Country, it was not grabbed as something spectacular. The Tamils found that many of the ingredients of the Aryan culture were in tune with their own culture and therefore, accepted them... Aryanisation was not a cultural invasion of the Tamils but a cultural assimilation of what was agreeable in the foreign culture by the Tamils. At the same time the Tamils were able to maintain their cultural identity throughout. It should be the business of future Tamil research to identify the pure ingredients of Tamil culture..."

ఈ విధముగా ఈ గ్రంథము వేదములను గూర్చి విద్వాంసులకేకాక సామాన్య పాఠకులకును అనేక విషయములను అందుబాటులోనికి తెచ్చినందుకు ప్రచురణ కర్తలను హృదయ పూర్వకముగా అభినందించుచున్నాము.

ఈ వేద విద్వత్సభను నడిపిన శ్రీ మహర్షి దైవరాత శర్మగారి సంస్కృతోపన్యాస సారమునైనను ఇందులో చేర్చక, వారు నిరుపమానమైన సంస్కృత భాషలో శక్తిమంతమైన ఉపన్యాసము చేసిరనిమాత్రము పీఠికలో తెలిపి, పాఠకులకు ఉత్కంఠ కలిగించి ఊరించి ఆశాభంగము కలిగించినందుకు మాత్రము అసంతృప్తి ప్రకటింపక తప్పదు.

## బ్రహ్మ సూత్రార్థ వివృతి

[వ్యాఖ్యాత: శ్రీ వంగల వేంకటరామశాస్త్రి; ప్రాప్తిస్థానము: సాహితీ సమితి తాడికొండ; సైజు: డెమి 1/8: పేజీలు 410. కాలికోబైండు మూల్యము: రు 10/-]

ఇది బ్రహ్మసూత్రములకు శ్రీ విద్యాశంకర భగవత్పాదులు రచించిన శారీరక మీమాంస భాష్యము ననుసరించి తేటతెలుగులో సంక్షేపవివృతికల గ్రంథము. ఇందలి అధికరణ విభాగము శ్రీ శంకర భగవత్పాదులనే అనుసరించినది. శ్రీ శృంగేరి విరూపాక్ష పీఠాధిపతులగు జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీస్వాముల శ్రీచరణ సన్నిధిని భాష్యశ్రవణము చేసినది మననము చేయుచు బహుకాలము తర్వాత తామీ గ్రంథము రచించినట్లు గ్రంథకర్త 'వినతి'లో తెలిపిరి. మరియు ధర్మాభట్లు విరచితమగు 'బ్రహ్మామృత వర్షిణి' అను వ్యాఖ్యానమును, 'బ్రహ్మ సూత్రార్థ దీపిక' యను మరియొక వ్యాఖ్యాన గ్రంథమును తమకు ఈ గ్రంథ రచనలో సహాయభూతము లైనట్లును, రత్నప్రభాది వ్యాఖ్యాన గ్రంథములనుగూడ పరిశీలించి ఇది వ్రాసితి మనియు తెలిపిరి.

సూత్రార్థములను సంక్షేపముగా వివరించుట ఎంతవరకు సాధ్యమో అంతసంక్షేప రూపములో ఈ వివృతి రచన సాగినది. భాష సరళ గ్రాంథికము. అయినను శాస్త్రగ్రంథమగుటచే అర్థప్రతీతికై పారిభాషిక పదములు ఉపయోగింపక తప్పినదికాదని గ్రంథకర్తయే అంగీకరించిరి.

అందువలన భాష్యశ్రవణము చేసియుండని వారికి ఈ గ్రంథము సూత్రార్థమును భాష్యానుకూలముగా గ్రహించునట్లు చేయుటకు సమర్థము కాదు. కాని భాష్య శ్రవణము చేసినవారు ప్రధాన విషయములు మరపు తగులకుండ కొంతవరకు ఉపస్థితిలో నుంచుకొన గోరుచో ఈ వివృతి ఉపయోగకారిగా నుండగలదు.

గ్రంథాంతమందు సూత్రాను క్రమణిక లకారాదిగా నుండుట ఈ గ్రంథమందొక విశేషము. కాని అంతకంటె సూత్రపాఠమే వరుసగా నిచ్చినచో నిత్యపారాయణము చేయుచు కంఠస్థ మొనర్చుకొనుటకు ఉపయోగపడి ప్రయోజనకారి యయ్యెడిది. ఎట్లున్నను సూత్రపాఠము కూడ ఇచ్చియుండుటవసరము.

గ్రంథము మంచి కాగితముమీద తక్కువ అచ్చుతప్పులతో చక్కగా ముద్రింపబడినది.

—నోరి నరసింహ శాస్త్రి.

## సమ్రాట్ పుష్యమిత్ర

(నాలుగు చారిత్రక నాటికలు)

[రచన: ముదిగొండ శివప్రసాద్. వెల: నాలుగు రూపాయలు, ప్రాప్తిస్థానము: జ్యోతిర్మయి ప్రచురణలు. హైదరాబాదు 7]

పతనమై, అశక్త ధూర్తత్వమును అలవరచుకొన్న జాతి ఆత్మవిమర్శ చేసికొనలేదు. చేసికొనవలయునను దలంపు సైతము దానికి కలుగదు. ఆ జాతికి చేతనగునది యొకటే- వివేకమును కోల్పోయి రాగద్వేషములను పెంచుకొనట పెంచుకొని సత్యమును గుర్తింపలేదు. గుర్తించినను దానిని తలక్రిందులు చేయును. అట్టి జాతి తన దుస్థితికి తాను కారణమనుకొనదు. కారణము లను మరొకరి నెత్తిపై రుద్దును. వర్తమానకాలమును కాలపరిణామమును గూడ విస్మరించుట ఆ జాతికి అబ్బెడు ముఖ్యలక్షణము. అది చరిత్రదారికు తిరిగిపోవును. ఇతర మతములపై, ఇతర జాతులపై రెచ్చెపెట్టిన మనస్తత్త్వముతో, స్వపరభేద బుద్ధితో చరిత్రకు వ్యాఖ్యానము చేయును. అయినవారికి ఆకులలో, కానివారికి కంచములలో వడ్డించును. నవయుగ భావములను చరిత్రలో దర్శించును.

అచ్చముగా ఈ పోకడ పోయిన గ్రంథము ఇది. ఇందు నాలుగు చారిత్రక నాటికలు కలవు నాటిక యనుదాని కిట శాస్త్రపరముగా అర్థము చెప్పికొనరాదు. కేవల మీనాడు వ్యవహారముననున్న సామాన్యార్థమునే చెప్పికొనవలయును ముదిగొండ శివప్రసాదుగారే యీ క్రిందివిధముగా తమ నాటికలనుగూర్చి తాము పొగడి కొనిరి. 'ఈ దేశ ఉచ్చపతనాలకు కారణమైన చారిత్రక పురుషులకు సంబంధించిన నాలుగు నాటి

కలు. పంచశీల సిద్ధాంతంతో దేశాన్ని శత్రువులపాలు చేసిన బృహద్రథుని కథ 'సమ్రాట్ పుష్యమిత్ర'. మహమ్మదీయులనుండి మోటుపల్లి రేవును స్వాధీనం చేసికొన్న మల్లారెడ్డి కథ 'మహా మల్లీయం'. మఱొక గంటకు మరణింపబోయే అక్బర్ మానసిక సంఘర్షణ 'పిశాచాల రాత్రి'. విషయలోలుడై మహాసామ్రాజ్యాన్ని మట్టిపాలుచేసిన విజయరాఘవుని కథ 'విజయ శిథిలాలు'. ఆంధ్రసాహిత్యంలో అపూర్వ విప్లవం. నభూతో నభవిష్యతి అనదగ్గ నాలుగు నాటికలు'

పాశ్చాత్యులు భారతదేశం చరిత్రను సరిగా వ్రాయలేదని వారి నమ్మిక. ఐనను, పుష్యమిత్రుని పొగడుటకు వారు విన్సెంట్‌స్మిత్ మాటలనే యుదాహరించిరి. తన కనుకూలముగా నున్నచోట పాశ్చాత్యుడు ప్రామాణికు డయ్యెనన్నమాట. ఈ విధముగా తెగడుచునే, తెగడినవారి ననుసరించుట, హైందవజాతి యందలి ద్విముఖ ప్రవృత్తిని చాటును. శివప్రసాదు గారికి బౌద్ధులన్నను, మహమ్మదీయులన్నను కావలసినంత కడుపుమంట. మౌర్యసామ్రాజ్యము బౌద్ధమతము వల్ల పతనమైపోయినదట! హైందవ రక్తమును కలుషితము చేయుటయే ప్రధానలక్ష్యముగా అక్బరు జీవించెనట! బృహద్రథుడు, దొడ్డారెడ్డి, అక్బరు, విజయరాఘవుడు భారత 'జాతి చరిత్రకు కళంకం తెచ్చిన వ్యక్తులు' అని వారనుకొనిరి. ఇట్టి యభిప్రాయములతో శివప్రసాదుగా రీనాటికలను రచించిరి.

'కన్యాశుల్కము'తో ఆంధ్ర 'నాటక సాహిత్య పతనం' మొదలై రోజు రోజునకు పెరిగిపోవుచున్నదట! ఆంధ్ర నాటక సాహిత్యము నుద్ధరించుటకు నెవ్వరును ప్రయత్నము చేయుట లేదట! ప్రతాపరుద్రీయము మొదలయిన వేనాలుగైదో 'ఉత్తమ రచనలు కేవలం వ్రేళ్లపై లెక్కింపదగ్గవిమాత్రమే వస్తున్నాయి' యుట! ఉద్యోగ విజయాలను పై రచనలలో ఒకదానినిగా లెక్కించిన ముదిగొండవారే మఱి యొకచోట వేమనిరో చూడుడు! '......ఉద్యోగ విజయాలలోవలె ఒకరు ఒకగంటసేపు పద్యాలు పాడుతూ వుంటే మిగిలిన నటులుకూడా ప్రేక్షకులవలె చేతులు కట్టుకొని కూర్చునే దుర్గతి' తాము రచించిన నాటికలలో నేయొక్క దానికిని లేదట! మంచి సెబ్బరలు ఎంచకుండ, స్వవచన వ్యాఘాతములతో శివప్రసాదుగా రీనాటికలను రచించిరి

శివప్రసాదుగారు పురస్సిద్ధాంతములతో నాటికా రచనకు పూనుకొనుటచే, ఇందలి పాత్రలు పదరు బోతులయినవి. సంయమనము లేని యా పాత్రల మాటలకు సందర్భ శుద్ధి లేదు. బౌద్ధమతమును హేళన చేసినచో, అక్బరును తిట్టినచో, తిట్టించినచో హైందవధర్మము తళతళలాడునను మూఢ విశ్వాసము గ్రంథకర్త కున్నది ఆ విశ్వాసమే పాత్రలకు పట్టినది. గ్రంథకర్తగారు తన రాగద్వేషములను పాత్రల కెక్కించిరి దేశకాలౌచిత్యములను గాలికి వదలి సంభాషణలు వ్రాయుటలో ముదిగొండవారు సిద్ధహస్తులు. ఎంతసేపటికి పాత్రలు హైందవధర్మము, హైందవ ధర్మము అని మొత్తుకొనుచు పిచ్చివాండ్ర వలె వాగును. కాందోషమును ధ్వనిగా భావించుచు, దానివల్ల వీరరసము ఊరునని గ్రంథకర్తగా రనుకొనిరి. పంచశీలను నమ్ముచున్నట్టి నటించి చైనా దురాక్రమణము చేసినది గదా! చైనా దురాక్రమణ గాథ ప్రతిబింబించిన నాటిక 'సమ్రాట్ పుష్యమిత్ర'. 'ఎంతవఱకు వచ్చిందిరా మన పంచశీల' అని బృహద్రథుడు సేవకుని అడుగును. వాడు 'అంచెలవిూద రెక్కలు కట్టుకొని చైనాదేశం చేరింది ప్రభూ!' అని యనును. పుష్యమిత్ర నాటికలో చైనా ప్రస్తావన తీసికొనివచ్చుట శ్రేయనుచితమని గ్రంథకర్తకు లేదు. అక్సాయ్‌చిన్ ప్రాంతమును చైనా యాక్రమించుకొనిన విషయమును నెహ్రూ ప్రజాప్రతినిధుల సభకుగాని, దేశమునకుగాని తెలియబఱుప లేదు గదా! అట్లే యీ నాటికలో కౌశాంబిపతన వృత్తాంతమును బాదరాయణ మహాప్రభువు బృహద్రథునకు చెప్పడు. భారతదేశము పంపు నిరసన పత్రములను చైనా ఖాతరు చేయదుగదా! బాదరాయణ మహాప్రభువు పంపెడి నిరసన పత్రములను డెమిట్రియస్ తుంగలో త్రొక్కును. ఈ విధముగా వ్రాయుట ధ్వని యుట! ఇది 'ధ్వని' యా? లేక ధ్వైతా?

మచ్చునకు ఈ నాటికల పాత్రల మాటలను చూడుడు. '...కాని అల్లా ఆశీర్వాదంతో మా ముస్లిమ్ సంస్థ తిరిగి పునరుజ్జీవింపక . మానదు...' అని అల్లాయుద్దీననును. ఇక రాణాప్రతాపసింహుని

మాటలు వినుడు. '...ధర్మమే అంతిమ లక్ష్యంగా, విప్లవమే కార్యక్రమంగా, మరణాన్ని పుష్పమాలగా దాల్చి మహోగ్రాష్ట్ర పురుషాధనలో తనుమనోధనాలు సమర్పించిన మానవంతుడైన మేవాడ సింహం...' 'అక్బర్! ఎవడివి నీవసలు నాదేశంలో సామ్రాజ్య నిర్మాణం జరపటానికి! నీ పూర్వీకులు ఛంగీస్‌ఖాన్, తైమూర్లనూ నా రత్నగర్భను దోచుకోవటంకోసం వచ్చిన బందిపోటులు మీ తాత నా ఢిల్లీ సింహాసనాన్ని ఆక్రమించిన ఒక విదేశీయుడు. నీవు సహన మనే-కొత్త కుట్రతో నా జాతిని భ్రష్టంజేస్తున్న స్వార్థపరుడివి. ఎవరు పిలిచారు నిన్ను బొట్టు కాటుకపెట్టి నా దేశం పాలింపమని......' ఇది రాణాప్రతాపసింహుని యాక్రోశమా? శివప్రసాదు గారి పలవరింతా? 'ఈ బందిపోటు ఇంకా మాట్లాడు తున్నాడే. సైనికులారా...' అని ఔరంగజేబనగా; 'ఔరంగజేబ్! బందిపోటెవరో భావికాలం నిర్ణ యిస్తుంది. భారతీయార్ష లేఖినులు వ్రాస్తాయి నిజ మైన భారతదేశ చరిత్రను...' అని శివాజీ-- శివ ప్రసాదుగారివంటి 'చరిత్రకారులు' ఇకముందీ వేద భూమిలో జనింతురని యనుకొన్నాడేమో -చాటును. అసలు అక్బరునకు సంబంధించిన నాటికలో ఔరంగ జేబ్ శివాజీల రంగము ఉండదగినట్టిదా? వైష్ణవ పీఠాధిపతియగు తాతాచార్యులు ఈ క్రింది విధముగా బోధించును. '......పవిత్ర భగవాధ్వజం సువిశాల హిందూ సామ్రాజ్యంలో ఎగరడం చూడలేని అసురీ శక్తి- పోర్చుగీసువారి రూపంలో నీ ముందు నిలిస్తే వాళ్లా నరులేనని భావిస్తున్నావా?...కంసుడూ, రావణుడూ, దుర్యోధనుడూ, చార్వాకులూ, నవనందులూ, శ్వేతహూణులూ, మ్లేచ్ఛులూ, మొగలాయీలూ వీరంతా ఎటువంటి నరులో ఈ బుడతకీచులూ అటువంటి నరులే...' తాతాచార్యుల వారు భారతదేశచరిత్రను ప్రధాన విషయముగా చదివి నట్లున్నది. శివాజీ చేపట్టిన భగవా జండా (కాషా యాంబర పతాకము) ప్రస్తావన రఘునాథదేవరాయలు, తాతాచార్యులవారు చేయుట తగునా?

ఈ విధముగా సంభాషణములు వ్రాయుటచేత పాత్రల యుదాత్తత యూడ్చుకొనిపోయినది. వానికి లేకితనము సంక్రమించినది. చరిత్రలో ఈ పాత్రల నిజస్థితి వేరు. ఈ నాటికలలో వానిస్థితి వేరు. శివప్రసాదుగారి ఆక్రోశములకు, సిద్ధాంతములకు బలియైపోయి సొంతడబ్బా కొట్టుకొనుచు బాకా లూదినవి.

సమ్రాట్ పుష్యమిత్రనాటికకు, విజయశిధి లాంటి నాటికకు సంవాదమున్నది. బృహద్రథుడు అరుణదత్తుని మాట వినడు. విజయరాఘవుడు గుణ సాగరుని మాట వినడు. రాజు లిరువురు మంత్రుల చెంపలు వాయింతురు. పుష్యమిత్రునివలె అమ్మంగ దేవుడును మాఱువేసము వేయును. అక్బరును మరణ శయ్యపైనుంచి, బైరాంఖాను మున్నగువారిచేత తూర్పార బట్టించుటయే 'పిశాచాలరాత్రి' కథ గదా? ప్రేక్షకు లెంతసేపని అక్బరు మరణశయ్యా దృశ్య మును చూడగలరు? ఎంతసేపని అక్బరును తిట్టుట వినగలరు? 'మహామల్లీయము'లో ఎంతో గొప్పగా పాత్ర పోషణము చేయవచ్చును. కావ్యోదాత్తతను సృష్టింపవచ్చును. కాని మహమ్మదీయ మతద్వేషము శివప్రసాదుగారిచేత ఆ పని చేయింపలేకపోయినది. పుష్యమిత్రుడు, అమ్మంగదేవుడు నిజస్వరూపములను జూపినపుడు, అల్లాయుద్దీనే దొడ్డారెడ్డియని తెలిసి నపుడొక కొంత యుత్కంఠ కలుగవచ్చును. రచయిత వర్తమానకాల భావములను పాత్రల నోట పలికించుట చేత, తదనుగుణముగా సన్నివేశములు కల్పించుటచేత, తన రాగద్వేషములలో ముంచియెత్తి పాత్రలను నిలు పుటచేత, ఔచిత్యము శూన్యమై కళ చచ్చిపోయినది.

నాటికలు ప్రచారసాహిత్యస్థాయికి దిగజాతినవి. ఇక కథావస్తువును పరిశీలింపవలయును.

పనిగట్టుకొని హైందవ ధర్మముయొక్క గొప్పతనమును దోషములను గప్పిపుచ్చి—వెల్లడింప బూనినవారు గావున, శివప్రసాదుగారు జాతిమత దృక్పథముతో భారతదేశచరిత్రను పరిశీలించిరి లభించిన సాక్ష్యమును పురస్కరించికొని, సమచిత్తము లో వ్యాఖ్యానించుట చరిత్రకారుల విధి ఇట్టి పూర్వవాసనకు, రాగద్వేషములకు తావులేదు సామాన్యముగా చరిత్రను రచించునపుడు మూడు దోషములు దొరలుచుండును. మొదటిది ఔపదేశిక దోషము (Didactical error) మన రాగద్వేషములనుబట్టి మనము బోధింపనెంచిన సిద్ధాంతములు చరిత్రములో వెదకుట యీ దోష లక్షణము. ఇందు ఇప్పటి మాపులో చరిత్రను దర్శించుట సంభవించును. రెండవది స్వదేశాభిమానపోషము (Patriotic error). దురభిమానముచే మాతృదేశ చరిత్రయంతయు స్వర్ణయుగములతో నిండియున్న దని యనుకొనుట యీ దోష లక్షణము.'......... And one of the most typical forms this error has taken in our land (in India) is the attempt to discover the latest political devices in the most ancient literature and institutions of our land. Innocent words have been made to yield meanings which they could never bear......' అని చరిత్రకారులు చెప్పిరి. మూడవది పక్షపాతదోషము(Partisan error). వ్యక్తుల, సన్నివేశముల పట్ల గల పక్షపాతముతో, కేవలము ఒకవైపు కొపువేసికొని చరిత్రను వర్ణించుట యీ దోష లక్షణము. ఇతిహాసములలో, పురాణములలో ఈ దోషము పుష్కలముగా నుండును. శివప్రసాదుగారి యీ గ్రంథములో ఈ మూడు దోషములు పీటవెట్టుకొన్నవి.

వినాయక సావర్కార్ 'భారతేతిహాసమందలి స్వర్ణపత్రము' లను నొక గ్రంథము రచించిరి. బౌద్ధమతము మౌర్య సామ్రాజ్య పతనమునకు కారణమని సావర్కారు వ్రాసెను. శివప్రసాదుగారా పలుకులనే చిలుకవలె వల్లించిరి. గురుదత్త 'పుష్యమిత్ర' అను నవలను హిందీ భాషలో రచించెను. కందర్పరామచంద్రరావుగారా నవలను తెలిగించిరి. అది శోభకృత్తు సంక్రాంతికి (1964 జనవరి) వెలువడినది. శివప్రసాదుగారు 1964 జనవరి ఫిబ్రవరి నెలలలో 'సమ్రాట్ పుష్యమిత్ర' నాటికను రచించిరట! ఆ నాటిక 1965 మే జూన్ మాసములలో ఒకానొక వారపత్రికలో ప్రచురింపబడినది. కారణమేదైననేమి? పుష్యమిత్ర నవలయందలి మొదటి 106 పేజీల కథకు, సమ్రాట్ పుష్యమిత్ర నాటిక కథకు పోలికలు కన్పట్టుచున్నవి. ముఖ్యాంశములు మాట యటుండనిండు. నవలయందలి బాదరాయణ మహాప్రభువు, సౌమ్య నాటికలోనూడ కలరు. నవలలో పెద్దరాణి విదిశ తనసోదరుడగు లక్ష్మణపుర రాజ ప్రతినిధికి సైన్యసమీకరణార్థము రెండు లక్షల సువర్ణములు కావలయునని కోరును. సౌమ్య తన తండ్రియగు వీరభద్రుని లక్ష్మణపురరాజ ప్రతినిధిగా నియమించినచో, సౌమ్మ లేకుండగనే సైన్యము సమకూర్చునని చెప్పును. నాటికలో సౌమ్య మూరు వేల రజత ముద్రలు కోరినట్లున్నది. కారణము తెలియదు. రెండు గ్రంథములలో కుమారుడైన పుష్యమిత్రుని సేనాపతీకరణము తండ్రియగు అరుణ దత్తునకు మొదట తెలియనియట్లే కలదు. బౌద్ధమతమువల్ల రాజ్యమెట్లు దెబ్బతిన్నదో రెండింటను నిరూపింపబడినది. బాదరాయణ మహాప్రభువు మున్నగువారు యవనులకు తోడ్పడుచున్నట్లు రెండు గ్రంథములలో చెప్పబడినది. డెమిట్రియస్ వ్రాసిన లేఖను గూర్చి జరిగిన చర్చ రెంటను తుల్యమే.

శుంగవంశము సామాన్యరాజవంశము. పుష్యమిత్రుడు విదేశీయులగు యవనులను జయించెను గావున, సందు దొరకినదిగదాయని చంకలు గొట్టుకొనుచు సావర్కారుతోపాటు శివప్రసాదుగరు అతనిని ఆకాశమున కెత్తుచుండిరి. యవనులు తిరోగమించుటకు కారణము యూక్రటైడెస్ డెమిట్రియస్ రాజ్యముపై దండెత్తుట. యవనుల అంతఃకలహములు పుష్యమిత్రుని విజయమునకు దారితీసినవి. ఒకానొక సుందరికొరకై శకలను (ఇప్పటి సియాల్ కోట. పాకిస్థానులో నున్నది) పాలించు ప్రభువుతో యుద్ధముచేయుచు పుష్యమిత్రుడు మరణించినట్లు యుగపురాణము (కె. హెచ్. ధ్రువ సంస్కరించిన

(గ్రంథము) చెప్పుచున్నది. ఒకానొక ప్రసిద్ధ చరిత్రకారుడు – ఇతడు జీవించియున్న హైందవుడే - పుష్యమిత్రునిగూర్చి యిట్లు వ్రాసెను. "Pushya-mitra was a traitor and regicide, but some modern historions have condoned his crime by holding it up as a necessity for saving the country. Too little is however known of the actual circumastances to Justify such a lenient view........." పుష్యమిత్రుని చరిత్ర యిది. అతనిని కారణజన్మునిగా పొగడలేక చచ్చిపోవుటకు జాతిమత ద్వేషములతోకూడిన వలపక్షమే కారణము.

బాణుడు శుంగవంశ చక్రవర్తులను గూర్చి చెప్పినమాటలు ముదిగొండవారికి తెలియని యట్లున్నవి. పుష్యమిత్రుని మనుమడగు సుమిత్రుడు భోగలాలసుడై, లాస్య ప్రదర్శనవేళ మూలదేవుని చేతిలో చచ్చెను. పుష్యమిత్రుని చేతిలో బృహద్రథున కేగతి పట్టినదో, శుంగవంశ చక్రవర్తులలో చివరివాడగు దేవభూతికిని అదేగతి పట్టినది. వాసుదేవుడను మంత్రి వానిని జంపి కాణ్వవంశమును మగధసింహాసనముపై నిలిపెను. బృహద్రథునిభ శుంగవంశమును బెడిసికొట్టినట్లున్నది.

మౌర్యసామ్రాజ్య పతనమునకు బౌద్ధమతము కారణమట! హరప్రసాదశాస్త్రి,రాయచౌదరి యీసిద్ధాంతముచేసిరి. పాశ్చాత్యులయొక్క లభిప్రాయ మిదియేగదా! కొందఱు ఆసిద్ధాంతమును అందుకొనిపాడిరి. ముదిగొండవారు దానిని పట్టుకొని వ్రేలాడుచుండిరి. బౌద్ధమతము మౌర్యసామ్రాజ్యపతనమునకు కారణమయినచో శుంగసామ్రాజ్యము బూడిద బుగ్గియగుటకు కారణమేమి? పుష్యమిత్రుడు అశ్వమేధయాగము చేసెనుగదా! ఆ యాగఫలము ఏ నట్టేటిలో కలిసినది? గుప్తసామ్రాజ్యమేల కూలిపోయినది? కాకతీయ సామ్రాజ్యమేల కకావికలయినది? విజయనగర సామ్రాజ్యమేల విధ్వస్తమయినది? రెడ్డి సామ్రాజ్యమేల యొడ్డగెడయినది? ఈ సామ్రాజ్యపతనములకు హైందవ ధర్మము కారణము గాదా? యని నిలబెట్టి యడిగిన వారికి ముదిగొండవారేమి జవాబిత్తురు? మతమునకు, రాజ్యముల పతమునకు లంకె పెట్టుట ఈ దేశచరిత్రలో కుదురదు. కుదురు నన్నచో బౌద్ధమతముతోపాటు హైందవ ధర్మము తిట్లు దినవలసియుండును. అసలు శంకర భగవత్పాదులు అవతరించిన తరువాత హైందవదేశము పతనము కాగూడదుకదా! మఱి యిట్లు జరుగలేదేమి? మహాశక్తిమంతులగు ప్రభువు లయినచో రాజ్యములు నాలుగుకాలాలపాటు నిలిచినవి. అసమర్థులగు ప్రభువులైనచో అస్తమించినవి. అంతేగాని, యీ దేశములో బౌద్ధధర్మమువలన రాజ్యములు నాశనము గాలేదు. హైందవధర్మమువల్ల నిలబడనులేదు.

ప్రోలారెడ్డి కుమారుడగు దొడ్డారెడ్డినిగూర్చి తెలుగువారి కేమియు తెలియదు. మల్లారెడ్డి మోటుపల్లిరేవును పట్టుకొనెను. ఈ సన్నివేశమునుగూర్చియే ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశములో 'బాహాదర్పమునం బ్రతిపక్షధరణీపాలావలిం దోలి' యను పద్యమున చెప్పెను. ఆ ప్రతిపక్షధరణీపాలు డెవడో చరిత్రకారుల కంతుపట్టలేదు. ఎవరికి తోచినట్లు వారు చెప్పిరి. శివప్రసాదుగారి కల్పన యిట్లున్నది, మల్లారెడ్డి సోదరుడు దొడ్డారెడ్డిగదా! మహమ్మదీయుల దౌష్ట్యము వలన ఆత డొకసారి గోమాంసము తినవలసివచ్చినది. తల్లి యాతనికి తన మొగము చూపలేదు. తల్లియొక్క వైముఖ్యమునకు బ్రాహ్మణులే కారకులని దొడ్డారెడ్డి తలంచెను. ఊరువిడిచి వెళ్లి యాతడ్రిసారి నిజముగనే మహమ్మదీయ మతము స్వీకరించెను. అల్లాయుద్దీనని పేరు మార్చుకొనెను. దొరకిన హైందవుల నెల్ల నఱకి కాకులకు గ్రద్దలకువేసెను. నీతులు చెప్పవచ్చిన తండ్రి కన్నుగుడ్లు పీకించెను. ఆతడు ఎఱ్ఱాప్రెగ్గడను మహమ్మదీయునిగా మార్పబోవుచుండగా మల్లారెడ్డి వచ్చెను. అన్నదమ్ము లొకరి నొకరు గుర్తింతురు. దొడ్డారెడ్డి వరఫ్ అల్లాయుద్దీను దేశబహిష్కృతుడగును.

అసలీ కల్పనయందలి ఆదిమభాగము శివప్రసాదుగారి సొంతముగాదు. నోరి నరసింహశాస్త్రిగారు రచించిన 'మల్లారెడ్డి' నవలలో ఇరువది మూడవ అధ్యాయమున కిది నకలు. శాస్త్రిగారి నవలలో ఎఱ్ఱన

బావమఱది మహమ్మదీయుడై పోయినట్లు చెప్ప బడెను. అతని పేరు అలావదీను. ఇతనినుండియే మల్లారెడ్డి మోటుపల్లిని గ్రహించెను. మల్లారెడ్డి తమ్ముడగు దొడ్డారెడ్డికూడ మహమ్మదీయుడై పోయి నట్లు శాస్త్రిగారు కల్పించిరి. అతని పేరు బడే సాహబు. అతడు అలావదీను క్రింది యుద్యోగి. ముదిగొండవారు దొడ్డారెడ్డికే అల్లాయుద్దీన్ అనుపేరు కట్టబెట్టి, అతని నుండియే మల్లారెడ్డి మోటుపల్లిని జయించినట్లు కల్పించిరి. వారి కల్పన యింత మాత్రమే. దొడ్డారెడ్డి మహమ్మదీయుడయిన వృత్తాంతమును శివప్రసాదుగారు 'మల్లారెడ్డి' నవలనుండియే యథాతథముగా స్వీకరించిరి. స్వీకరించియు, శాస్త్రిగారికి కృతజ్ఞత ప్రకటింపక పోవుట యట్లుండ నిండు, ఆ విషయము నెక్కడను చెప్పలేదు. ప్రోలయను పిచ్చివానిగా భావించిన రీతియు శాస్త్రిగారి కల్పనమే. నవలలో బడేసాహబు సూర్య కవితో మాటాడిన విధానము, అలావదీను ఎఱ్ఱనలో మాటాడిన తీరు, నాటికలో అల్లాయుద్దీను ఎఱ్ఱా ప్రెగ్గడతో మాటాడిన పద్ధతిలో స్పష్టముగా గోచరించుచున్నవి. శివప్రసాదుగారు 'మల్లారెడ్డి' నవలకు ఋణపడిరి. ఆ విషయమును కప్పిపుచ్చుట హైందవ ధర్మోద్ధరణమునకు వన్నెతెచ్చునది గాదు.

అల్లాయుద్దీన్ మల్లారెడ్డి సోదరుడని చెప్పుటచే ఏ రసము ఊరలేదు. లేనిపోని నీరస కథ య్యైనది. దొడ్డారెడ్డియే తన పేరు మాయించి కొని నట్లు శివప్రసాదుగారు కల్పించిరి. మల్లారెడ్డి, ఎఱ్ఱాప్రెగ్గడ మాటాడిన పద్ధతి యుచితముగాలేదు. హైందవుడైన దొడ్డారెడ్డి పిదప మహమ్మదీయుడయ్యెను గదా! అందుచేత వారిరువురతోపాటు ముదిగొండవారును దొడ్డారెడ్డిని క్షమించిరి. దొడ్డారెడ్డి త్రాగిన హైందవరక్తమెంతని చెప్పగలము? అయినప్పటికి మల్లారెడ్డి వానిని జంపలేదు. చంపుటకు మల్లారెడ్డి యాత్మయేగాక శివప్రసాదుగారి యాత్మయు అంగీకరింపలేదు. ఎంతయినను, వాడు హైందవుడు గదా! దొడ్డారెడ్డి తాను చేసిన హింసాకృత్యములకు ఫలముగా మల్లారెడ్డి చేతిలో చచ్చియుండవలసినది. చచ్చియున్నచో కావ్యన్యాయము చేకూరెడిది. రెడ్డి రాజుల చరిత్రలో అతని అడపొడ కానరాకుండుటకు ప్రబల హేతువు చూపినట్లయ్యెడిది. శివప్రసాదుగారు రసోచిత కల్పనము చేయలేకపోయిరి.

తమ్ముడని తెలియకముందు, తెలిసిన తరువాత మల్లారెడ్డి మాటాడిన తీరు ధర్మద్రోహమునకు నిదర్శనము. తెలియకముందు మహమ్మదీయునిపై దుమ్మెత్తి పోయును. తెలిసిన తరువాత క్షమాగుణము చూపును. ప్రోలారెడ్డి రంగముమీదకు వచ్చిన పిదప, అతని గ్రుడ్లు దీయించినది, దొడ్డారెడ్డియే యని తెలిసి, మరల వెంటనే మల్లారెడ్డి యాగ్రహోద్రగుడగును. తండ్రి దొడ్డారెడ్డిని రక్షింపుమని కోరగా మల్లారెడ్డి 'నాన్నా! నీయాజ్ఞ నేను శిరసావహిస్తాను. కాని ఇది నీ ఒక్కని వ్యక్తిగత సమస్యగాదు. మన కుటుంబ సమస్యకాదు. భారతదేశ భవిష్యత్తు మొత్తాన్ని తేల్చవలసిన సమస్య. హిందూసామ్రాజ్య నిర్మాణానికి సంబంధించిన సమస్య. చేజేతులారా మమకారానికి లోబడి మతానికి ద్రోహం చెయ్యడం నా చేతకాదు' అని యనును. దొడ్డారెడ్డి శిక్షను జన్మ విముక్తిగా భావింతునని యనును. అప్పుడేమో మల్లారెడ్డి 'అబ్బా! ఏమిటి నాకీ పరీక్ష! నీవు సోదరుడవి కాకుండావుంటే ఇంతవేదన అనుభవించే వాణ్ణి గాదు. భగవాన్! ఏమిటి నా కర్తవ్యం!' అని యాక్రోశించును. దొడ్డారెడ్డి పశ్చాత్తాపతప్తుడయ్యెనని భావించిన ఎఱ్ఱన దేశబహిష్కారమే అతనికి తగిన శిక్షయని నిర్ణయించును.

ఈ సన్నివేశమంతయు హైందవ ధర్మము యొక్క ద్విముఖ ప్రవృత్తిని చాటును. తనవానికొక ధర్మము! మఱియొకనికి మఱియొక ధర్మము! హైందవుడు చేసిన దారుణ హింసాకాండ క్షమార్హము! ఏల? వాడు మహమ్మదీయుడై చేసెనియా? శివప్రసాదుగారి సంభాషణ రచనమువల్ల మల్లారెడ్డి, ఎఱ్ఱాప్రెగ్గడ హైందవ ధర్మమునందలి స్వార్థప్రవృత్తికి చిహ్నములుగా మిగిలిరి.

ప్రోలయవంటి 'ధరాత్ముని వంశంలో' అధర్ములు పుట్టరట! అందుచేత చిన్ననాడే దొడ్డారెడ్డి పవిత్రమయిన 'నందికంత పోతరాజు కటారి'తో ధేను వత్సపాదమును పొరపాటువల్ల నఱికినట్లు కల్పించిరట! ఆ పాపము దొడ్డారెడ్డిని కట్టిగుడిపినదన్న మాట! దొడ్డారెడ్డి పరిస్థితుల ప్రాభవంవల్లనా,

కొన్ని పొరపాట్లవల్లనూ దుష్కార్యాలకు లోనైనట్లు' గ్రంథకర్తగారు భావించిరట. ప్రోలయవంశములో పుట్టిన వారెల్లరు ధర్మాత్ములని యనుకొనుట పెద్ద పొరపాటు. వీరనారాయణుడు, కర్పూర వసంతరాయలు, ధర్మాత్ములైనచో వారు తమలో తామేల తన్నుకొనిరి? రెడ్డిరాజ్యమేల నశించినది? ఏవేవో తలపులతో రచనలు చేసిన నెల్లుండునో 'మహమ్మదీయము' తార్కాణముగా నున్నది. హైందవులు మహమ్మదీయులను జయించిరని పొంగిపోయి మిన్నుముట్టుచు, సాహిత్య సృష్టికి పూనుకొన్నచో ఇట్టి వికారములే పుట్టును.

శివప్రసాదుగారి ప్రకారము అక్బరు హంస కంస రావణుల వంటివాడు నృశంసనుడు. కామాంధుడు. హైందవ రక్తమును కళంకితము చేసినవాడు. అందుచే ఆయాప్రాంతలచేత కనిదీ అగా అక్బరును చిట్టించిరి. ఈ నాటికారచనమున శివప్రసాదుగారొక యుక్తి పన్నిరి. అక్బరుపైనున్న ద్వేషముకొంది యాతని శత్రువులను పొగడిరి. బైరాంఖాను తప్పులేదని నిరూపింపగా కష్టపడిరి. అక్బరు కాలమున ప్రజలు అల్లాడిపోయిరట! అక్బరు కాలము ఫ్రెంచి విప్లవకాలమును పోలియున్నదట! అతని కుమారుడైన సలీమ్ ప్రజాప్రతినిధిగా విప్లవ నాయకత్వమును వహించెనట! అబుల్ ఫైజల్ మున్నగువారు వ్రాసిన వ్రాతలు పొగడ్తలట! అక్బరు ప్రత్యర్థుల దోషములను కప్పిపుచ్చుట, అక్బరు దౌష్ట్యమును సత్యముతో నిమిత్తములేకుండ చాటుట, చరిత్రను తారుమారు చేయుట, యివి 'పిశాచరాత్రి'లో వెల్లడియగుచున్న లక్షణములు.

అక్బరు ఘనతను శివాజీ గుర్తించెను. ఔరంగజేబునకు తెలియజేసెను. పుష్యమిత్రుని పొగడుచు ముదిగొండవారు విన్సెంట్ స్మిత్ వాక్యముల నుదాహరించిరిగదా! ఆ స్మిత్తుగారే ఈ విధముగా అక్బరును కొనియాడిరి. "He was a born king of men, with a rightful claim to rank as one of the greatest sovereigns known to history. That claim rests securely on the basis of his extrordinary natural gifts, his original ideas and his magnificent achievements...". నారోజొజర్స్ను గూర్చి వ్రాసిన తరువాత కొమర్రాజు లక్ష్మణరావుగారు అక్బరును ఈ విధముగా ప్రశంసించిరి. 'ఇట్టి దోషములు కొన్నియున్నను అక్బరునందు సద్గుణములు విశేషముగా నుండుటవలన 'ఏకోహిదోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః' అను కాళిదాసోక్తి ననుసరించి యాతనిని మహాపురుషుడని చెప్పవలసియున్నది.'

రాజ్యకాంక్ష రాజుల సహజగుణము. యుద్ధము హింస అనునవి యీ గుణమునకు బాహ్యరూపములు. 'కాలానికి కత్తుల వంతెన' కట్టిన రాజులు చరిత్రలో నే జాతియందైన కన్పట్టుదురు. అట్లే బహుభార్యాత్వము రాజలక్షణము. సంస్కృత సాహిత్యమును, చరిత్రను చదివినచో ఈ లక్షణము రాజులచేత ఎట్టి పనులు చేయించినదో తెలియును. అక్బరునే పేరుపెట్టి వ్రేలెత్తి చూపింపనేల? ఆతని పెండ్లిండ్లు రాజకీయతంత్రమువల్ల జరిగినవట! భారతదేశమును పాలించిన రాజులలో ఇనుపగోచులు బిగించికొనిన రాజులెందఱుండిరి? వారి పెండ్లి పేరంటములలో ఎన్ని రాజకీయ తంత్రముతో జరుగలేదు? ఆయాసందర్భమునుబట్టి ఏ జాతివారయినను రాజులు స్త్రీల నెందఱనో చేపట్టిరి.

రాణాప్రతాపుడు వీరశిరోమణి. ఆతని చరిత్ర చదివినచో ఏ యుగమువారికైనను, ఏ ఖండమువారికైనను, ఏ జాతివారికైనను కండలు కదలియాడును. తనకున్న సమస్తబలమును కూడగట్టుకొని అహర్నిశలు పోరాడినను, అక్బరు రాణాప్రతాపుని వంచలేకపోయెను. రాణాప్రతాపుని గుండెదిటవు, స్థిరసంకల్పము, కష్టసహిష్ణుత చూచి ఏ వివేకి నవ్వోవాకము లర్పింపడు? అట్టి రాజపుత్ర సింహముయొక్క ఓజస్సు, తేజస్సు అక్బరును చిట్టకుండగనే చాట

వచ్చును. పదునాఱవ శతాబ్దమందలి యీ మహాపురుషుల చరిత్ర చదివినవారెవ్వరు, వారి నడుమ సఖ్య సంబంధములు లేమికి ఆశ్చర్యపడరు. జె. యం. షీలత్ ఏమనెనో చూడుడు "The conflict in Mewar was a contest between two minds, one bent on establishing an empire pervading the length and breadth of India and the other on preservation of the freedom of a patrimony, which though small, had so far remained unsullied by even a semblance of subjugation. The conflict was inevitable. The issue was fought with the greatest intensity and vehemence because the two sides were represented by two of the grandest personalities of the 16 th century. Yet, even though Akbar brought to its resolution all the vast resources and the best military talent he had at his command, the issue remained unresolved till the end of his life." ఇట్టి వీరపురుషుల గాథను ఎంత రసవత్తరముగానైన చిత్రింపవచ్చును. అక్బరుమీది అక్కసుతో శివప్రసాదుగారి సాహిత్యసృష్టి కావ్యత్వమువైపునకు పోలేదు. అక్బరు రాణాప్రతాపులు సంతసానులవలె ఈ నాటికలో ఒకరినొకరు తిట్టికొనిరి.

ఇక శివప్రసాదుగారి చరిత్ర ప్రకారము అక్బరునకు మహమ్మదు అలీ యనువాడు సవతి యన్న యట! ఇదెక్కడి పేరో తెలియదు. అక్బరు సవతి యన్నపేరు మీర్జా హకీమ్. కొందరు చరిత్రకారు లితనిని మహమ్మదు హకీమ్‌గా పేర్కొనిరి. ఇతడు కాబూలునకు రాజు ఇతడు తిరుగుబాటు చేసినమాట నిజము. అదియొక పెద్ద గాథ. అక్బరు ఇతనిని జయించి, క్షమించినట్లు క్షమించి, పరోక్షముగా చంపెనట! ఆధారములులేని పరమాసత్యమిది. అక్బరు ముబారక్‌ఖాన్ లోహాని చేత బైరాంఖానుని చంపించెనట! దీనికిని సాక్ష్యము లేదు. శ్రీకృష్ణదేవరాయ తిమ్మరసుల కథవలె, అక్బరు బైరాంఖానుల కథయు విషాదాంతముగా ముగిసినది. అక్బరు బైరాంఖానుని చంపింపలేదు. చంపినవాడు ముబారక్‌ఖాన్‌లోహాని. అతడు బైరాంఖాన్ శత్రుకూటములోనివాడు. కాలమనుకూలముగా నుండుటచే, అతడు నలుబదిమంది అఫ్ఘనులతోకూడి బైరాంఖానుని చంపెను. బైరాంఖాను మరణమునకు పిదప, అతని దారాపుత్రులను అక్బరు చేరదీసెను. బైరాంఖాను కుమారుడు అక్బరు కొలువులో పెద్దపారుపత్తెమును పొందెను. ఖాన్‌ఖనన్‌గా నియమింపబడెను. అక్బరు హేమూను కూడ చంపినట్లు శివప్రసాదుగారి అభియోగము. హేమూను చంపినదెవరు? అను విషయమున ఆ నాటి మహమ్మదీయ చరిత్రకారుల నడుమకాని, ఈనాటి చరిత్రకారుల నడుమకాని ఏకాభిప్రాయము లేదు. బైరాంఖాను హేమూను చంపుమని అక్బరుతో ననగా, అతడు వెనుకంజ వేసెననియు, పిదప బైరాంఖానే హేమూను చంపెననియు కొందఱు వ్రాసిరి కొందఱేమో మొదట అక్బరు తన కత్తితో హేమూ శిరస్సును స్పృశించెననియు, పిదప బైరాంఖాను తలద్రుంచెననియు వ్రాసిరి. సత్యము హేమూ మరణదృశ్యము చూచినవారికే తెలియవలెను. శివప్రసాదుగారు పై హత్యలన్నిటిని చూచి వచ్చినవారివలె నిక్కరముగా వ్రాయుదురు. వారు బైరాంఖాను తర్దిబేగ్‌ను చంపించిన విషయము నెత్తుకోలేదు. అక్బరుని దుష్టునిజేయుటకు బైరాంఖానును ప్రశంసింపవలయును. అట్టిచో బైరాంఖాన్ తప్పు నెన్నగూడదుగదా! రాజ్యారంభ కాలము నాటి సన్నివేశములలో అక్బరు పాత్రయెంతయో చెప్పలేము. అప్పటి కతడు చిన్నవాడు. పాపభారము మోయవలసి వచ్చినప్పుడు బైరాంఖాను అక్బరుకంటే ఎక్కువ పంచుకొనవలసియుండును.

శివప్రసాదుగారు అక్బరు కుమారుడగు సలీమునకు బట్టుకైరి. దీనికి కారణము అక్బరుమీది ద్వేషము. ప్రజాప్రతినిధియై సలీమ్ విప్లవమును

లేవదీసినవాడుగాడు. అతనికి మహారాజ్యకాంక్షయున్నది. తండ్రి చావున కెదురు చూచినవాడు. మదవతీ మైత్రేయములను స్వేచ్ఛగా ననుభవించినవాడు. మహాకోపి. కోపముతో వార్తాహరుని తోలొలిపించిన వాడు. అతనిలో హృదయ పరివర్తనము కలుగునని పితృమూర్తి యగు అక్బరాశించెను. ఫలము లేకపోయి నది. అబల్ ఫైజల్ ద్వారమున సలీమును బాగుచేయ వలయునని తలంచి, అక్బరు దక్కనులోనున్న అతనికి కబురుపంపెను. సలీమ్‌చే నియుక్తుడయిన వీర్‌సింగు సైనికులు, రాజధానికి బయలుదేరిన అబల్ ఫైజల్‌ను మార్గమధ్యమున ఎదుర్కొనిరి. అతని తల్దుంచి సలీమునకు పంపిరి. సార్వభౌముడు కాదగిన వాడు సలీమా? లేక సలీము కుమారుడా? ఎవడు యోగ్యుడు? అక్బరు ఒక పట్టాన నిశ్చయించి కొన లేకపోయెను సలీమునే నిర్ణయించెనని చెప్పుట కాధా రము లున్నవి. మానసింగు, ఖాన్ అజమ్ సలీము కుమారుడగు ఖుస్రూపక్షము వహించిరి. సలీమును చెఱబట్టగా ప్రయత్నించి విఫలులైరి. ఏది యెట్లు యుననేమి? చివరకు సలీమ్ చక్రవర్తి యాయెను. అతడే జహాంగీరు. ఖుస్రూ తల్లి నల్లమందుతిని ఆత్మహత్య చేసికొన్నది. కారణము తెలియదు. సలీమ్ దుష్ప్రవర్తనమువల్ల ఆమె మరణించినదని కొందఱు వ్రాసిరి. ఇట్లు చెప్పుటకు ప్రబల సాక్ష్యము లేదు. సలీమ్ చరిత యిది. మానసింగు సలీమ్ పక్షము వాడుగాడు. ఈ నాటికలో మానసింగును క్షుద్రునిగా చిత్రించి శివప్రసాదుగారు గుండెబరువు దించుకొనిరి. అతడు అక్బరు పక్షమువాడు గదా!

అక్బరు రాజపుత్ర స్త్రీలను వివాహమాడెనే కాని, మహమ్మదీయ స్త్రీలను రాజపుత్రులకిచ్చి పెండ్లి చేయలేదేమి? యని శివప్రసాదు గారొక ప్రశ్నవేసిరి. హైందవ రక్తమును కలుషితము చేయనెంచియే అక్బరీ పనిని జేసెనని సమాధానము చెప్పిరి. అక్బరు బిహారీమల్లు కుమార్తెను కోరలేదు. ఆ రాజపుత్రుడే తనకూతు నిత్తుననెను. అక్బరు అంగీకరించెను. రాజపుత్రులతోడి వియ్యము అక్బరు రాజనీతికి ప్రథమోదాహరణము. పరిస్థితుల ప్రభావమువల్ల దొడ్డారెడ్డి మహమ్మదీయుడయ్యెనని ముదిగొండవారు గడగట్టి గంటవాయించిరి గదా! అమ్మంగదేవుడు తన రాజనీతిని తానే పొగడుకొనును గదా! అట్టిచో అక్బరుకూడ పరిస్థితులనుబట్టి దూరదృష్టితో రాజ నీతి కౌశల్యముతో నడుచుకొనెనని యేల తలంప రాదు? తనకు నచ్చినపని యక్బరు చేయలేదని అత నిని నిందించుట ఏమిపని? ముదిగొండవారి యిష్టా నిష్టములు అక్బరున కెట్లు తెలియును?

'విజయశిథిలాలు' సైతము విచిత్రలక్షణము లతో పొడగట్టును. 'పిశాచాలరాత్రి'లో అక్బరు చిత్త క్షోభను వర్ణించుటకై గతాగామి సన్నివేశములను జొనుపుట సంభవించినది. 'విజయశిథిలాలు' నాటి కలోకూడ అట్టిలక్షణమే యున్నది. విజయరాఘవు నిలో పౌరుషము పుట్టుటకై గుణసాగరులు రఘునాథరాయల కాలమునాటి వృత్తాంతములను తార్కాణించును. ఆ వృత్తాంతములు రెండు. మొదటిది వేంకటపతిరాయలపై గోల్కొండ సుల్తా నులు దండెత్తినప్పటిది. రెండవది 'ఒక్కసారి రఘునాథులవారిపై - ఒకసారి ఒకవైపునుండి మధుర రాజులు, మరొకవైపు జింజి రాజులూ, ఇంకొకవైపు పోర్చుగీసు సైన్యమూ - విప్లవం తీసికొనివచ్చినప్ప టిది. ఈ రెండింటికి తోడు చొక్కనాథుని తోడి యుద్ధమునకు సంబంధించిన భవిష్యద్వృత్తాంతము కలదు. చొక్కనాథుని చేతిలో ఎట్లును చావు తప్ప దని యనుకొనుచున్న విజయరాఘవుని యభిప్రాయము నకు రూపకల్పనము ఈ మూడవ దృశ్యము.

ఈ నాటికలో గోల్కొండ బీజపూరు సుల్తా నులు తంజావూరు పైబడి దోచుకొనుచున్నట్లు, ఆ పోరు పడలేక వారికి లంచమిచ్చి విజయరాఘవుడు సంధి చేసికొనినట్లు; లంచమిచ్చుటకు కావలసిన సొమ్ము

నక్కై ప్రజలపై పన్నులు విధించినట్లు వర్ణింప బడినది. మంత్రి ప్రజల పక్షమున నిలిచి క్రొత్త పన్ను ఎత్తివేయుడని రాజును కోరినట్లు కలదు. ఏనాడును గోల్కొండ సుల్తాను తంజావూరిమీదకు రాలేదు. జింజి సంస్థానమును ఆక్రమించికొనిన గోల్కొండవారు తనపైకూడ దండెత్తుదురేమో యను భయముతో విజయరాఘవుడు వారికి లంచమిచ్చి, వారి బారినుండి తప్పించుకొనెను. బీజపూరు సుల్తానే రెండుమూడుసారులు తంజావూరుపై దండెత్తెను.

రంగాజమ్మ యింటిలో పోర్చుగీసువారి గూఢ చారిశాఖకు చెందినవాడు యతీంద్రవేషమున మకాము చేసెనని కలదు. విజయరాఘవుని రాజ్యమున పోర్చు గీసువారికి స్థానము కలదని చరిత్ర చెప్పదు. మరీ డచ్చివారు ఇచ్చవచ్చినట్లు ప్రవర్తించిరని చరిత్ర చెప్పుచున్నది. వారికిచ్చిన దానము శాసనరూపమున వెండిరేకుల కెక్కినది. రంగాజమ్మ మధుర వారితో, పోర్చుగీసువారితో పొత్తు పెట్టికొన్నట్లు నాటికలో కలదు. ఆమెయు రాజద్రోహము చేయనెంచిన దన్న మాట! దీని కాధారములేదు. రంగాజమ్మ గ్రంథ మును చదివినవారెవ్వరు, ఆమె రాజద్రోహము చేయ గలదని యనలేరు. గోల్కొండ బీజపూరు సేనల త్రుళ్లు, మధురరాజుల దండయాత్ర ఏకకాలమున సంభవించినట్లు నాటికలో నున్నది. చొక్కనాథుడు తంజావూరిపయి దండెత్తునాటికి మహమ్మదీయులు దక్షిణరాజ్యముల వైపునకు రాలేరి. వారికి మొగలుల యొత్తిడి యెక్కువ యగుటయే దీనికి హేతువు.

విజయరాఘవుని శీలమును నిరూపించుటకు, తంజావూరు చరిత్ర తారుమారు చేయబడినది. కల్ప నలు చేయవచ్చును. కాని చారిత్రక సన్నివేశముల క్రమమున కవి విరుద్ధముగా నుండరాదు. ఈ నాటి కలో జరిగినదదే. గుణసాగరులు విజయరాఘవుని చెడదిట్టును. తిట్టి సాధించినదేమి? గాంధారి వేష మున అమ్మంగిదేవుడు నడచిన తీరు బాగుగనే యున్నది. ఈ కల్పనమునకు ఆధారము చరిత్రలో కానరాదు. చొక్కనాథుని దండయాత్ర, తంజావూరు రాజ్యపతనము మొదలగువానికి హేతువులు చరిత్రలో మరొకవిధముగా నున్నవి. చరిత్రను యథాతథముగా స్వీకరించి, యుచితకల్పనలు చేసియున్నచో ఇంకను చమత్కారావహముగా నుండెడిది. విజయరాఘవుని జీవి తములో ఆదిమభాగమునో అంతిమభాగమునో వర్ణింప బూనినచో నాటిక యిట్లుండెడిదిగాదు.

'ఉత్తమ కావ్యం లౌకికావసరాలమీద ఆధారపడి వుండదు. మానసిక సంఘర్షణమీద ఉదాత్తమైన ఆత్మీయవిషయములమీద ఇతివృత్తాన్ని నిర్మించు కుంటుంది. ఏది సత్యమూ, శివమూ, సుందరము అయినదో ఏది సార్వజనీనమై, సార్వకాలికమై వుండి శాశ్వతత్వాన్ని సంతరించుకుంటుందో అది పది కాలాల పాటు నిలుస్తుందని తాత్పర్యం. కాబట్టే భాసుడు మిగిలాడు. భవభూతి మిగిలాడు. కాళిదాసు మిగి లాడు—ఇలా ఆధునికులు ఎందరు నిలుస్తారో చెప్పడం కష్టం' అని శ్రీ ప్రసాదుగారనిరి. ఇది యెంతయు నిజమే. మరి యీ నాటికల మాటేమిటి? ఇవి 'లౌకికావసరాలమీద ఆధారపడి'యున్న నాటికలు. వానిని మనసులో నుంచికొని వ్రాసినవిగావా యీ నాటికలు? ఈ నాటికలు పేరునకు మాత్రమే చారిత్రకనాటికలుతప్ప, వర్తమానకాల స్థితిగతులను ప్రతిబింబించుకొన్నవియైనవి. వీనిలో త్రికాలాబాధిత మైన కావ్యకళలేదు. వీనివల్ల ఆంధ్రభూవాస్థాయి పెరుగదు.

శాక్యసింహ.

## కబీరు వచనావళి

[కబీరు వచనావళి: తెలుగు అనువాదం: పుట్ట పర్తి నారాయణాచార్యులు. ప్రచురణ: సాహిత్య అకా డెమీ, న్యూఢిల్లీ; సోల్‌డిస్ట్రిబ్యూటర్స్: ఆంధ్ర ప్రదేశ్ బుక్‌డిస్ట్రిబ్యూటర్స్, సికింద్రాబాదు; 246 పేజీలు; వెల: రూ. 6 00.]

ఆధ్యాత్మిక చింతననే జీవన విధానంగా, ముక్తి మార్గంగా, ఆకలి దప్పులు కుమించిన ప్రాణావసరంగా యెంచిన భారత జాతిలో తత్త్వవేత్త లెందరెందరో ప్రవర్తిల్లి, తమ కర్మ, జ్ఞాన, భక్తిమార్గాలతో ఆధ్యాత్మికసీమను కాంతివంతంచేసి ధన్యాత్ములైనారు. కాని వారు వచ్చిపోయిన జాడైనా కన్పించడం లేదీ నాడు భారత భూమిలో. శంకర, రామానుజ, మధ్వా చార్యులేగాక, రామకృష్ణ, వివేకానందులు, కబీరు తుకారామ్, తులసీదాస్, సూరదాస్, వేమన, పర్వ్యజ

మీరాబాయి, చైతన్యుడు, అరవిందుడు, రమణ మహర్షి మొదలైన వారెందరో తమ తమ మాతృభాషలలో విజ్ఞాన ప్రబోధంతో భారత జాతికి తరుణోపాయాన్ని నిర్దేశించారు. ఈ యోగులందరు నిర్దేశించిన భావాలు వారి వారి భాషలలోనే ఉన్నా ఆసేతు శీతాచలమూ భారతజాతికి అవశ్యమూ ఆచరణీయమైనవే. ఐతే ఆ యోగులుద్బోధించిన భావాలలో పునరుక్తులు, అందరిలోనూ సమానంగా కన్పించే సార్వకాలిక సత్యాలు కోకొల్లలు. అంత మాత్రమేగాక పరస్పర వైరుధ్యాలతోకూడిన సూక్తులు ఒకే తత్త్వవేత్త బోధనలలోనూ దర్శనమిస్తాయి.

ఒక మహాతత్త్వవేత్త ప్రవర్తిల్లిన తరువాత కొంతకాలంవరకు ఆయన ప్రభావం శిష్యసంతతిపై నిలిచి క్రమంగా ఆచరణలో నీరసమై, మూఢనమ్మకాల కాకరమై లోకం దృష్టిలో ఆ మార్గంకూడ హాస్యాస్పదవౌతుంది. 'గౌతమముని చిన్నాస్థులకోసం కలహించిన మనదేశీయుల వైరాఘ్యాన్ని' చూచి బౌద్ధమతంలోని మంచికే దూరమయ్యారు భారతీయులు. తత్త్వవేత్తల మనస్సులలోనూ అడ్డుగోడలుంటాయి. జాతి, కుల, మత భేదాలనవి యధిగమించి సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని చాటటంలో వెనుకంజ వేస్తాయి. కాని కాలాన్నే అధిగమించి ఎల్ల మానవులొక్క యింటివారేననిచెప్పి హిందూ, మహమ్మదీయ సమైక్యతను శతాబ్దాల క్రితమే ప్రచారం చేసిన కబీరూ, 'ఈశ్వర అల్లా తేరేనామ్' అని సోదర భావాన్ని పెంపొందింపజేసిన గాంధిమహాత్ముడు విశిష్టులు. భారతీయ వేదాంతాన్ని పాశ్చాత్యులకు వివరించటంలో గణనీయమైన కృషిచేసిన రవీంద్రుడు కబీరు బోధనలను 'Poems of Kabir' పేరుతో ఆంగ్లంలోనికి అనువదించారు.

కబీరు బోధనలను తెలుగువారికి తెలియజెప్ప సమకట్టి సాహిత్య అకాడెమీవారు శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారిచేత అనువదింపజేశారు. శ్రీ నారాయణాచార్యులు బహుభాషా పండితులు. శివతాండవంతో ప్రశస్తిగాంచిన 'సరస్వతీ పుత్రులు.' సూరదాస్ బోధనలు కవితారూపంలో గానంచేసిన ధన్యజీవులు. కబీరు వచనావళి ననువదించటానికి అన్నివిధాలా సమర్థులే ననిపిస్తుంది. ఈ పుస్తకం పూర్తిగా చదివినతరువాత ఏదో కొంత ఆశాభంగం మిగలకుండా ఉండదు. అనువాదం గ్రాంధికంలో నడిచింది. స్వచ్ఛ సుందరములైన కబీరు భావాలను తెలియజెప్పటానికి నారాయణాచార్యులవారు ప్రయోగించిన గ్రాంధికభాషకు శక్తి చాలలేదు. 'రాముని మాయలోకమంతటి నానంద పఱచును. ఎవనికి చీటియందునో వాఁడు వెచ్చించువాఁడు.' ఈ వాక్యంలో భావం దుర్బోధంగా ఉన్నది. 'వేలకొలఁది పాపు లుండవచ్చును. కాని నిందకుడొక్కఁడైన నుండరాదు. ఒక నిందకుని తలపై కోటి పాపముల బరువులుండును.' ఈ వాక్యంలోని 'నిందకుఁడు' పదం కబీ రుద్దేశించిన భావాన్ని అందజేయటం లేదు. (ఆతనిని) 'సరూపుఁడో యరూపుఁడో సెప్పగాదు. తేలికయో బరువో తూపఁగాదు.' 'సెప్పగాదు'; 'తూపగాదు' అనే మాటలు కృతకంగా, అవుసరంలేని మాటల పొదుపుగా కన్పిస్తాయి. కబీరు మార్మిక మార్గానుయాయి (Mystic). ఆయన భావాలలో క్లిష్టత ఉండటం సహజం. అనువాదంలో సులభ పద్ధతిని పాటిస్తే బాగుంటుంది. ఆంగ్లానువాదంలో రవీంద్రుడీ జాగ్రత్త వహించాడు. నారాయణాచార్యుల వారి అనువాదంలో అల్పాక్షరాలలో రచన సాగించాలనే తాపత్రయం కన్పిస్తుంది. వీరీ ప్రయత్నంలో సఫలీకృతులు కాలేకపోయారని పాఠకులు గ్రహించగలరు

'Lamps burn in every house, o blind one! and you cannot see them. one day your eyes shall sunddenly be opened, and you shall see: and the fetters of death will fall from you.

There is nothing to say or hear, there is nothing to do: it is he who is living, yet dead, who shall never die again'

క్లిష్టమైన వేదాంతాన్ని, అందునా భక్తి మార్గానుయాయియైన కబీరు ప్రవచనాలను అర్థం చేసికొని అనువదించటానికి, కబీరువలెనే మార్మిక మార్గాన్ని అనుసరించిన రవీంద్రుడు అన్నివిధాలా సమర్థుడే. 'గీతాంజలి'; 'తోటమాలి'వంటి పుస్తకాలలో రవీంద్రుడు మార్మికమార్గాన్నే అనుసరించాడు. భారతీయ వేదాంతాన్ని సర్వప్రపంచానికి తెలియజెప్ప ప్రయత్నించిన రవీంద్రుడు కబీరు వచనాలను ఆంగ్లంలో అనువదించటం ఎంతో బాగున్నది.

భారతదేశంలోనివారు కబీరు పేరు విన్నప్పటికీ, కబీరు తత్త్వం ఏమాత్రమూ తెలియని జిజ్ఞాసువు లెందరో ఉన్నారు. తెలుగువారిలో అట్టి జిజ్ఞాసువులకు కబీరు తత్త్వం తెలియజెప్పి శ్రీ నారాయణాచార్యులు తెలుగువారి కృతజ్ఞతకు పాత్రులయ్యారు.

15 వ శతాబ్ది మధ్యనుండి 16 వ శతాబ్దంలో చాలకాలంవరకు జీవించిన కబీరు జన్మతః మహమ్మదీయుడైనా, నాథపంథీయుల నిర్గుణోపాసనచే ప్రభావితుడై, స్వామీ రామానందుల దయాదృష్టికి పాత్రుడై, విరాగియై, మహాభక్తుడై, యోగుల నపహాస్యముచేసి, జ్ఞానులకును యోగుల గర్వమును పటాపంచలుచేసి వేదాంత విధిని మాత్ర మార్గముల నేర్పఱచెను. కబీరు నాదమున మొండివాడు. నమ్మిన విషయమును చిత్తశుద్ధితో గాఢముగా నమ్మును. భక్తిమార్గమునకు మించినది ఆతనికి మరేమియులేదు. ఒకవిధముగా నాలోచించినచో భక్తిమార్గానుయాయుడైన యోగి యితడు. మౌఢ్యము నీత క్షీపడించును. తులసిమాలలు దార్చిన మాత్రాన, తిరుచూర్ణము మొగమున దిద్దినమాత్రాన భక్తులు గారని ంాతని పరమవిశ్వాసము. 'మాల ద్రిప్పుచుండగనే యుగము గడచినది. మనసు తిరుగుడులు మానలేదు. చేతిపూస పాఱవైచి మనసు పూస ద్రిప్పుము' (స్మరణము, 136) – ఇది కబీరు విశ్వాసము, ప్రబోధము.

కబీరు సూక్తులలో కొన్ని వేమన సూక్తులను, పోతులూరి వీరబ్రహ్మము, ఏగంటివారు, మొదలైనవారి సూక్తులను బోలియుండి తెలుగు జిజ్ఞాసువులకు పూర్వపరిచితములుగానే కన్పట్టును. సకల మతములసారము ధర్మాచరణమేగదా! అందువలన తత్త్వవేత్తల సూక్తులు పువ్వులలోని దారమట్లు, ఒక విధముగానేయుండి అంతర్యములలోని మలినమును క్షాళన మొనర్చుటకు దోహదము చేయును. కొన్నిచోట్ల కబీరు సూక్తులే పరస్పర వైరుధ్యములుగా గూడ గన్పట్టును. కబీ రన్నను 'ఆకలికుక్కవంటిది. భజనకు భంగముసేయును. దానికి ముక్క బడవేయుము. జంకు విడిచి స్మరియింపుము'. మరియొకచోట కబీరే 'నీరసమైన నగము తిండిమేలు. నిండు తిండితో సంతోషము గలుగును. పోపు వంటకము గోరినం బాపము మూట గట్టుకొనును' అనును.

కబీరుకు పూర్వమే వేదాంతులు పెక్కురు భక్తిమార్గమును తీర్చిదిద్దిరి. హిందూ, మహమ్మదీయ మత ద్వేషములు పెచ్చుపెరిగి భారత జాతిని కలచివేయ జొచ్చెను. శైవ, వైష్ణవ భేదములు హిందూ మతమును కలత పెట్టినపుడు తిక్కన హరిహరాద్వైతమూర్తిని స్మరించి మతసామరస్యమును కొంతవరకు సాధించి పూజనీయుడయ్యెను. కబీరెదుర్కొనినది మరింత గడ్డు సమస్య. మహమ్మదీయ మతము శతాబ్దుల తరబడి భారత జాతిని కబళించి తేజోవిరాజితమై కబీరునాటికి స్థైర్యము నొందుచుండెను. మహమ్మదీయుల హింసాప్రవృత్తి కబీరునకు బాల్యమునుండియు రుచించలేదు. కబీరు రామనామోన్మాదియై నూతన ప్రవక్తగా గణుతికెక్కెను. రాముని పాదము లాశ్రయించుటలో కబీరు దైవస్వరూపమునకు గిరిగీసి కొనలేదు. సామాన్యముగా భక్తులనుసరించు బాహ్యస్వరూప ఆరాధనము కబీరునకు రుచించదాయెను. మనస్సులోని చిన్మయ జ్యోతిని దర్శించి దానిని రామార్పణ మొనరించి, లేక చై–ర్పణ మొనరించి కబీరు ధన్యుడైనాడు. బాల్యమునుండి చెప్పిన సూక్తులకును, వయస్సుక్కి వాలిన తరువాత చెప్పిన సూక్తులకును నించుక భేదము పొడసూపినను కబీరు భక్తి రామపాదములనే ఆశ్రయించినట్టిది. కాముకుడు కామమునుగూర్చియే యెల్లప్పుడు చింతించినట్లు కబీరు రామునిగూర్చి ధ్యానించెను. భారతీయ ప్రవక్తలలో అగ్రశేణి ప్రవక్తయైన కబీరు సూక్తులు కొన్ని యిట పొందుపఱచుట సముంజస మనుకొందును.

'చందనము విదేశమునకు బోయినది. అందఱు పలాశమనిరి. ప్రొయ్యిలో బెట్టిరి. కాలినకొలది పరిమళ మెక్కువ యయ్యెను. (పరీక్షకుడు 207). సంగతి గలిగినంతమాత్రమున నేమి ప్రయోజనము? హృదయము కఠోరము. బల్లెము నీట నానబెట్టిన నేమగును? దాని మొన మెత్తబడదు. [దుర్జనుడు 352.]

గొప్పగొప్ప వారందఱు మోహమును వెల్లువలో